

# త్వరగా నురగను తెచ్చు సన్‌లైట్ బాద కుండ తెల్లగాను మరియు ప్రకాశవంతముగాను ఉతుకును



"మేస్టారు, నేను సొగసైన పిల్లనని చెప్పుచున్నారు. అది ఎందువల్లననగా, తల్లి నా ఫ్రాక్‌లను సన్‌లైట్ సబ్బుతో తళతళమని మెరయు నంత తెల్లగా ఉతుకును. సన్‌లైట్ యొక్క చాల ఎక్కువ మీగడవంటి నురగ త్వరగా, సులభముగా, బాదకుండా, మలినమును బయటకు తరిమివేయును."



"నేను నా క్లాసులో మిక్కిలి మనోహరమైన పిల్లను. సన్‌లైట్‌తో ఉతుకుట నారంగు ఫ్రాక్‌ను ఎంత ప్రకాశవంతముగా నుంచునో చూడండి! సన్‌లైట్ బట్టలను పాడు చేయకుండ అవి ఇంక ఎక్కువ కాలముండుటకు సహాయపడును."




S. 219-X52 TL

ఇండియాలో తయారుచేయబడినది.

# భారతి

సాహిత్య
మాస పత్రిక

సంపాదకుడు :
శివలెంక శంభుపసాద్

ఆంధ్రపత్రికా ముద్రణాలయము,
మద్రాసు

సంపుటము 31 సంచిక 2
ఫిబ్రవరి, 1954.
విడిప్రతి వెల ఒకరూపాయి






నేను మధ్యాహ్నము పుస్తకములతో హాయిగా కాలక్షేపము చేద్దామని అనుకొంటిని. కాని ఆలాగున జరుగలేదు. మా ఆయన తన పైఅధికారిని రాత్రి భోజనమునకై ఇంటికి తీసుకొని వచ్చుచున్నట్లు ఆఫీసు నౌకరు ద్వారా చీటీ పంపారు. ఏమైనా పిండి వంటలను తయారుచేద్దామనుకుంటే వ్యవధి లేదు. నాకేమియు తోచకుండ యుండినది. ఆ సమయమున దైవప్రాత్తు తపాలావాడు ఒక డాల్డా వంట పుస్తకమును నాకు అందజేసాడు. అప్పుడు నాకు ప్రాణము వచ్చింది. అందులో విశేషమైన పదార్థములను తయారుచేయు పద్ధతులుండినవి. తక్షణమే డాల్డా వనస్పతిని వాడి అనేక విధములైన పదార్థములను సకాలములో తయారుచేసి సిద్ధముగా నుంచాను.



ఈ విందు పైఅధికారిని చాల తృప్తిపరచింది. మా ఆయనకూడ చాల సంతోషించారు. డాల్డా వనస్పతి ఆహారములోని రుచినంతటిని తీసుకొనివచ్చును. ప్రతిదినము మనము తిను పదార్థములు కూడ క్రొత్తగాను, రుచికరముగాను నుండును. వండుటకు. వేపుటకు, పోపువేయుటకు, తీపి పదార్థములను తయారుచేయుటకు డాల్డా వనస్పతి దివ్యమైనది. అందులో ఇప్పుడు విటమినులు ఎ, డి కూడ యున్నవి. బజారునుండి మూతలు తెరువబడిన డబ్బాలలో అమ్మబడు క్రొవ్వుపదార్థములను కొనుట ప్రమాదకరము. ఇవి ఎంత ఎక్కువ ఖరీదు గలిగియున్నప్పటికి కల్తీ జేయబడవచ్చును. మరియు దుమ్ము, ఈగలు వాటిలో చొరుటకు వీలుండుటవలన మన ఆరోగ్యము చెడును.

సరియైన ఆరోగ్యమునకై ఆహారములో ప్రతివానికి కావలసిన శుద్ధ క్రొవ్వుపదార్థమును డాల్డా వనస్పతి ఇచ్చును. గాలికూడ చొరవకుండ సీలుచేయబడిన డబ్బాలోనుండు డాల్డా వనస్పతినే ఎల్లప్పుడు కొనండి. అది అందరు కొనుటకు వీలుగా 10 పౌనులు, 5 పౌనులు, 2 పౌనులు మరియు 1 పౌను డబ్బాలలో అమ్మబడుచున్నది. ఒక డబ్బాను ఈవేళే కొనండి.



ఇంగ్లీషు, హిందీ, తమిళము మరియు బెంగాలీ భాషలలో బొమ్మలతోగూడిన డాల్డా వంట పుస్తకము దొరకుచున్నది. 300 వంట పద్ధతులు, వంటగృహము, ఆహారము మొదలైన వాటిగురించి సూచనలు అందులో నున్నవి. దాని ఖరీదు 2 రూపాయలు మాత్రమే. 12 అణాలు తపాలా ఖర్చు వేరే.

మీ పుస్తకమునకై ఈవేళే క్రింది అడ్రసుకు వ్రాయండి:

ది డాల్డా అడ్వైజరీ సర్వీస్
పోస్ట్ బాక్స్ నంబరు 353,
బొంబాయి 1

# డాల్డా వనస్పతి

వంటకు దివ్యమైనది—ఖర్చు తక్కువ




చెట్టుతోనున్న డబ్బాకై చూడండి

HVM. 210-X52 TL




# విషయానుక్రమణిక

ఫిబ్రవరి 1954



త్రివర్ణచిత్రము : నీహార విహారము—రణవీరసక్సేనా గారు.



# "లక్స్ టాయిలెట్ సబ్బు

## ఎంతో తెల్లనైనది, ఎంతో శుద్ధమైనది మరియు దాని నురగ ఎంతో మెత్తగాను, సువాసనగాను నుంటుంది..."

అని *నిరుపారాయ్*

చెప్పుచున్నది




ఇండియాలో
తయారుచేయబడినది



నిరూపారాయ్ ఇంకా ఈలాగున చెప్పుచున్నది: శుద్ధమైనటువంటియు, తెల్లనైనటువంటియునైన లక్స్ టాయిలెట్ సబ్బు మాత్రమే నా చర్మమును పూర్తిగా శుద్ధముచేయుచున్నది. అది ఎందుచేతనంటే దాని సమృద్ధిమైన మీగడవంటి నురగ చర్మ రంధ్రములలో లోతుగా వెళ్లి చర్మముయొక్క స్వాభావిక సౌందర్యమును వెలిపి చర్మమునకు అద్భుతమైన ప్రకాశత్వమును తెచ్చును మరియు శుద్ధమైనటువంటియు, తెల్లనైనటువంటియునైన ఈ సబ్బు నా శరీరముమీద వదిలిపెట్టు సువాసనంటే నాకు మిక్కిలి ఇష్టము."

## "...అందువలననే నేను నా చర్మ సౌందర్యమునకు లక్స్ టాయిలెట్ సబ్బును ఎన్నుకొంటాను."

సినిమా తారలకు సౌందర్యమునిచ్చు సబ్బు ★

TLS. 410—52






నీహార విహారము



చిత్రకారుడు : శ్రీ రణవీర సక్సేనా.




విజయ
మాఘము

# భారతి

సంపుటము 31
సంచిక 2


# అగ్నివర్ణభోగము


శ్రీ గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి


*ఆ మొగి నిస్సపత్నము సుభావనపథమ్ము కులోచితమ్ము నౌ
భూమహిలానుపాలనముఁ బాల్యగఁదీరిచి కొన్ని యబ్దముల్,
కాముకుఁడగ్నివర్ణుఁడవలం దనమంత్రుల కొప్పగించి, యెం
తేమనెఁ గామినీజన విధేయువినూత్నయౌవనంబునన్.

కామునితూఁపులై మెఱయు కామినులం దమిఁగూడిమాడి, యా
కాముక సార్వభౌముఁడెడగాక, మృదంగ నినాదమంజులం
బౌ మణిమందిరాంతరములందు నవాభినవోత్తరోత్తరో
ద్దామమహోత్సవైకపరతన్ మఱచెన్ మదిఁబూర్వపూర్వముల్.

ఎంతయు నింద్రియార్థ మెసఁగింపని యొక్కక్షణమ్ము నమ్మహీ
కాంతుఁడు సైపనోపక యుగమ్ముగఁ, గాంతలతో నహర్నిశం
బంతిపురంబునంద నెరి హారి విహారములంద తేలుచున్,
వంతుగ దర్శనార్థమయి వచ్చుప్రజన్ గమనింపఁడయ్యెఁ దాన్.

* కాళిదాస మహాకవి అగ్నివర్ణ వర్ణనమునకు ఛాయానువాదము.

ఘనులగు వృద్ధమంత్రులెడ గౌరవబుద్ధి నొకప్డు రాష్ట్రపుం
జనములకెల్ల దర్శనమొసంగక తప్పనిదైన, నాసుద
ర్శన సుతుఁడున్, గవాక్షవివరమ్ముల నుంచిన యొంటికాలితో
డన తనరించి యత్తెఱఁగు, లక్షితుఁడయ్యె విలక్షవైఖరిన్.

కోమలకోమలాత్త నఖకుట్మల రాగవిశేష రూషితం
బై, మృదులారుణారుణ కరాతప ధాతురసోపగూఢమా
తామరపువ్వుతో నుపమఁదాలుచు వానిపదమ్ముఁగాంచి, త
న్నామమునం బ్రణామము లొనర్చుచుఁగొల్చిరి స్వప్రభుం బ్రజల్.

ఆతఁడు గాఢగాఢ కుసుమాయుధుఁడై విహరించెఁ, బ్రౌఢలీ
లాతత యౌవనోన్నత విలాసవతీ కఠినస్తనాభిఘా
తాతివిలోల కోమలతరాంబుజ గంధలసత్తదంబుగా
ఘాతత కేళిమందిరము లౌ మణిదీర్ఘికలం దమందుఁడై.

కలకొని నీటిజల్లులకుఁ గన్నులఁగాటుకలున్, సుధాధరం
బులపయి రాగరక్తిమముఁ, బోయి, కడున్ సహజమ్ములైన దీ
ప్తుల నొలికించిమించు నగుమోములతోడఁ బ్రలోభవెట్టె ర
వ్వలపుల జేని నెంతయును వాపికలందు విలాసినీమణుల్.

అలమఁగ ఘ్రాణతర్పణములౌ మధుగంధము లెల్లదిక్కులన్,
విలసిలు పానభూములను బ్రీతినిఁజేరెఁ బ్రియప్రియాంగనా
కులములఁగూడి యవ్విభుఁడు, కొల్లగఁ బూచిన పద్మినీవనీ
స్థలుల నొగిం గరేణుశతసంయుతుఁడై కరిరాజుకైవడిన్.

కదిరినవేడ్క నాస్యచషకమ్ము వల్లభుఁ డందియిచ్చుచో
మదనమదప్రవర్ధకము మద్యముఁ గ్రోంజవులూరఁ గ్రోలి ర
మ్మదవతులెల్ల; నిండుతమిమై, వకుళద్రుమరాజతుల్యదో
హదుఁడతఁడుం గొనెం బ్రియవయస్యల స్వాదుముఖాసవంబులన్.

అంకవిహారయోగ్యమగు నంకిలిఁదేజిలి, వల్గువాగ్విలా
సాంకిత వామలోచనయు, హారిమనోహర మంజులస్వనా

లంకృతనిత్యవల్లకియు, లక్షితలై యొనరింపఁబోరు, మీ
నాంకసమానుఁడా నృపశశాంకుని యంకము నెప్డు శూన్యమున్.

కాంచన కంకణమ్ములును గమ్రనిమాల్యములున్ నటింప, వా
యించుచుఁ బుష్కరమ్ములు, హరించుచుఁ దీయని నెమ్మనమ్ము, ల
య్యంచితసౌభగుం, డభినయంబునఁ దొట్రిలుచున్ నటించు క్రొ
మ్మించులబోండ్ల ముంచె నెఱిమించుత్రపన్ గురుసమ్ముఖమ్మునన్.

నటనపరిశ్రమమ్ముకతనం గడుఁదూలిన తీవమేని చె
మ్మటలఁ గరంగి జాఱినగుమంగుమ కస్తురిబొట్టుతోడ ము
చ్చటగు నర్తకీముఖము సారెకుఁ బ్రేముడిమీఱఁ ద్రావుచుం,
బటిమ నతింద్ర యక్షవిభువైభవజీవనుఁడయ్యె నాతఁడున్.

వీడక రాణివాసముల ప్రేయసు లక్కునఁ గూర్చిమన్కి, నే
జాడఁ బొసంగఁబోమి సరసల్ వెలయూటవెలందిమిన్న, లా
రేఁడు చెలంగి చెమ్మగిలు వ్రేళుల జాఱెడు పైఁడికుంచెతో
వేడుక వ్రాయుఁ జిత్రములవీధుల నవ్విరిపూవుబోఁడులన్.

ననవిరిపాన్పునుండి మదనప్రభుఁ డట్టులు లేచి యల్లనం
బనివిననున్న వానిఁ జెనవైచి భుజాలతలం గడున్ గళ
మ్మునఁగొని, యగ్రపాదములమోపిన పాదతలమ్ములొప్ప, భా
మినులు, నిసర్గచుంబనము వేఁడిరి సారె నిశాత్యయంబునన్.

అమరేంద్రుం బురుడించు దర్పమున వర్ణ్యుంబౌ మహారాజవే
షముతో దర్పణమందుఁ జూచికొని తన్, త్స్మోనాథుఁడా తండు డెం
దమునం బొందఁడయయ్యె నొయ్యనఁ బ్రమోదంబున్, స్ఫుటవ్యక్తచి
హ్నములన్ నిండిన భోగమండనముతో నట్టుల్, రవంతేనియున్.

ఇమ్మెయి మార్గమ్మునిడి యెల్లవిధానములందు, నింద్రియా
ర్థమ్ములమున్గి తేలుచు, స్మరగ్రహరాజగృహీతుఁడై యువ
శ్యమ్మును, నమ్మహీరమణుఁ, డాదటఁ బుచ్చె విలాసినీసహా
యమ్మున, నాత్మలక్షణ సమాహితవహా బుతువారముం బొరిన్.

వ్యసనములందుఁ జిక్కి యిటువర్తిలుచున్నను, నగ్నివర్ణునే
పెనఁగుభుజాప్రతాపమున కేపత్తి, దాయలు, చుట్టుముట్టు
సాహసమొనరింపరైరి; బలువై రతిరాగభవమ్ము రోగమా
రసికునిఁ గ్రమ్మెఁ, జంద్రునిఁ దిరంబుగ దక్షునిశాపమట్లుగాన్.

వినక రవంతయేనియును వెజ్జులమాటలు, దృష్టదోషభా
జనమగు సంగవస్తువును జయ్యనవీడఁ దలంపడయ్యెన
య్యనఘుఁడు; పెన్న స్వాదు విషయంబులకున్ వశమయ్యెనేని, యొ
య్యన మరలింప నింద్రియచయంబును గష్టముకాదె యెంతయున్ ?

పరిమితభూషణంబులును, పాండుముఖంబును, సావలంబమం
థరగమనంబు, కంఠమృదునాదము, గల్గఁగ, నగ్నివర్ణరా
జ్యరమణి, రాజయక్ష్మపరిహాని, యహీనమనైన యార్భటిన్
భరపడి, కామయానసమవస్థకు నీడగుపోడిమిం గొనెన్.

బ [illegible] పతి వగ్గగుచుండఁ, దదన్వవాయ మా
లలిఁ గననయ్యెఁ, బశ్చిమకలాస్థితసోమమమైనవ్యోమముం
బలె, ఘనపంకశేషమయి వాఱినగ్రీష్మపుఁ బల్వలంబటుల్,
వెలవెలఁబోవునల్పశిఖఁ బెంపఱుదీపపుఁ బాత్రమట్లుగాన్.

పలువురకుంభాలంతులకు వల్లభుఁడయ్యును నగ్నివర్ణుఁడుం,
గులపరివర్ధనంబయి యకుంఠయశంబగు సంతతింగనం .
గలుగక, వైద్యయత్నములఁ గట్టనివ్యాధి నతిక్రమింప నే
యలవున నేరఁడయ్యె, బలువాఱి, ప్రదీపము గాలినింబలెన్



# మన్నె పడుచు

శ్రీ బుద్ధవరపు వేంకటరత్నం

సాయంత్రం రమారమీ ఏడుగంట లవుతుంది. ఆషాఢంలో ఆకాశం మేఘాచ్ఛాదితమై ఉంది. దూడల తెగను తోలుకువస్తూన్న వెంకటేసు, వీరయ్య పెద్దాపురంరోడ్డు దాటుతున్నారు. సంజ వేళ కురిసిన దుక్కున్నరవానకు సురమ్మతులేక మొహం వాచిన బాట కళ్లగుంటలు చేసుకుని నీళ్ళు నింపుకున్న జవరాలివలె నిలబడిఉంది. గమ్యస్థానం ఎరుగని గొడ్లతెగలు తెగసాగిపోతున్నాయి ముందుకు. ఎక్కడ ఆగేదీ, మేత ఏడ తగిలేదీ వాటికి తెలీదు. ఎదురుగా జగ్గంపేట వైపునుండి వచ్చే కొత్తపల్లికారు హారన్ మ్రోగుతూంది. వెంకటేసు గొంతుచించుకుని అరుస్తున్నాడు "హారన్ కొట్టకండి — బాబూ". అంటూ. కాని ఆ రొదలో డ్రైవరుకు వినపడలేదు చాదరీగా రబ్బాయి కంఠం. వేగంగా దూసుకువచ్చి పడిందికారు. కొత్తగిత్తలు బెదరుతూ తోకలెత్తి రోడ్డుకు రెండుపక్కలా ఉన్న గంటిచేలలోకి ఉడాయిస్తున్నాయి. హారన్‌కి తోడు కళ్ళు దిమ్మరచేసే లైట్లవెలుగు. పసువుల తెల్లాటి కళ్లపైబడి పచ్చ పచ్చగా ప్రతిబింబిస్తూంది కాంతి ఆ సంజచీకట్లో. మొత్తంమీద దూడెల్ని తప్పించుకుని సాగిపోయేసరికి కారుకు తలప్రాణం తోక్కి వచ్చినట్లైంది.

బస్సు పోతూపోతూ తెల్లని ఆవులమీద, వెంకటేసు మల్లుపంచెమీద ఎర్రజేగురు నీళ్లు చల్లింది. నోట్లో ఏమో సణుక్కుంటూ తిట్టుకున్నాడు డ్రైవర్ని. మళ్లీ చీకటి మొదలు. కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటి. అలాగునే సాగుతూంది తెగ తప్పించుకు పోయిన గిత్తల్ని లాక్కువచ్చేసరికి అరగంటసేపుపట్టింది వీరయ్యకు. "బాబూ! ఈడ ఎక్కడేనా దాకుడే ద్దామా" అన్నాడు. "చూద్దాం పోనీరా" అన్నాడు వెంకటేసు. "పొద్దుటెనుంచీ ఏక నడక. గొడ్లకీ మనకీ కాళ్లు పుళ్ళవుతూండాయ్. ఇంకా నడిచిన మేరకు రెండింతలు సాగాలి" అన్నాడు వీరయ్య. నిశ్శబ్దంగా ఒకమైలు దాటారు. శుభ్రంగా ఉంటుందను కుని ఒక పెద్ద మర్రిక్రింద దాకుడేశారు పైలను. వీరయ్య ఓపిగ్గా ఆ చీకటిలోనే గడ్డి వేశాడు. తెచ్చు కున్న ముంతలు విప్పుకుని కాసిన్ని మెతుకులు కతి కారు.

మెత్తని జనపనారగోనెలు పరచుకుని మేను వాల్చారు. జేబులో దాచుకుని అగ్గిపెట్టెతీసి చుట్ట వెలిగించాడు వెంకటేసు. వీరయ్యకూడా పుట్టించు కున్నాడు చుట. రోడ్డుమీద సంచారం ఏమీలేదు. రాత్రి గడచినకొద్దీ మేఘాలు అధికమై చీకటిని చిక్కగా మార్చాయి. కీచురాళ్లు చుట్టుపక్కల రొద పెడుతున్నాయి. వర్షంకూడా పడుతుందేమో అను కున్నారు. ఈదురుగాలిలో నిదురపట్టడం కష్టమైంది వెంకటేసుకు. తన చాపక్రింద ఏదో కదులుతున్నట్టు పసికట్టాడు. పాములా వుంది. ఇంకా ముడుచుకు న్నాడు కాళ్లు. మెత్తని పదార్థం చాపను ఆనుకుని జరజర జారిపోయింది. శివునాజ్ఞలేనిదే చీమైనా కుట్టదు అనుకుని కళ్లుమూసుకున్నాడు.

తెల్లవారగానే బయలుదేర దీశారు పైలను. గూడచాపలు దులుపుకుని బుజానవేసుకుని జగ్గంపేట వైపు నడక సాగించారు. తన చాపక్రింద జాడనుబట్టి ఏ పొడపామో ప్రాకిఉండాలి రాత్రి అనుకున్నాడు వెంకటేసు. ఇంకొకచోట పెద్ద మండ్రగబ్బ నలిగి పోయి పచ్చడైనట్లు గుర్తించాడు వీరయ్య. మన్యపు బీళ్ళకు వెంకటేసు బయలుదేరడం ఇదే మొదలు. కొండలూ, వాగులూ, కోయవాళ్ళూ, చింత చెట్లూ జాస్తీ అని వీరయ్య చెబుతూంటే విస్తు పోతూ వింతవింతరంగులలో కలలు కనేవాడు. మధ్యాహ్నానికి యర్రవరం చేరుకున్నాడు.

తీర్థంకంటె, సంతకంటె ఇబ్బడిగా ముబ్బడిగా త్రొక్కిసలాడుతూంది పసువు. కనీసం వేయికాళ్లకు పైగా ఉంటుంది. మన్యానికి మొగలో ఉంది యర్ర వరం. మన్యపు జ్వరం రాకుండా పసువులకు ఇంజ క్షను చేస్తారు అక్కడ. ఇద్దరు డాక్టర్లు జంక్షను చావడిలో మకాం ఉంచి నలుగురు కాంపౌండర్ల సాయంతో పొడిచేస్తున్నారు సూదులతో మందు. ఇంజక్షనుకు అలవాటుపడని దూడ దొడ్డి విరుచుకుని

తోక ఎత్తుకు గంతులేస్తోంది. ఇంజక్షనుకే జ్వరం తగులుతుందని భయపడేవాళ్లు తోకకు పావలా లంచం యిచ్చి తండాలు మళ్ళించుకు పోతున్నారు. తమకు శ్రమ తగ్గినందుకు కాంపౌండర్లు డబ్బుతో జేబులు నింపుకుంటున్నారు. బెదిరించడానికి మరీమరీ "విధిగా అన్ని దూడలకూ సూదిపోటు పొడిపించాల"ని అదలిస్తున్నారు. వెంకటేసు దూడలవంతు వచ్చేసరికి సాయంత్రం ఆరుగంటలైంది. తెచ్చుకున్న కూళ్ళు అయిపోయాయి. తమనాటనుండి వచ్చిన రైతులతో చేరి రాళ్ళపొయ్యిలపై వంట చేసుకోవడానికే నిశ్చయించుకున్నారు. డాక్టరు కాంపౌండర్లు అన్ని దూడలకు ఇంజక్షను చేయించి తీరాలన్నారు. వీరయ్య వెంకటేసును ప్రక్కకులాగి "బాబూ! జర మొస్తుంది కోడెలకి. తొక్కి బేడో పావలో పారేసి మళ్ళించేద్దాం." అన్నాడు. వెంకటేసు ఒప్పుకోలేదు. తమ దూడల సూదిపోటు అయ్యేసరికి చీకటి పడింది. ఆ రాత్రికి అక్కడే ఆగిపోయారు. ఉసురుమిల్లివైపు పోయే తెగకోసం వెతికి ఒకదాన్ని జతచేసుకుని వాటి యజమానులతో పిచ్చాపాటీ చెప్పుకుంటూ పడుకున్నారు.

మరునాడు ఉదయాన్నే తెగల్ని లేవదీశారు. నడిచినడచి సాయంత్రానికి అడ్డతీగెల చేరుకున్నారు. ఆ రాత్రికి అడ్డతీగెల మకాం. మన్యపు ఊళ్ళో దొరకని చిల్లరసరకులు కొనుక్కొని జాగ్రత్తపడ్డారు. సుబ్బారాయుడు షష్ఠిదాకా వాళ్లకు అడ్డతీగెలే బస్తీ. సరదా కావాలంటే సంతకి రావాల్సిందే. అది తక్క ఇంకో ఆస్కారం లేదు. తీరికసమయంలో కొండ కోనల్లో, పచ్చికబయళ్ళలో పల్లెపట్టుల అందచందాలను చూస్తూ గడపవలసిందే.

అడ్డతీగెల్లో బయలుదేరి మధ్యాహ్నం రెండు గంటలకు ఉసురుమిల్లి చేరుకున్నారు. పేరుకే అది ఊరు. సరిగా లెక్కపెడితే యాభైకొంపలేనా ఉండవు. మనుషులు మనకంటె ఎన్నో యుగాల వెనుకటి వాసనలతో తిరుగాడుతూ ఉంటారు. బేరసారాలు, నాజూకులు తెలిసినట్లు తోచదు. కాని ఒక్కటిమాత్రం చెప్పుకోవాలి. సత్యంపై నడచే నరజాతివాళ్ళది. ఆడినమాట ప్రాణంపోయినా తప్పరు. సత్యమే వాళ్ళకో శక్తి. ప్రకృతి ప్రసాదించిన సౌఖ్యంలో ఆనందంగా కాలం గడిపేస్తారు.

వచ్చిన మూడునాళ్లవరకు మకాం చూసుకోవడం, మనుషుల్ని మంచిచేసుకోవడం, సూదిపోటుకు పులపరం దగిలిన పసువుల్ని సరిదిద్దుకోవడం సరిపోయింది వెంకటేసుకు. నాలుగోరోజున బీటి సరిహద్దుల్ని త్రొక్కి చూసుకున్నాడు. సుమారు నిలువెత్తున పట్టేసిన చెంగలి గడ్డిలోంచి ఒకరికొకరు కనుపించరు. పట్టపగలు దోబూచులాడుకోవచ్చు. తమ పొలానికి ఒకతట్టు పెద్దచెరువు. ఇంకో ప్రక్క ఊరు. ఉత్తరాన కొండ ఒకటి. ఆ కొండకూడా ఒంపుదిరిగి ఒయ్యారంగా ఆ ఊరికి దూరంగా పెట్టని గోడలా ఉంది.

మరొకదెశ కొంతదూరంపోతే అదో చిన్నవూరు. ఊరంటె అదీ పేరుకే. ముప్ఫయ్యో నలభయ్యో కొంపలు. అంతే. గడ్డి అంటే—గడ్డికాదు; దూడలకు కేవలం అక్షయపాత్ర: పాడి దూడకి మరీనీ. దాదాపు పదిరోజులదాకా వెంకటేసుకు అక్కడి సూర్యోదయాస్తమయాలూ, గూళ్లుగట్టి గుంపులుగా ఎగిరే ఆషాఢ మేఘాలూ, పచ్చని పచ్చికబయళ్ళను తలదూర్చి మేతలో మునిగిఉండే పశువుల రంగు రంగుల శరీరాలూ ఎనలేని ఆనందాన్నిచ్చాయి. ఆ జీవితం క్రొత్తరుచులతో అతని హృదయాన్ని మధురమయం చేసింది.

మన్యం వచ్చాక నెలరోజులకు వెంకటేసుకు ఇంటివద్దనుండి ఉత్తరం వచ్చింది. వ్రాసిన వారం రోజులకుగాని తమకు చేరదా ఉత్తరం. ఉసురుమిల్లికి వారానికొకసారే బీటు. నాన్నగారు వ్రాశారు— అంతా క్షేమం, మెకాలు, చిరుతలూ తిరుగుతూంటాయి. పాడిదూడల్ని కోడెల్ని భద్రంగా చూడమని హెచ్చరించారు. ఆహార విహారాదులపట్ల శ్రద్ధగా సంచరించుకోవాలన్నారు. ఉత్తరానికి అవతలి పేజీలో తన భార్య వ్రాసింది కొన్ని పంక్తులు; చదువుకుని నవ్వుకున్నాడు "...గారికి. మీ ప్రియమైన మంగ నమస్కారాలు. నాకు ఇక్కడ అంతా క్రొత్తఅన్నది మీకు తెలిసిందే. మీరు వెళ్ళినప్పటినుండి నాకు మనసు అదోలా ఉంది. ఏదో తెలియని బాధ నన్ను కలవరపెడుతోంది. వారానికోసారైనా మీ జాబుకై ఎదురు చూస్తూంటాను. సుబ్బారాయుడు షష్ఠికి మాత్రం వచ్చివేయవలెను." మళ్ళీ ఉత్తరం వ్రాయాలంటే కొర్దకూడా అడ్డతీగెల పోవలసిందే, కొత్త సంతచూసినట్లూ ఉంటుంది, ఇంటికి ఉత్తరం వేసినట్లూ ఉంటుంది—అనుకుని అడ్డతీగెల వెళ్లడానికి నిశ్చయించుకున్నారు.

## 2

మన్యపునాటసంతల్లో అడ్డతీగెలసంత చూసి తీరవలసింది. అందునా వేసవికాలంలో మరీని. ఆషాఢం

భూమిని చల్లబరచినా చివరిచురకలతో గ్రీష్మం తన పొగరు చూపుతూంది. కుంకుళ్లు, అపరాలు రాసులుగా అమ్ముతున్నారు. చింతపండుబుట్టలగిరాకీ బహుశా తగ్గిపోయి ఉండాలి. పనసపళ్ళవ్యాపారం తగ్గలేదు. సంతసంబరం, మన్నెదొరల బేరసారాలు, అక్కడిపడుచుల వింతసొబగులు చూస్తూ పోస్టాఫీసుకు సాగిపోయాడు. ఇంటికి కవరు వ్రాశాడు. వ్రాసిన ముక్కలు పదేపదే మననం చేసుకున్నాడు. “మంగాయికి...నాన్నగారు అమ్మ చెప్పినట్లు చక్కగా నడుచుకోవలెను. ఇక్కడ నేను ఖులాసాగా ఉన్నాను. తీరిక సమయంలో తెచ్చుకున్న భాగవతమూ, నవలలూ చదువుకుంటుంటాను. నిజమే. క్రొత్తాపురం. నిన్ను ఈరీతిని ఏకాకినిగా విడిచి నేనిలా ఒంటరిగా ఇక్కడ పడిఉండడం చాలా విచారకరమైన సంగతి. అయినా ఓపికపట్టవలెను. షష్ఠికి తప్పక వచ్చేస్తాను. నీవు కోరినట్లు జాబు వ్రాస్తూంటాను.”

మధ్యాహ్నం మూడుగంటలకు తిరుగుబండి ఒకటి దసులుపడితే ఎక్కి ఊసురుమిల్లి బయలుదేరాడు. ఆబండి ఊసురుమిల్లి మీదుగా ఇంకా అయిదుమైళ్లు ఎనుపకుపోతుంది. బండినిండా ఉన్నారు జనం. లాగేవి సుగాలకోడెలు. ఎదురు దిసళ్ళలో జనం ఒకళ్లనొకళ్లు ఒరుసుకుంటున్నారు. త్వరత్వరగా సాగిపోతోంది బండి. ముందు కూర్చున్నవారిలో ఇద్దరు ఆడవాళ్లు. వారివెనక ఇద్దరుమగవాళ్లు. దగ్గర బంధువుల్లాగే ఉన్నారు. తర్వాతి నలుగురూ వాళ్లకి స్నేహితులై ఉండవచ్చు. వెనకకూర్చున్నాడు వెంకటేశు. ఆతడు తక్క తక్కినవారంతా మన్యపువాళ్లు. అప్పుడప్పుడు ముందున్న ఆడాళ్లవైపు వెంకటేశు ఆశ్చర్యంగా చూసేవాడు. వారిలో ఉన్న పద్ధెనిమిదేళ్ల పిల్లసొగసూ, ఆమె చురుకూ, బండిలోని వారితో ఎరమరికలేని ఆమె పరియాచికాలు అప్పుడప్పుడు ఆతని ఒళ్లు పులకరింపజేసేవి. వారి తెలుగో క్రొత్త ఎలుసుగా అవుపించింది అతనికి. బిత్తరపోయి రెండు మూడుసార్లు ఆ పడుచువైపు వాడిగా ముడిచూపులు నిగిడించాడు. ఆమె ఇది చూసిందో లేదో—అస్తమానమూ నవ్వుతూ మాత్రం వేళాకోళాలు ఆడేది. నవ్వేటప్పటి ఆమె పెదవులూ, పలువరుసా, విప్పారుకునే ఆమె నేత్రాలూ, ఉవ్వెత్తుగా లేచే ఉరస్థలమూ బండికుదుపుతో, సమీపించే ఆసంధ్యారాగంలో వెంకటేశుకు వికారంగా ఒక వింత అందాన్ని మెరపించాయి. ఆలోచనలో మునిగి సృష్టివైచిత్ర్యాని ఆశ్చర్యపడేవాడు. ఆతని కున్నదల్లా ఒక్కటే చిక్కు. ఎంత ప్రయత్నించినా తానొక్కడే ఆ ఆనందామృత పానంలో భాగస్వామి కాలేకపోతున్నాడు. చూపులద్వారా ముఖకవళికలతో తన హావభావాల్ని ప్రకటించేవాడు. అయితే వాళ్లు—ముఖ్యంగా ఆపడుచు—తన్ను అర్థంచేసుకున్నదో లేదో అని లోలోన బాధపడేవాడు. సాయంత్రం ఏడు గంటలకు ఊసురుమిల్లిలో దించేశారు అతన్ని. మన్నెదొరలు తనపై ప్రకటించిన ఆదరణకు కృతజ్ఞత వెలిబుచ్చడం ఎలాగో తెలియలేదు. చీకటిలో చిత్రంగా వారివైపు ఒకసారి చూశాడు. ఆచూపు వీరయ్య బండికి ఎదురువచ్చిన దీపం వెలుగులోంచి ఆపిల్ల చూసిందో లేదో—తానుమాత్రం ఆనాటి ఆఖరుసారిగా ఆమెనుచూసి ప్రక్కకు తప్పుకున్నాడు. బండి సాగిపోయింది.

వీరయ్య కాచిన వేడినీళ్లు పోసుకుని వెచ్చని బువ్వదిని వగిడీ దగ్గర కూర్చున్నాడు వెంకటేశు. రాత్రి చాలాసేపుదాకా దూడల బాగోగులను గురించి ముచ్చటించుకున్నారు. క్రమంగా ఊరు మాటుమణిగింది. వీరయ్యకూడా నిద్రపోతున్నాడు. వెంకటేశు లేచి మంచంమీద వాలాడు. కాని నిద్ర రావడంలేదు. తన చుట్టూఉన్న వాతావరణం గూర్చి ఆలోచిస్తున్నాడు. అక్కడి మన్యపు దొరలు, వారి వేషభాషలు, ఆచారాలు, మూఢనమ్మకాలు, పరియాచకాలు, తగవులు, ఆతనికి ఆశ్చర్యం కలిగిస్తున్నాయి. తాను వచ్చినప్పటినుండి చూసినవి చూడకుండా ఎన్నో క్రొత్తదృశ్యాలను చూశాడు. విన్నవి వినకుండా లెక్కలేనన్ని కట్టుకథలు విన్నాడు. మంత్రాలు, మాయలు, వనంత్రాలు ఒకటేమిటి అనేక విచిత్రాలు ఆలకించి నవ్వుకున్నాడు. ప్రక్కమీద ఒంటరిగా ఉండి ప్రతివిషయం గూర్చి ఆలోచించడం మొదలుపెట్టాడు.

వచ్చీరానట్లు నిద్ర వస్తూందనిపించింది. కలత నిద్రలో కలలు కంటున్నాడు. మన్యప్రాంతం తనివితీరా చూడాలనే ఉబలాటంతో అడవిలోకి వెడుతున్నాడు. అదొక చిత్రమైన కొండదోవ. మనిషి ఒంటిగా గోడున నడువవలసిందే. ఎడాపెడా నల్లమద్దిచెట్లు చిరుమానులు దట్టంగాఉండి పట్టపగలే చీకటి చిమ్ముడానికి ప్రయత్నిస్తున్నాయి. చుట్టూ చక్కని చల్లదనం అలుముకొని ఉంది. చింతలు చిత్రంగా ఉన్నాయి. పిల్లవాడు సైతం పడుకుని విలాసంగా కాయలు కోసుకోవచ్చు. వాటికొమ్మలను వ్రేలాడు

తున్నాయి తేనెపట్లు. చిన్నిచిన్ని మబ్బుకన్నెల్లా ఉన్నాయి. ఆబాట తిన్నగా ఒక వెడల్పైన రోడ్డుకు ఆనుకొని ఉంది. రోడ్డుకు ఆవలిప్రక్కన ఫారెస్టు డిపార్టుమెంటువారి బంగాళా. దానికి చుట్టూ కప్పుగా ఉన్నాయి చింతచెట్లు. వెంకటేశు తిన్నగా బంగాళా తలుపులు తెరచుకుని లోపలఉన్న కుర్చీలో కూలబడ్డాడు. అంతటా నిశ్శబ్దంగా ఉంది. కుర్చీలో పడుకుని బడలిక తీర్చుకుంటున్నాడు

ఇంతలో ఎవరో వెనుకతట్టునుండి వచ్చి అతని కళ్ళు మూశారు. క్షణంపాటు నిరుత్తరుడై చేతులతో తన కళ్ళపైఉన్న వ్రేళ్ళను తడుముతూ ఆశ్చర్యపడుతున్నాడు. వ్రేలికణుపులు, కొనలకొనలు, గోటికొనలు, తనకు చిరపరిచితమైనవేమో అనే భ్రమను కల్పిస్తున్నాయి. క్రొత్తక్రొత్త పరిమళాలు అతన్ని మత్తిలచేస్తున్నాయి ఇంతటి సుతిమెత్తని చేతులెవరివి? తనతో ఈ కీకారణ్యంలో దోబూచులాడే వనదేవతెవరో! తాను బలవంతంగా ఆ వ్రేళ్ళు పెకలిస్తే కోమలత్వం కమిలిపోదూ? మరెలా విడివడుతాయి తన కనురెప్పలు? "ఎవరో!" లీలగా ప్రశ్నించాడు చిరునవ్వుతో. కిలకిలా నవ్వింది ఆమె. "అరే" ఆనవ్వు తాను విన్నదే. ఇదేదో మహేంద్రజాలంలాగుంది. ఆలోచనలో ఉండగానే నులివెచ్చదనం కనుకొలకుల్లో నెలకొల్పిన కుసుమకోమలకరయుగ్మం కదలిపోయింది. ఛంగున గంతువేసి ఆమె హుటాహుటిని బంగాళా పెరటి ఆవరణలోకి జారుకుంది. కొంతసేపటిదాకా వెంకటేశు కళ్ళు చీకట్లు కమ్మడం వల్ల ఆతడీప్రపంచంలోబడడం కష్టమైంది. తేరుకుని అలికిడిని వెదుక్కుంటూ పెరటివైపు మళ్ళాడు. కళ్లు వత్తులు చేసుకుని చింతగుబురు నీడల్లో తచ్చాడుతున్నాడు

దూరాన నవ్వులతో వెలికివచ్చే పిల్లపిలుపు వినపడింది. కాని స్ఫుటంగా ఆ నీడలో ఆమె అవుపించడంలేదు. ఆదెసను పయనించడం మొదలుపెట్టాడు. ఆమె ముందు; తాను వెనుక. దూరం ఎంత ప్రయత్నించినా తగ్గుముఖంపట్టదే. ఎంతదూరం నడిచాడో తను. ఇరువైపులాఉన్న చెట్టుచేమలు చల్లగాలికి ఊగిసలాడుతూ పిల్లనవ్వులు నవ్వాయి. కెలకుల రాతికన్నెలు హేళనచేశాయి. కొన్ని పిట్టలు కిచకిచలాడి కలవరపెట్టాయి అతన్ని. రంగురంగుల చింతపువ్వు చిటచిటలాడుతూ రాలుతూంది బాటపై. ఆమె మనిషేనా? లేకపోతే వనదేవతా? ఇట్టే కురంగంవలె ఛంగుఛంగున దూకుతూ తన ఆశాపాశాన్ని నిడుపు చేస్తూంది. వెంకటేశుకు తెలియకుండానే అలసట ప్రవేశించింది. ఇంక ముందుకెళ్ళలేక ఆగిపోయాడు. నిలబడ్డానికూడా సత్తువలేదు. దారివారన ఉన్న నల్లమద్దికి చేరబడ్డాడు. ఎన్నాళ్ళనుంచో తుడవబడని ఆకులు ఒత్తుగా రాలి మెత్తనిపాన్పుగా మారి జాలిగా అతన్ని తనపై సేద వాల్చమని బ్రతిమాలుతున్నట్లు తోచింది. ఆయాసంతో అక్కడనే విశ్రమించాడు

కాస్సేపటికి తేరుకుని కనులు తెరచేసరికి తన కనులు తానే నమ్మలేకపోయాడు. తాను ఆ అమ్మాయి ఒడిలో తలపెట్టుకుని పడుకొన్నట్లుందేమిటి? ఎందుకింతగా సిగ్గుతో కుంచించుకుపోతున్నాడు? అసలు ఆమెకూ తనకూ సంబంధం ఏమిటి? తను అలాగ బేలమై పసిపాపవలె ఆమె పరిచర్య పొందుతున్నాడెందుకు? కనురెప్పలు తెరచి ఆమెవైపు చూశాడు. వెంటనే నిశ్చేష్టుడయ్యాడు. అతని గగుర్పొడిచింది. ఆక్షణంవరకు ఎంతో ఆనందం, ఎనలేని సంతోషం, ఎంతో తృప్తి అనుభవించిన వెంకటేశు హఠాత్తుగా నిరుత్తరుడైనాడు. ఓహో! ఇదెంతటి మహామధుర స్వప్నమోగదా! కలా? నిజమా?—నిజంగా తాను నిన్నసాయంత్రం బండిలో చూసినపిల్ల—ఆ మన్నెపడుచు ఈమెయేనా? నిస్సందేహంగా—ఈమే—కలతనిదురతో మెలతపడింది నలతమనసు!

## 3

మరునాటినుండి మామూలు దినచర్య ప్రారంభం. రోజుకోవైపు చొప్పున బీటికి వెళ్లడం. వారం వారం ఇంటికి ఉత్తరాలు వ్రాయడం. వీలైనపుడు సంతకెళ్లి వస్తూండడం. శ్రావణభాద్రపదాలను అలాగే సాగనంపాడు. దసరాకి ఇంటికి రమ్మని వ్రాశారు నాన్నగారు. కాని అతనికి వెళ్లే బుద్ధిపుట్టందే. షష్ఠిదాకా రానని ఖచ్చితంగా వ్రాశేశాడు. తిరుగు టపాలో మళ్లీ ఉత్తరం వచ్చింది. మన్యపు సరుకులు కొనుక్కు రమ్మని వ్రాశాడు కొడుక్కి సుబ్బన్న. చేతికర్రలూ, మందుల్లోకి కావలసిన మూలికలూ, సారపప్పూ తెమ్మన్నారు. మంగ ప్రత్యేకంగా వ్రాసింది. పట్టుతేనె గావాలిట ఆమెకు. పులిగోరు పతకానికని గోళ్ళు పట్టుకురమ్మంది. ఆమె వాక్యాలు తనకెంతో తృప్తి గలిగించాయి. వచ్చి కొన్ని నెలలే అయినా ఇంటి పనులన్నీ తానే చక్కబెడుతూంది. నలుగురలోను తల్లోనాలికై మసులుతూంది. తాను చెంతలేకపోవడం మొదట్లో దిగులు గలిగించినా రానురాను మనస్సున దిటవు గల్గి ఇప్పుడు

హాయిగా ప్రొద్దుపుచ్చుతోంది. అయినా పుష్పి రోజురోజుకీ ఇంతదూరం పోతోందే? అన్న ఆమె తుదిపలుకు వెంకటేసును నవ్వించింది. ఆశ్వయుజంతోనే చలి మొదలైంది మన్యంలో. జ్వరాలను గురించి జాగ్రత్తపడాలని హెచ్చరిస్తూ ఇంటివెళ్ళి పాదీ ఉత్తరం వ్రాశారు. శరద్రాత్రులు ప్రాణగండంగా ఉన్నాయని ఒకనాడు ప్రత్యేకంగా కాగు వచ్చింది వెంకటేసుకు. మనసు చివుక్కుమంది.

ఆవాళ మధ్యాహ్నం ఖులాసాగా షికారు బయలుదేరి కొండవార చేరుకున్నాడు. ఎదురుగా ఉన్న చెరువుకు గిత్తలు, పెయ్యలు, పోతులు నీళ్లకు వచ్చి త్రాగి వెళ్ళిపోయాయి. గొడుపోతులు కంప బలిశాయి. కలగిపోయిన కొలనిజలం మళ్ళీ నిర్మలమైంది. ప్రకృతి రమణీయకతను తిలకిస్తూ ఏవేవో మధురస్వప్నాలు గుర్తుకురాగా తనలో తానే పాడుకొంటున్నాడు.

అర్ధరాత్రి వేళ
నాశా నిశాదేవి
యొడిలోన మైమరచి
యొకట నిద్రించేటి
నన్ను తటిలేపి
నవ్వించి కవ్వించి
నటించి వెడలినట్టి
పడుచు నీ వెవ్వతవు!
ఎవతెవే నీవు!!...

ఈ పాటను ఒక దారుణ సంఘటన నిలిపివేసింది. కొండ వెనుకవైపునుండి నాలుగుకాళ్ళను ఎత్తి ఒకే ఒక దూకులో తనముందు నాలుగు బారల దూరంలో పడింది తమకోడె. దానికి పరుగువల్ల వళ్లు చెమటలుపట్టింది. గుండెలు కొట్టుకొంటున్నట్టు వణకిపోతూ అదే లగువున చెరువుగట్టువారనే కొండమీదికి పారిపోతూంది. ఇది ఇంతిలా పరుగెత్తడానికి కారణం? ఊహించడానికి ప్రయత్నించే మరుక్షణంలో ఇంకొక భీభత్సం! సుగాలకోడె ఇంతలోనే ఎంతోదూరం దాటేసింది. చారలమెకం ఒకటి దానికోసం ఎంతదూరంనుండి తరుముకొస్తోందో అదీ నాలుగుకాళ్లూ ఎత్తిపెట్టి దుముకుతూపోతూంది. అంతటి భారీపులిని వెంకటేసు పుట్టినాక ఎక్కడా చూడలేదు. దూడకోసం మెకం హుటాహుటిని దౌడుతీస్తూనే ఉంది. క్షణంలో అదిగూడా అతని దృష్టిని దాటిపోయింది. దాని ధ్యాస యావత్తు కోడెపైఉంది. లేకపోతే తానీపాటికి ఎక్కడ ఉండేవాడో! ఏం జరుగుతుందో చూద్దామని గుండెలు చిక్కబట్టుకుని చరచర ఆవైపు నడిచాడు. వెనుకగానే వీరయ్యనూ, చుట్టుపక్కల ఉండే మన్నెవాళ్ళనూ పొలికేకలతో పిలిచాడు. కొద్దిసేపటికి పులిగూడా అతని కనుచూపుమేరను దాటింది. అయితే ఆ దెసకే పరుగు మొదలెట్టాడు వెంకటేసు. మరుక్షణంలో ఇంకో వైపరీత్యం! జాడీమెకం పడిపోయినట్లు పెద్ద ఆర్పు వినబడింది. దూడమాట ఏమైనా బెబ్బులి మాత్రం చచ్చిఉండాలి. ఆత్రుతతో ఆవైపు సాగినకొద్దీ మరణబాధపడుతూన్న పులి గురకకు చేరువైనాడు. దీన్నెవరు చంప సాహసించారో! తుపాకి చప్పుడైనా కాలేదే! మరి ఇది ఎలాగ చచ్చి ఉంటుంది! ఏం పాలుపోవడంలేదు అతనికి

వెంకటేసు విస్తుపోతూ ఆలోచిస్తూనే సాగిపోతున్నాడు ముందుకు. అతని కెదురుగా ఇద్దరు మన్నెదొరలు పడుచు బరబర ఈడ్చుకొస్తున్నారు, చచ్చిన పులికళేబరాన్ని. పులినీ, దాని నిడివినీ, కోరల్నీ, పంజానూ చూస్తూ భయకంపితుడై నిర్ఘాంతపోతున్నాడు. తమ దూడ తప్పకుండా బ్రతికే ఉంటుందనుకున్నాడు. ఎందుకో అతని గుండెలు వేడిగా వేగంగా కొట్టుకొనసాగాయి.

తన్ను తాను నమ్మలేకపోతున్నాడు. మన్నెపు దొరలు ఆడుకునే మాటలు శ్రద్ధగా ఆలకిస్తున్నాడు. వారి భావాలను అవగాహన చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు మెల్లగా అడుగులేసుకుంటూ. లాగలేక లాగలేక బరువుగా లాగుతున్నారు పులిని వాళ్ళు. తిన్నగా కొండవారన బడి మరోమార్గాన మళ్ళిపోయారు. వాళ్ళను ఆపి ఏవేవో ప్రశ్నలేశాడు. కొన్నిటికి వాళ్ళు సరిగా సమాధానాలిచ్చారు. కాని ఈ సంఘటనలో చివరిచురుకు బలంగా, చిలిపిగా గిలిగింత పెట్టింది. వారితో ఉన్న పడుచు తనవైపు ఆసాయంకాలం మళ్ళీ ఒకసారి నాటికి ఆఖరుసారిగా చూచి కిలకిలా నవ్వింది. ఆమెయే అలుగువేసి కొట్టి కొట్టి ఆ పులిని చంపి తమ గిత్తను బ్రతికించి ఉంటుందని తేల్చుకున్నాడు అతడు. అయితే ఆనవ్వు అతనిలో కలవరం రెక్కలిపింది. కారణం అదే నవ్వు కొన్ని నెలలక్రిందట ప్రత్యక్షంగా తన కట్టెదుట మెరిసింది. మళ్ళీ మహా మధుర స్వప్నవీథిలో ఇక్కడ, కారుమబ్బుల్లో తొలకరి మెరుపై వెంకటేసు భావజలధిలో హృదయఫలకంపై ఒంపుసొంపులతో సుళ్లు దిరిగి మళ్ళిపోయింది.

## 4

మరునాటి ఉదయం ఈ సంగతి ఊరంతా మార్మోగుతూంది, కోనలోపలి మన్నెపడుచు పెద్దపులిని అలుగులతో చంపేసిందని. జనం అంతా పండాలుగా ఆవింత చూడ్డానికి విరుచుకు పడుతున్నారు. వీరయ్య వెంకటేసుగూడా బయలుదేరారు. కోనలోని ఉసురుమిల్లికి మూడుమైళ్ళ దూరాన ఉంది. చేరుకునేసరికి చాలామంది మెకాన్ని చుట్టుముట్టి దాన్ని చంపిన పిల్ల సాహసాన్ని కొనియాడుతున్నారు. మునసబు కరణాలు ప్రభుత్వానికి రిపోర్టు చేశారు ఈ ఘనకార్యాన్ని. మన్నెపడుచుకు బహుమతీ ఇప్పించమని సిఫారసు చేశారు. నిన్న సాయంత్రం వెంకటేసుకు కనుపించిన మన్నెదొరలు ఇద్దరు అక్కడే ఉన్నారు. ఆ పడుచు [illegible]. పులి చచ్చిఉండీ భీకరంగా అగుపిస్తూంది. మధ్యాహ్నం పన్నెండు గంటలవుతూకా అక్కడే ఉండి తిరిగి ఇంటికి బయలుదేరిన వెంకటేసు మనసులో ఒక కోరిక మెదిలింది. మంగ వ్రాసిన పులిగోరు పతకంమాట గుర్తుకొచ్చింది. "రెండుగోళ్ళు కావాలి ఇవ్వడానికి వీలవుతుందా? ఖరీదిస్తాం!" అన్నాడు మన్నెదొరలతో. వాళ్ళు "వీల్లేదు పొమ్మం"టున్నారు, ఇంతలో ఎక్కడనుండి వచ్చిందో దాన్ని చంపిన పడుచు ఊడిపడింది. వెంకటేసును తేరిపార జూసింది. అతని కోరిక గ్రహించింది. "ఇప్పుడు గాదు తర్వాత చూద్దాం" అన్నట్లు జాలంచేస్తున్నారు వాళ్ళిద్దరూ. "ఇప్పుడే కావాలి శెలవెల్లుండి మేం మానాడు వెళ్ళిపోతున్నాం" అన్నాడు వెంకటేసు. ఇంతలో ఆ పడుచు చటాలున వంగి పెద్దపులి గోళ్లను వడిగా ముడిపెట్టి, పనిపెట్టి త్రుంచి రెండు వెంకటేసు చేతిలో ఉంచింది. అతను సంతోషం ఉట్టిపడే ముఖంతో ఆమెవైపు ఒకసారి తేరిపారజూచి జేబులో చెయ్యిపెట్టాడు. "అబ్బే—డబ్బక్కర్లేదు—పట్టుకెళ్లండి!" అంటూ చిరునవ్వులో ఆ పడుచు వెంకటేసు ఇచ్చే డబ్బు పుచ్చుకోవడానికి సమ్మతించలేదు.

ఇంటికి వచ్చిన వెంకటేసు మనసులో ఆ పిల్ల గుణాలు విచిత్రంగా మసలసాగాయి. ఏమిటీ ఈమె ఉద్దేశ్యం? ఎంత సాహసం! సాహసానికి తగ్గ ఔదార్యం ఆమెలో కలిగిందే—తనలో ఏ ప్రత్యేకత ఉండి ఆమెను ఆకర్షించింది? లేక ఆమెతీరే అంతా? ఆ చిరునవ్వు తన్ను చిత్తుచేసేస్తుంది. తన [illegible] ఎందుకలా ఉండాలి? ఆమెకూ తనకూ సంబంధం? జీవితంలో విధి ప్రేరితులై ఎన్నో వింత సంఘటనలు [illegible] అనుకున్నాడు.

వీరయ్య సాయంత్రం తిరిగి వెళ్ళడానికి ప్రయాణసన్నాహం చేశాడు. పక్కింటికి ఇంటికి రమ్మని మళ్ళీ జాబువచ్చింది మంగ తనకోసం బెంగపెట్టుకున్నదట. వారివారి కోరికప్రకారం కొన్నవీ, సేకరించినవీ అనేక వస్తువులు సర్దిపెట్టాడు వెంకటేసు. సాయంత్రం ఆ [illegible]కి ఆఖరు సారిగా చూసి రావడానికి బయలుదేరాడు. తిరిగి నిన్నటి సాయంత్రం తాను కూర్చున్న చెరువు వారకే వచ్చి కొండనానుకొని కూర్చున్నాడు.

ఇన్నాళ్ళుగా తనతో మైత్రి నెరపుకున్న కొండకోనలూ, [illegible] పచ్చికబయళ్ళూ దీనంగా తన వైపు చూస్తున్నట్లుంది. నిశ్చలంగా నిర్మలంగా ఆ చెరువు నిలబడిఉంది అతని ఎదురుగా. ఆ చెరువులోనికి తానెప్పుడూ దిగలేదు. చెరువులో తామరపుష్పాలూ లేవు. పోనీ అందులోవి మంచినీళ్లా గాదు. పశువులు మాత్రం అందులో నీళ్ళు తాగుతూంటేవి. అయినా కొండవారికు వచ్చినప్పుడల్లా చూస్తూండడం చేత అదీ అతని ఊహాపథంలో ఒక స్థలం చేసుకుని ఇరుక్కుపోయింది. దాని విశిష్టతను నిన్నటి సంఘటన మరీ ఎక్కువ చేసింది. ప్రకృతిమాత అందాన్ని తిలకిస్తున్న వెంకటేసును ఎవరో పిలిచారు. చటుక్కున వెనుదిరిగి చూశాడు. క్షణంసేపు నిరుత్తరుడైనాడు. తన్ను పిలిచిన వ్యక్తి నిన్న సాయంత్రం పులి వేసిన మన్నెపడుచు. మరుక్షణంలో అతని ఊహ ఎన్నో వెనుకటిఘట్టాలను వెదక మొదలు పెట్టింది.

"నిన్నే—నిన్న ఆ పులి పరుగెత్తుకొచ్చిన బాట ఇదేనా" ఆమె ప్రశ్నించింది. వెంకటేసు మనసులో ఏం తట్టిందో! త్రుటిలో విషాదరేఖలను చిత్రించుకున్నాడు ముఖంలో. "ఔను"న్నట్లు తల ఊపాడు. ఆమె మరుక్షణంలో అతని ముందుకు వచ్చింది. నఖశిఖపర్యంతమూ తన చూపులతో అతన్ని గుచ్చివేసింది. అతని విచారానికి కారణం వెదికే సానుభూతి ఆమె ముఖంలో తాండవించింది. "ఏం—అలా ఉన్నావ్?" అంటున్న ఆమెను ఎలాగైనా కూర్చుండబెట్టాలనిపించింది వెంకటేసుకు. అనేకవిధాలుగా వికారాలు విచిత్రంగా సుడి దిరిగాయి అతనిలో. కదలకుండా ఆమెరూపం కట్టేసింది. చక్కని సంధ్యారాగంలో చిక్కని తేనెను మైమరపించే ప్రకృతి రామణీయకత. కట్టెదుట కమనీయ సౌందర్య సౌరభం

"మీ ఇంటి కెప్పుడెళ్తావు?" వెంటనే అతనికి మధ్యాహ్నంనుండి జరుగుతున్న ప్రయాణసన్నాహం గుర్తుకు వచ్చింది. మళ్ళీ షష్ఠిదాకా అక్కడే ఉండి పోవాలనిపించింది. "రేపే వెడదామనుకుంటున్నాం—" "ఏం—" అన్నాడు. "అబ్బే! ఊరికే నే—మీ మనుషులు బహుచిత్రంగా ఉంటారు సుమా!" "అబ్బ!" ఈ పలుకులలో మెత్తగా ములుకు లోనికి దిగిపోతున్నట్లు ఏదో అతనినరాల్లో గ్రుచ్చుకుంటూంది అవ్యక్తమైన బాధ.—"మమ్మల్ని మరచిపోకేం" "ఎలా మరచిపోతాం. అందునా నీవంటి అందకత్తెను." "అరే. ఆ ముక్కెందుకన్నాను" అని నాలుక కరచుకున్నాడు. "అవును. నిజమే. మీ రసలు మమ్మల్ని మరుద్దామన్నా మరువలేరు. మళ్ళీ వస్తావా?" "ఏమో" అంటున్న అతనివద్ద శలవు పుచ్చుకోడానికి లేచి ఆమె ఆఖరుసారిగా "తప్పకుండా వస్తానని వాగ్దానం చెయ్యి. ఏదీ చేతిలో చెయ్యి." అంటూ తన చేతిని చాచింది. కొద్ది నిముషాలలో ఆ పడుచు వెంకటేసులో ఎంతో మార్పు తేగలిగింది. అతడు బరువుగా లేచాడు. "వస్తాను. తప్పకుండా. ఇంకా రెండేళ్ళు కవులు ఉందిగా పీటికి. నీదగ్గరకు మళ్ళీ రాకుండా నేను బ్రతుకగలనా!" అన్నట్లు జాలిగా బేలగా చూశాడు వెంకటేసు. "నిజంగా" ఈ చివరిది ప్రశ్నార్థకమో—సంభవించి తీరుతుందనే ధీమాయో, సందేహమో ఏమో—అని ఆలోచించుకుంటూండగానే ఆమె మెల్లగా వెనక్కి చూస్తూ వెళ్ళిపోయింది. వెంకటేసు చూసి చూసి విస్తుపోయాడు. ఆమె చేతిలో చేయి ఉంచాడే గాని అతని మనసు మనసులో లేదు. శరీరంగూడా ఎందుకో జవజవలాడింది. చల్లని శీతగాలి మళ్ళినందుకేమో వళ్లు వణుకుతూంది అనుకున్నాడు. అదే దృశ్యం పదేపదే ఎదలో కదులుతూండగా ఇల్లుచేరుకున్నాడు. తెల్లవారుఝామునే బయలుదేరారు బాలాంత్రం వీరయ్య, వెంకటేసులు. సుబ్బారాయుడు షష్ఠినాటికి బాలాంత్రం వచ్చారు. ప్రయాణంవల్ల ఎంతో బడలికపడ్డాం అని వాళ్ళు అనుకున్నారు; 'దూరప్రయాణం మాటలా' అని ఇంటివద్ద వాళ్ళు అనుకున్నారు.

## 5

మన్యంనుంచి వచ్చిన దూడలన్నిటినీ పట్టిపట్టి చూశాడు సుబ్బన్న. కొడుకు వెంకటేసు ఆరోగ్యాది విషయాల్ని గూర్చి కుశలప్రశ్న వేశాడు. కుప్పలు నూర్పిడి ప్రారంభించారు. రాలికలు బాగానే ఉన్నాయి. యాకరం పాతిక బస్తాలకు తక్కువలేదు. మంగలిని పిలిపించి కొడుక్కి అభ్యంగనస్నానం చేయించాడు. ఆవేళ ఇంటిలో క్రొత్తవెలుగు వెలిసినట్లైంది. షష్ఠి పగలెల్లా పండుగై గడచింది. అందరికంటె పైకి అగుపడకపోయినా ఆనందం అధికంగా వెల్లివిరిసింది మంగమ్మకే. సాయంత్రంనుండి ఘడియలు లెక్క పెడుతూంది ఏకాంతంగా వెంకటేసుతో ఎన్నో సంగతులు ముచ్చటించుకోవాలని.

రాత్రి తొమ్మిదింటికి వెంకటేసు పడకగదికి వచ్చాడు. గది ఎంతో శోభాయమానంగా అలంకరింపబడింది. ఆ అలంకరణ మంగకు తనపైఉన్న మోజు రోజురోజుకీ అతిశయించినట్లు చెబుతూంది. స్వాతివానకు ముత్యపుచిప్పవలె తనకోసం నిత్యమూ ఎదురుచూస్తూంది. బడలికగా ఉండడంవల్ల త్వరగా నిద్రపట్టింది. పెట్టెవలె ఉన్నగది. మన్యంలో ఉన్నంతగాలి ఇక్కడ లేదు. అయినా వెన్నులోంచి విపరీతంగా చలి తన్నుకువస్తూంది. వొళ్ళు ముడుచుకుని దుప్పటి ముసుగేసుకున్నాడు. ఇన్నాళ్ళయాక తన్ను కలియబోతున్న మంగ మనస్సెలా ఉంటుందో అనుకుంటున్నాడు. ఎందుకో అతనిలో ఒకసారి తాను మన్యంలో పొందిన విచిత్రానుభవం మెదిలింది. మరు నిమేషంలో శరీరం గగుర్పొడిచి ఉష్ణప్రవాహంలో మునకలిడినట్లు వేడెక్కి ఆపాదమస్తకమూ వణకిపోయింది. ఇంతలో తన్ను ఎవరో తాకినట్లు పసికట్టాడు. ఆమె తనభార్య మంగ. ముగ్ధమోహనమూర్తిగా, సరోవరంలో నిర్మలంగా వెన్నెలలో వెలుగులు వెలారించే కలువపూవు వలె ఉంది. ఆమెను చూసినవెంటనే వెంకటేసులో ఏదో ఊహ మెరుపుతీవలా దూసుకు పోయింది. తానేదో అపచారం చేసినవానివలె కుంచించుకుపోసాగాడు. పాపం! ఇదంతా తెలుసుకునే అవస్థలో ఆమె లేదని ఆమె కరస్పర్శలోని అవ్యక్తానందం అతనికి చెప్పింది.

మంగ నెమ్మదిగా మంచంమీద వాలి అతని ముసుగును తొలగించింది. ఆ క్షణంవరకు ఎన్నో ప్రశ్నలడగాలని నెల్ల తరబడివేచిఉన్న పెదిమలు కదలలేదు. ఏమి మాట్లాడాలి? ఏమిటో మన ఆప్తుల కోసం నిరీక్షించినన్నాళ్లు వాళ్లురాగానే 'ఎన్నో విషయాలు అడిగేద్దాం - ఎంతోసేపు రోజులు నెలలు మాట్లాడుకోవాలి' అనుకుంటాం. తీరా దసులుపడితే పదిపలుకులేనా రావు పెదవులవెలికి. వెంకటేసు బడలికతో నిద్రబోతున్నాడనిపించింది. అతని

పరిస్థితికి ఆమె కొంచెం ఆశ్చర్యపడక పోలేదు. తన్నెంతగా ప్రేమించాడతడు! ఉత్తరాల్లో ఎంతగానో వర్ణించేవాడే! ఇంతెందుకూ—ప్రొద్దుటనుండి సాయంత్రందాకా ఎన్నో విధాల చూపులు బరపి ఎన్ని సంగతులు తెలిపాడు! బహుశః తన్ను అడుగవలసినవి తనకు చెప్పవలసినవి ఆ చూపులే పూర్తిచేశాయేమో! ఆలోచిస్తూ తన కోమలహస్తాన్ని వెంకటేశు గుండెల కానించింది, ముందు వెచ్చగా, నులివెచ్చగా తరువాత వేడిగా—క్రమేపి చేయికాలేటంత ఉష్ణం పసికట్టింది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకోవడం ప్రారంభించాయి. తన భర్తవొళ్లు జ్వరంతో కాలిపోతోంది. అతడు స్పృహలో ఉన్నట్లు లేడు. శరీరమంతా గజగజలాడుతూంది, రెండు మూడు సార్లు పలుకరించింది. అతడు సమాధానమిచ్చే స్థితిలో లేడు.

సుమారు ఒంటిగంటకు తెలివివచ్చింది వెంకటేశుకు. మంగకు కంటికి కునుకురానేలేదు. మనసులో పరిపరివిధాల ఆలోచనలు పరుగులెడుతున్నాయి. జ్వరంతో మళ్ళీ దేహమంతా చెమటలు పట్టింది. "రెండు మంచినీళ్లు" అంటూన్న అర్ధోక్తిలోనే ఆమె లేచి భర్తకు దాహమిచ్చింది. నెమ్మదిగా చెప్పడం మొదలుపెట్టాడు "ఇంకా మేలుకునే ఉన్నావా మంగా. ప్రయాణపు బడలికవల్ల వొంట్లో పులపరంగాఉంది. అంతే. పడుకో." అంటూవుండగా ఆమె చెమ్మగిల్లినకళ్లు తుడుచుకుంటూ "మన్యంలో మీకు ఎప్పుడేనా జ్వరం తగిలిందా" అంది. ఆమె హృదయంలో ఎంతో ఆరాటం ఉన్నట్లు ఈ ప్రశ్న వ్యక్తంచేసింది. అనేక మారులు తాను పలువురివద్దనుండి విన్నది మన్యంలో సాధారణంగా జ్వరం రాకపోవడం అంటూ ఉండదని. అందులోనూ కొన్నిరకాల ఉష్ణాలు యావజ్జీవ పర్యంతము అలానే వంటబట్టి అడపాతడపా వస్తూంటాయి. "అబ్బే—నమ్మ. ఇదే మొదటిసారి. నేను ఉసురుమిల్లి వెళ్ళాక జిర్రున చీదందే. ఫర్వాలేదు. దిగులుపడకు" అని ఓపిగ్గా మన్యపు చిత్రాలు ఎన్నో ఆమెతో ముచ్చటించాడు. అతడెంత చెప్పినా మంగ హృదయంలో ఇరుక్కున్న సందేహంమాత్రం అలాగే ఉండిపోయింది.

రోజు విడిచి రోజు జ్వరం తగులుతూనే వుంది వారం దాటాక డాక్టరుగారికి చూపించారు వెంకటేశును. మలేరియా తగిలిందని నిర్ధారణచేశారు. సుమారు నెలరోజులు పీడించింది జ్వరం. కంప్లైపోయాడు. భర్తకు శుశ్రూషచేస్తూ మంగకూడా నానాటికి నీరసిస్తూంది. జ్వరతీవ్రతను అరికట్టడానికి తెల్లమందు నడిపే వైద్యుడు విపరీతంగా క్వైనైను వాడాడు. మందులో ఇంజక్షనులో ప్రయోగింపబడ్డ క్వైనావల్ల చెవుల్లో హోరుబయలుదేరింది. జ్వరం తగ్గినా చెవులు గళ్ళుపడ్డం, చెవుల్లో దంతు పెట్టినట్లుండడం గుర్తించాడు వెంకటేశు. క్రమంగా వినేశక్తి కోల్పోయాడు. బలహీనతతోబాటు చెవిటివాడైన భర్త అవస్థకు చాటుగా బావురుమని ఏడ్చింది మంగ.

ఆ విధంగా అప్పుడప్పుడు జ్వరం వస్తూనేఉంది. ఎప్పుడు వచ్చిందని భయపడి తెల్లమందు ఆపేశారు. నాటువైద్యాలు, ఆయుర్వేదం, హోమియోపతి నడపడం ప్రారంభించారు. కాలభ్రమణంతో క్రమంగా మళ్ళీ తొలకరించింది. పొలమంతా కుదరగానే ఊడ్పు పడింది. వేసవికాలమును వెంకటేశు వొంట్లో నెమ్మదించినా పూర్తిగా కోలుకోలేకపోయాడు. మంగ ప్రాణానికి కుదురేలేదు. మళ్ళీ మన్యానికి దూడలను తోలే రోజులొచ్చాయి. తాను మన్యం వెళ్ళడానికే నిశ్చయించుకున్నానన్నాడు వెంకటేశు. అయితే సుబ్బన్న, మంగా ససేమిరా వద్దన్నారు. "వెళ్ళి తీరవలసిందే. ఈమారు అక్కడ యాభైయకరాల బీడు అమ్మకానికి వస్తుంది. ఖాయపర్చుకుని మకాం ఏర్పాటు చేయిస్తాను. తప్పదు." అని మన్యం బయలుదేరాడు. వీరయ్యగూడా తోడుగా వెళ్ళాడు. కొడుకు మంకుపట్టుకు కాదనలేకపోయాడు సుబ్బన్న. జాగ్రత్త అని మరీమరీ హెచ్చరించి మందులు యిప్పించి సాగనంపాడు. అతని మనస్సులో చెప్పలేని మమకారం, ఏదో తీరనిబాధ సుడులు తిరిగాయి. మంగకు గుండె నీరై వాకలు వారింది. భర్తను కౌగిలించుకొని ఎంతో విలపించింది. "వెళ్ళకండి" అని వేదనతో ప్రతిమాలింది. ఆమెను ఓదార్చి ధైర్యం చెప్పి బయలుదేరాడు. విధిలేక భర్తకు కన్నీటితో వీడ్కోలిచ్చింది మంగ. మీరు మళ్ళీ వచ్చేపర్యంతం ఈకన్నీరు ఆరదని కనుకొలకులు దీనంగా సమాధానమిచ్చాయి. దూడల తెగతో వెంకటేశు వెర్రి నిశ్చయంతో బాలాంత్రం విడిచి సాగిపోయాడు.

నడిచి నడిచి మూడునాళ్ళకు ఉసురుమిల్లి చేరుకున్నాడు. ఈ ఏడాదిలోనూ అక్కడ పెద్దమార్పు ఏమీ అవుపించలేదు. ఎటొచ్చీ గడ్డిమాత్రం త్వరగా తొలకరించిన కారణంగా – తెగపట్టింది. వచ్చిన

రెండుమూడు నాళ్ళలో విషంతా కలయదిరిగి దూడలకు వసతి బాగుచేయించి మళ్ళీ మన్యం జీవనం ప్రారంభించాడు వెంకటేశు.

## 6

ఉసురుమిల్లి వచ్చాక రెండు నెలల కాలంలో నాలుగైదుసార్లు కోనలలోన పశువులమీద మెదిలింది వెంకటేశు హృదయంలో — కాని ఆ మెరుగుదార్పు అంత తీవ్రంగా ప్రయత్నించడానికి ప్రోత్సాహమివ్వలేదు మనస్సు. దానికితోడు మన్యంలో శ్రావణమాసంలో ప్రబలిన జాడ్యంవల్ల కుదురు తప్పింది. సాధారణంగా కలరా సోకిందంటె అక్కడిఊళ్ళలో చాలామట్టుకు జనాభాను తుడిచేయందే పోదు. సుమారు పదోవంతు కోనాటి పరామర్శించి పోతూంటుంది మాన్యాన్ని — ఆరోగ్యసౌకర్యాలు బహు తక్కువ. జాడ్యంవచ్చినా దేవునిమీద భారంవేసి అమ్మవార్లకు ఆదిశక్తులకు మొక్కడం, జాతరలు చేయడం, బలులివ్వడం ఇంకా ఎన్నో మూఢాచారాలు ప్రకటించడం తప్ప ప్రజలలో వికాసం తక్కువ. ఉన్నన్నాళ్ళు తీవ్రంగా ఉంటుంది వ్యాధి జనాభాను పెద్దదిగా బలి గొంటుంది. ఇంకా ఇపుడు నయమే—పూర్వం కలరా వచ్చిందంటే బ్రతికి బయటపడ్డం, పులినోటికి వదలినదానికంటె ఎంతో గొప్ప అదృష్టం అనుకునే వారు.

అలాగు అలాగునే బయలుదేరి కలరా ఉసురుమిల్లి వచ్చింది. అయిదువందల జనాభాలోను యాభైమందిని పొట్టబెట్టుకుంది. వెంకటేశు వీరయ్యలు తొలుత దిగులుబడ్డా దైవంమీద భారంవుంచి జాగ్రత్తగా కాలక్షేపం చేశారు. అనేకఊళ్ళలో చనిపోయినవారికి సంస్కారం జరిపే మంచాలతోనే శ్మశానంలో పారేశారు. మహామ్మారిలా, దావాగ్నిలా, మన్యంలో స్వైరవిహారం చేసి వేలాదిప్రజను బలికొంది కలరా పిశాచి. కొన్నితావుల్లో ఈగల్లా దోమల్లా రాలిపోతున్నారని చెప్పుకుని భీతాహులైనారు ప్రజ. కలరా ముమ్మరంగా ఉన్నపుడు ఒక ఊరినుండి ఇంకొక ఊరికివెళ్లే ఆచారం మానుకుంటారు అక్కడ. అతి సమీప బంధువులైనాసరే గడపకదలరు. పోయినవాళ్ళు పోతూన్నా గుండెలు రాయిచేసుకుని చూస్తూ ఊరుకుంటారు అంతే. ఎనలేని మూఢాచారాలు మిన్నులై ఎవరిప్రాణం వారికే నిరుకై తోటిమానవుల దుర్భరస్థితికి కన్నీరు గార్చి, 'అయ్యో!' అని పరామర్శించే ధైర్యాన్ని కూడా ప్రదర్శింపలేని నిర్భాగ్యజీవులు వారు. అదొక విచిత్రమైన వింత వాతావరణం.

ఆగస్టు నెలతో ఉధృతం తగ్గింది. మళ్ళీ మన్య ప్రాంతంలో నిత్యసంచలనం బయలుదేరింది. వెంకటేశు ఎంతో ఆతురతతో అద్దతీగల వెళ్లాడు. తనకు పనిబాకీ వచ్చిపడిఉన్న ఉత్తరాలు చూసుకున్నాడు. చాలామట్టుకు ఇంటివద్దనుండి వచ్చినవే. ఉత్తరంమీద ఉత్తరం వ్రాశారు సుబ్బన్నగారు—జాగ్రత్త అని హెచ్చరిస్తూ వెంటనే ఎలా ఉన్నదీ తెలియచేయమని కోరుతూ. సరే. మంగ లేఖలు చెప్పనక్కరలేదు. అవి కేవలం కన్నీటిధారలే. [illegible] అన్నిటికి సమాధానం వ్రాశాడు. కొడుకు నుండి ఆలస్యంగా ఉత్తరం వచ్చినా బాలాంత్రంలో ఇంటిల్లిపాదికి కంటినిండా కునుకుపట్టింది మంగకు లిప్పు. మళ్ళీ పక్షినాటికే వస్తానని వ్రాశాడు వెంకటేశు.

శ్రావణమూ, భాద్రపదమూ, ఆశ్వయుజమూ వెళ్లాయి. మళ్ళీ కార్తీకం ప్రవేశించింది. ఇదేమిటో ఈ ఏటిఫలం! పశువులకు మొదలైంది పెద్దజబ్బు. ఎక్కడి కక్కడ బీళ్ళలో రాలిపోవడం ప్రారంభించాయి పైలు. పాడిగేదెలు, కోడెదూడలు తెగ చచ్చిపోతున్నాయి. మనుష్యులకే గతిలేదే—పశువుల కెక్కడి నుంచి వస్తుంది వైద్యసదుపాయం? ఒక్కొక్క బీటికి వందేసి కాళ్ళదూళ్లను తోలితే ఒకటో రెండో కూడా బ్రతికిబయటపడ్డం దుర్లభమైంది. ఎముకలప్రోవుల దుర్వాసనలతో పచ్చిక బయళ్ళు శ్మశానాలుగా మారి గవులుకంపు కొడుతున్నాయి. వెంకటేశు తెగను ఊపి ఊపి వదలేసింది దాష్ట్యం. వెయ్యి రూపాయలు విలువచేసే గొడ్డుగేదెలు మూడు చచ్చిపోయాయి. రెండు వల్లావులు పడిపోయాయి. దుక్కిటెడ్లు నేలకూలాయి నాలుగు కాళ్లు. తన ప్రాణంపోయినా బాగుండును ఈ పశునష్టం కన్నా అనుకుని విలవిలలాడాడు వెంకటేశు. చిన్ననాటనుండి దూడలను మచ్చిక చెయ్యడంలో ఆరితేరిన ఆ యువక హృదయం తమ సంపదకుపట్టిన దుర్గతికి విలపించింది. అయితే అది విధిలిఖితం. ఏంచేస్తాడు? ఇంకా తనకు నయమే. పొరుగుకమతాలకు ఇంటికినొక్కే దూడలేదు. స్వతంత్రంవచ్చి ఇన్నేళ్లయినా పశువులకుగాని మనుష్యులకుగాని కుదురైన ఆరోగ్యవసతులు కుదర్చలేకపోయిన ప్రభుత్వాన్ని దుయ్యబడుతోంది ప్రజ. ఇంకా ఈ ఆటవికయుగంలోంచి అభ్యుదయానికి

పోవాలంటే ఎన్నేళ్లు పడుతుందో అని దీర్ఘంగా నిట్టూరుస్తున్నాడు.

మార్గశిరం ప్రవేశించింది. మన్యంలో చలి ముదిరింది. ఈపికు అన్నీ విపరీతాలే సంభవిస్తున్నాయి అన్నట్లు చలికూడా ఎముకలు కొరకటం మొదలు పెట్టింది. ఈ నెలలో రెండుమూడుసార్లు ఎంకటేసును పరామర్శించింది చలిజ్వరం. ఎవరికీ చెప్పలేదు. తనతో తెచ్చుకున్న మందు కప్పులు వాడుకుని ఊరుకున్నాడు. ఉష్ణం ఆగలేదు. తిరగబెట్టింది. తిరగనివ్వకుండా మంచం పట్టించింది. ఎంకటేసు అలాగే తీసుకుంటూ తరులంఖణాలు చేశాడు. ఇసంగా చూస్తే వీరయ్యకు భయమేసింది. ఒకవంక చావగా మిగిలిన దూడలను సరిచెయ్యడానికే ప్రాణం చాలటంలేదు వాడికి. కాపు పరిస్థితి వాడి ఆందోళన అధికం చేసింది

మరో వారంరోజులకు బాలింగం ఉత్తరం వచ్చింది మన్యంనుంచి. "కామందులు సుబ్బన్న కాపుగారికి. మీ బానిస వీరయ్య దండాలు పెట్టి వ్రాయించిన విన్నపం—చిన్నకాపుగారికి వంట్లో సుస్తీగా ఉంది. పన్నెండు కటికలంఖణాలు చేశారు. మంచంమీదనుంచి లేవలేక పోతున్నారు నాకేంటో మనసు బాగులేదు. తమరు వెంటనే దయచేయించాలి. మందూమాకూ చూసే దిక్కు లేక ఎంకటేసుగారు బాధపడుతున్నారు. మీ పాదాలకాడుండే వీరడు" కార్డు పూర్తికాకుండానే సుబ్బన్న కన్నీటి బిందువులు దాన్ని తడిపేశాయి. మరునాడే మన్యం ప్రయాణంకట్టాడు. ఆయుర్వేదంలో దిట్ట అనిపించుకున్న ఆచార్యులుగారిని గూడా వెంటదీశాడు. తను గూడా వస్తానని కోడలు పట్టుబట్టింది. సుబ్బన్న వద్దని వారించాడు. పెనిమిటిని చూడకుండా ఉండలేనని వలవల విలపించింది మంగ. వద్దన్నాడు మామగారు. "ఏమో—ఎలా ఉంటుందో మామయ్యా" అని బావురుమన్న మంగ వాక్కుకు కతుక్కుమన్నది సుబ్బన్న గుండె. ఆమె ఏదో అపసవ్యం పలికినట్లు అతని హృదయం ఆరాటపడింది. ఇంక కాదనలేక పోయాడు. ముగ్గురూ రెండురోజుల్లో అంబీలమీద వచ్చినట్లు ఉసురుమిల్లిలో వాలారు.

పెద్దకాపును చూడగానే వీరడికి ఎంతో బాధ్యత తప్పినట్లైంది. తన నెత్తిమీదనుంచి ఏదో కొండ దించేసినట్లే భావించాడు ఆ అమాయికుడు. కలరాడు తట్టుకు నిలిచిన తాను కాపును ఈ మన్య జ్వరాలకి బలిపోతాడో [illegible] తాను వినుకుంటూన్నాడో బాధ [illegible] అనాటిదాకా [illegible] చేసుకుంటూ వచ్చి పోయింది. [illegible] ఎక్కడో నాకు బలం [illegible] దశలో ఉన్నప్పుడు [illegible] ఆచార్యులు. తాను [illegible] కాపన్నా [illegible] మందును రావడానికి [illegible] మంచిపనే జరిగిందని సంతోషించాడు సుబ్బన్న. లేకుంటే ఈ గడి మన్యంలో అంటరాని దురవస్థలో ఉన్న కొడుక్కి [illegible] గంజి కాచేదిక్కు లేకపోయేది. నిస్త్రాణంలోనే బలహీనంగా పలుకరించాడు ఎంకటేసు తండ్రిని, భార్యనీ. మంగను చూడగానే [illegible] దాగిఉన్న [illegible] —[illegible] పెల్లుబికింది. ఆమెను చేతులతో పట్టి, [illegible] ప్రేమతో ఆమె కన్నీటిని తుడుస్తూ ఊరడించాడు భార్యను. భర్తను ఆ స్థితిలో చూసిన ఆ ఇల్లాలి లేతహృదయం కన్నీటిలో కరిగిపోయింది.

ఆచార్యులుగారి ఆయుర్వేదం గుణమివ్వలేదు. మరి మూడునాళ్లకు ఎంకటేసు స్థితి విషమించింది. క్రమేపీ మాటపడిపోయింది. మాపులతో సంజ్ఞలుతప్ప మరేమీ ఆస్కారం లేకపోయింది. మంగను సూత్రం అనుకుంటూ చిన్న [illegible] సూచించేవాడు. సుబ్బన్న సలహాకై ఉసురుమిల్లి అంతా గాలించాడు. ఒక మన్నెదొర ఆలోచించి అన్నాడు "ఏమో ఏ హస్తంలో ఏ గుణముందో. ఇంతటి ఆచార్యులు వారికే తగ్గలేదు. ఆ చిట్కాలకు తగ్గుతుందా? అయినా ప్రయత్నించండి. కోనలోవలో ఒక వైద్యుడున్నాడు—ఏ మూలికైనా పసరైనా పనిచేస్తే మీ అదృష్టం" అని. వారికి సాయపడి వెంకటేసును లోవకు తరలింపజేశాడు. తన్ను కోనలోవకు తీసుకెళుతున్నట్లు గుర్తింపగలిగాడు ఎంకటేసు. మంగ ఆ ముహూర్తంలో అతని కన్నులలో మెరసిన ఆనందాన్నీ తృప్తినీ చక్కగా చూడగలిగింది. ఎవరితో ఎప్పుడో చేసిన వాగ్దానం అవసానకాలంలో పూర్తి చేసేటప్పుడు జీవుడు పొందే అవ్యక్త మధురానందం అది. దీనికిగల కారణం ఆమె ఊహింపలేకపోయింది.

కోనలోవకు వచ్చిన రెండు రోజులకు లాభం లేదని అంతా పెదవి విరిచారు. చిట్కావైద్యం ఏ పని చేస్తుందీ పెద్దపెద్ద వైద్యులే వదల్చలేని రోగానికి అన్నారు కొందరు. అసలు ఇది నిలవడానికి వస్తే

గదా అనుకున్నాడు సుబ్బన్న. భర్త మరణబాధ పడుతూంటే చూడలేక కన్నీరు కార్చే మంగను ఓదార్చలేకపోతున్నాడు ఆచార్యులు. ఇదెక్కడి ఋణానుబంధమో? తానెక్కడ పుట్టాడు? ఎక్కడి బాలాంత్రం? ఎక్కడ కోనలోవ? అనుకుంటూ వీధిలో వట్టిగడ్డిపై పడుకోబెట్టబడ్డ వెంకటేశు మరణ బాధను చూస్తూ వచ్చేపోయేవాళ్లు వాపోవడం మొదలుపెట్టారు. "నలుగురూ నాల్గు నీళ్ళ చుక్కలు పోయండి." అని ముత్తైదువుల్ని ప్రార్థించింది మంగ. ఏ హస్తంలో ఏ గుణం ఉందో ఎవరికెరుక? శ్మశానంలో పడుకోబెట్టిన కట్టెలు కూడా లేచాయట. ఏ దేవుడైనా అడ్డుపడి నా పసుపూ కుంకుమా నిలబెట్టకూడదూ? ఓహో! ఏమిటో హైందవ నారీ హృదయకాంక్ష! అయిదోతనం అంటే ఎంత మమకారం! ఎంత తీపి! అది కరిగిపోతూ తరిగిపోతూంటుంటే ఎంతటి ఎనలేని వేదన? ఒక్కొక్క పడుచూ 'నారాయణా' అంటూ పుడిసెడునీళ్ళు ఆ గొంతులోపోస్తూ తప్పుకుంటున్నారు. భర్త శిరస్సు తొడపై పెట్టుకుని "పొయ్యండి తల్లీ! పొయ్యండి. సావిత్రిలాగ, "నా తాళిగట్టిదైతే మీ చేతుల్లో నీళ్లే అమృతమవకూడదూ" అంటూ దుఃఖిస్తూ ప్రాధేయ పడుతూంది. నలుగురితోబాటూ ఒక మన్నెపడుచు వచ్చింది ఆమధ్యకు. అందరిలాగే ఆమెనుగూడా ఆ తుదికంటిచూపులు దీనాతిదీనంగా తన్ను రక్షించమని చూస్తున్నాయి. ఆమె చేయెత్తి రెండునీళ్లు పోయబోయి అతనిముఖం పరీక్షించిందొకసారి. "ఏమయ్యా! అలా చూస్తావూ? చివరివెలుగు కూడా చీకటివాత బడుతూందా?" అని ఏడ్చింది మంగ. కాని ఆ పడుచు అదేమీ పట్టించుకోలేదు. తదేకదీక్షతో ఆ పడుకోబెట్టబడిఉన్న మానవదేహం ఆపాదమస్తకమూ చూపులతో కెలికివేసింది. "ఆఁ - నువ్వు వచ్చావా" అంటూ వంగి అతనిముఖంలోంచి కన్నులలోకి తేరి పారజూచింది. ఆమెనుచూచిన ఆ కన్నులు భారంగా రెండు నీటిబొట్లను పైకుబికించాయి...అంతే. తటాలున ఆ పడుచు లేచి లేడివలె ఒకవంక పరుగెత్తింది. ఇదంతా చూస్తూ మంగ, ఆమెకంటె ఆచార్యులు, వీరికన్న సుబ్బన్న ఆశ్చర్యపడ్డారు. ప్రజలమాట చెప్పనక్కర లేదు. త్రుటిలో ఆ పడుచు దోసెడినీళ్ళతోడి ఆకుదొన్నెతో ప్రత్యక్షమైంది. స్వచ్ఛమైన ప్రకృతిలోని అమృతమయమైన పయఃపూరం. ఆనందంతో ఆప్యాయంగా ఆ పడుచు ఆ నీటిని వెంకటేశు గొంతులో పోసింది. నెమ్మదిగా గుటక వేస్తున్నట్లు అతనిగొంతు ముడి కదలింది. దోసెడు నీళ్ళు గుటగుట శబ్దంతో త్రాగేశాడు. ఆ అవస్థలో అతడు నీళ్లు త్రాగడం అందర్నీ అబ్బురంలో ముంచి తేల్చింది. ఆ క్షణంలో భర్త కనులలో నూతనకాంతి అవుపించింది మంగకు. తొలకరిమెరుపు భూదేవిని, మబ్బుకన్నె మయూరకన్యను అత్యంతానంద పారవశత నొందించినట్లు మంగను ఆ చూపు మైమరపించేసింది. ఆమె నిరుత్తర అయింది.

వెంటనే ఆ మన్నెపడుచు వెంకటేశు ప్రక్కన కూర్చుని "చలిగాలి. లోపలకు తీసుకుపదండి. ఫర్వాలేదు. ఈ ప్రాణి ఇంక బ్రతుకుతాడు. నాకోసం ఎంతదూరంనుంచి మళ్ళీ వచ్చాడు!" అంది. ఆమె మాటలువిని ఆచార్యులు అలని నాడి చూశాడు. చిరునవ్వు పెదవులపై చిందులాడింది. నెమ్మదిగా సాయంపట్టి లోపలికి తీసుకెళ్ళారు వెంకటేశును. "ఎవరు తల్లీ నీవు? నాపాలిటి భాగ్యదేవతవు. సాక్షాత్తు ఆ సావిత్రీదేవియే నన్ను ఉద్ధరించడానికి నా మొరాలించి నిన్ను పంపింది" అంటూ ఆపడుచుపాదములంటి ప్రొక్కింది మంగ. మన్నెపడుచు పకపక నవ్వింది. ఆ నవ్వులో కిలకిలలేదు. "నీ భర్తకు బాగా నయమైన తర్వాత అడుగు-నే చెప్పగూడదు" అంది. మరి నెల్లాళ్లకు పథ్యంబెట్టారు. బాలాంత్రం బయలుదేరారు వెంకటేశు, సుబ్బన్నలు కుటుంబంతో. వాళ్లకు మళ్ళీ వీడ్కోలివ్వడానికి అందరితోబాటు ఆ మన్నెపడుచూ వచ్చింది. "మమ్మల్ని మరచిపోకండి. మంగా! నీవు ఎంతో అదృష్టవంతురాలివి" అంది వెంకటేశువైపు అదోకలా చూస్తూ. వెంకటేశు ముఖం సూర్యోదయ సమయంలో ముడుచుకునే కలువలా సిగ్గుతో కుంచించుకుపోయింది. "సరే. చాలు. ఇంతకీ ఆ సంగతి చెప్పేవుగావుగదా" అంది ఆమెను సాగనంపుతూ మంగ—"నే చెప్పలేదూ—మీ ఆయనే చెప్తాడని" అంటూ ఆ పడుచు వింతగా వెంకటేశు వైపు చూసి వెళ్ళిపోయింది. ఆమె నడక, ఆ వీడ్కోలు మంగ హృదయంలో శాశ్వతమైన ముద్ర నెలకొల్పాయి—అదివరకే అతని హృదయఫలకంపై నిరతమూ క్రొమ్మెరపులతో దీపించే ఆ ముద్ర వింత వింత రంగులతో మళ్లీ ఒకసారి ప్రతిబింబించింది!

# మధుసూదన సరస్వతి భక్తి రసాయనము

శ్రీ ఏలూరుపాటి రామభద్రచయనులు

భక్తి రసాయనమును నిర్మించిన మహామహుడు మధుసూదన సరస్వతి. పూర్వాశ్రమమున కమలనయనుడు. అన్యాపదేశమును రచించిన మధుసూదనుడొకడు కలడు. ఈ సరస్వతి వ్రాసిన అద్వైతసిద్ధి బహు పండితాగ్రేసర హృదయనివేశితము. అద్వైతసిద్ధికి అనంత శాస్త్రియను వారు లోకవివరణమును విపులముగ రచించి విశిష్టాద్వైతద్వైత మతప్రవక్తయగు వాదిరాజు తీర్థుల యుక్తిమల్లికను ఖండించుటయే పనిగా జేసికొని నవీన గత విశిష్టాద్వైతాచార్యులనుగూడ జెనకి ప్రజ్ఞను జూపింప యత్నించినాడు. మధుసూదన సరస్వతి కృష్ణునే కాని మిగిలిన దైవముల నెన్నకొనడని పలుచోట్ల చెప్పియు శివమహిమ స్తవ శివలీలలలో గూడనట్లే శివుని పేర్కొనుటచే హరిహరభేదము నొప్పనివాడని తోచుచున్నది. అందుననే అద్వైతసిద్ధి, అద్వైత రక్షణ మొదలయిన గ్రంథముల రచించినాడు—ఇంతే కాక తన హృదయపక్వస్థితిని దెల్పు వేదాంతకల్పలత, గూఢార్థప్రకాశిక, సిద్ధాంతబిందువు మొదలయిన వేదాంత గ్రంథములను రచించినాడు. ఈతని గురువు తనకు సన్యాసమిచ్చిన విశ్వేశ్వర సరస్వతి యని చెప్పుచు అద్వైతసిద్ధి నాతని కంకిత మొసర్చినాడు. ఈతని శిష్యుడు శేషగోవిందుడీతని దయచే వేదాంతమును గ్రహించి శంకరాచార్యుల కర్పింపగలిగెనని ఆతని సర్వవేదాంత రహస్యములోని "గురుణా మధుసూదనేన యత్కరుణాపూరితచేతసోపదిష్టం తదిదం ప్రకటీకృతం మయాస్మిన్భగవచ్ఛంకరపూజ్యపాదమూలే" అనినదానివలన దెలియుచున్నది. శ్రీపోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు వ్రాసినట్లు హరిరామ తర్కవాగీశు డొక్కడుమాత్రమే ఈతని గురువు కాడు. మాధవ సరస్వతికూడ తనకు (మధుసూదనసరస్వతికి) శాస్త్రపఠనమున గురువని ఆనందమందాకినిలో వక్కుచ్చినాడు. ఆనందమందాకిని కృష్ణునిపాదాదిశిరఃపర్యంత వర్ణనముచేసిన పాత్రము. ఈ పద్ధతిననుసరించి పలువురు వర్ణనములు సలిపిరి. అభినందకవి కృష్ణుని చిరునవ్వునిట్లు వర్ణించెను.

వత్స! స్థావరకందరేషు విచరం
 శ్చారప్రచారే గవాం
హింస్రాన్వీక్ష్య పురః పురాణపురుషం
 నారాయణం ధ్యాస్యసి
ఇత్యుక్తస్య యశోదయా
 మురరిపో రవ్యాబ్జగన్తిస్ఫుర
ద్బింబోష్ఠ ద్వయ గాఢ పీడనవశా
 దవ్యక్త భారం స్మితమ్.

ఈతనివని చెప్పబడుచున్న కొన్ని శ్లోకములవలన కృష్ణచరిత్రమునుగూడ రచించినవాడే అనిపించును. విష్ణుచిత్తుడు భాగవతసారము (తిరుప్పల్లాండు) ప్రథమ శతకము మూడవదశకమున విష్ణు నిరువది అవయవముల వర్ణించినాడు. ఉత్ప్రేక్షావల్లభకవి సుందరీశతకము, గోమానతిశతకము, వక్షోజపంచాశత్, నాసామౌక్తికమాల, చండీకుచపంచాశిక (లక్ష్మణాచార్యుడు) యీ తరగతిలోనివే. ఈ లక్ష్మణాచార్యు డిట్లను చున్నాడు

యద్యపి పదనుతి రాజో కౌర్యా
 మాతు స్తథాపి విశ్వస్య
ముఖ్యమితి స్తనపానం లక్ష్మణబాలే
 న తత్ స్తుతిర్విహితా

మధుసూదన సరస్వతి భక్తిరసాయనమునగూడ బలుచోట్ల కృష్ణుని పేర్కొనుచు వచ్చినారు. ఆనందమందాకినిలో నుదహరింపబడిన గురువు మాధవసరస్వతి యెవరో వివరమందు లేదు. పై విన్యాసముల ననుసరించి విశ్వేశ్వర సరస్వతి సన్యాసమిచ్చుటచేమాత్రమే కాక వేదాంతపఠనమునగూడ గురువనియు తర్కవాగీశుడు నైయాయికవిద్యను, మాధవసరస్వతి వేదాంత దర్శనముల నభ్యసింపజేసిరనియు నూహించవచ్చును. ఇతని ముఖ్యమిత్రము హిందీ రామాయణమును రచించిన తులసీదాసట. శ్లో. ఆనంద కాననే కాశ్యాం తులసీ జంగమ స్తరుః । కవితా మంజరీ యస్య రామ భ్రమర చుంబితా.

ఈతడు మహిమ్నస్తవమునకు వ్యాఖ్యానమును రచించుచు, తన రచనను జూచి యితరుడు టీక రచించినచో హరిహరాదులకు శత్రువైపోవునని చెప్పుచు నిట్లు శపించెను.

టీకాన్తరం కశ్చన మందబుద్ధి రిత
 స్సారం సముద్ధృత్య కరోతి చే త్తదా

శివస్యవిష్ణో ర్ద్విజగోసుపర్వణా
మపి ద్విషద్భావ మసౌ ప్రపద్యతే

భాషాప్రపంచమున నుత్కృష్టస్థానము నధిష్ఠించిన యీ మహానుభావుడు శేషగోవిందుని గురువుకదా! శేషకుటుంబము ప్రస్తుతపు కృష్ణాజిల్లా గరికిపాడు అగ్రహారంలోనిదని పెద్దలు నుడువుచున్నారు. శేషకృష్ణుడు జగన్నాథ పండితరాయలతండ్రియగు పేరుభట్టు వ్యాకృతిగురువు. ఈగ్రంథ వికృతికారులు వ్రాసినట్లు కాక మధుసూదన సరస్వతి శేషకృష్ణుని కాలములో నున్నట్లె కనిపించును. అద్వైతసిద్ధి వ్యాఖ్యాత అనంతశాస్త్రిసరస్వతియొక్క కాలనిర్ణయము జేయ వీలు కాలేదనినాడు. ఇతర రచనల జూచిన దెలియనోపును. భక్తిరసాయనము నారంభించిన మధుసూదన సరస్వతి యిట్లు ప్రవచించినాడు. శ్లో॥ సంసార రాగేణ బలీయసా చిరం । నిపీడితై స్తత్ప్రశమేఽతి శిక్షితమ్ । ఇదం భవద్భిర్బహుధావ్యయాతిగం నిపీయతాం భక్తిరసాయనం బుధాః॥ ఓ పండితులార ? సంసారానురక్తిచే చిరకాలమునుండి బలాత్కారముగ పీడింపబడుచున్న మీరు తదనుబంధమును శాంతింప జేసికొనుటకు వ్యయము తక్కువ అగునట్లు నాచే తయారుకాబడిన యీ రసాయనమును పానము చేయుడు—అని.

రసాయనము ద్రవభూత మగు పదార్థమగుటచే సులభముగ మ్రింగుట కనువగుననియు భక్తిని మనసున జొనుపుటకు సులభమనియు మధుసూదను నభిప్రాయము. శాస్త్రీయగ్రంథమగుటచే నిది ఆనందమందాకినివలె ఝుడితి మనసు ద్రవీభూతము చేయజాలదు. రసాయన మనేక వస్తుసమ్మిళితము. ద్రవముగనున్నను మంద + అకిని = అక - గతౌ మందప్రాస్యయగుటచే మందాకినివంటిదే అగుచున్నది.

స్వచ్ఛందోచ్ఛలదచ్ఛకచ్ఛ
    కుహరచ్ఛాతేతరాంబుచ్ఛటా
మూర్ఛన్మోహమహర్షి హర్ష
    విహితస్నానాహ్నికాహ్నాయవః
భిద్యాదుద్యదుదారదర్దురదరీ
    దీర్ఘా దరిద్రద్రుమ
ద్రోహోద్రేకమహోర్మి మేదురమదా
    మందాకినీ మందతామ్

(కావ్యప్రకాశము)

హృదయమును జొచ్చుటలో మందాకిని (జలము) వలె చురుకుదన మొందుటలేదు. ఈశ్లోకపు మందాకిని నిర్మలజలము కలది కాకుండుటచే రసాయనమువంటిదే యగుచున్నది. మందాకినిచే మందత్వము నశింపజేయుటకు ప్రకాశకారుడు యత్నించినాడు. కాని, యట్లు శ్లోకము జరుగనిచ్చునది కాదు. రసాయనము పుష్టికరమై భక్తివృద్ధిద మగునని సరస్వతి అభిప్రాయము. ద్రవీభూతమయిన చిత్తమున ద్రవపదార్థమే జేర్చుట తగునుగదా?

భక్తిరసాయనవ్యాఖ్యాత గోవర్ధన దామోదర శాస్త్రి ఏతద్రసాయనము నాపణమునుంచి విలువ కట్టించి ఖ్యాతి కలిగించినాడు. మధుసూదనుడు రసాయనమును మూడుల్లాసములుగ గూర్చినాడు. నూటనలువదిఅయిదు శ్లోకములు కలవు. ఈ గ్రంథమునకు తెలుగు వివరణమును రచించిన శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారొక పూర్ణవిమర్శముతో వివరణమును వ్రాయుటయేకాక మూడనుబంధములలో దమ యనుభూతిని గూడ జూపియున్నారు. వారి గ్రంథావలోకనశక్తి దీనిలో జాలవరకు దెలియుచున్నది. సామాన్యముగ నలంకారగ్రంథముల ననువదించువారనుసరించురీతినే వీరును రచించిరి. మూలసూత్రముల ననుసరించిన వాక్యములగాని పదములగాని కర్తలను దెలుపకుండుట వికృతిలక్షణము కాజాలదు. వీరు నేడు వెలువడిన శాస్త్రవికృతులలోనున్న యుదాహృతముల యునికిని దెలిపినారు. కాని, లీలాశుకుని 'రాధాపునాతు జగదచ్యుత దత్తచిత్తా మంథాన మాకలయతీ దధిరిక్త పాత్రే। తస్యాః స్తన స్తబక చంచలలోల దృష్టి ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరుంధన్' దీనిని పోలినది—

రాధామంజులమందిరా
    దుపగత శ్చంద్రావతీ మాచివాన్ ।
రాధే! క్షేమమిహేతి తస్యవచనం
    శ్రుత్వాహ చంద్రావళీ।
కంస! క్షేమమయే విదగ్ధహృదయే
    కంసః క్వదృష్ట స్త్వయా।
రాధాక్వేతి విలజ్జితో నతముఖః
    స్మేరో హరిః పాతువః.

ఈశ్లోక మెక్కడిదో!

వక్షేషు యద్భారతమార్యధుర్యాః
    స్తువంతి గార్హస్థ్య మివాశ్రమేషు ।
తత్రాస్మిపత్యుర్వరివస్యయాహం
    శిరోర్మికిర్మీరిత ధర్మలిప్సుః॥

నైషధం—

### ఇది పాఠకులందరికి తెలియునా?

కావున సుదాహృతముల యునికిని తెలుపుట కర్తవ్యమందును. రసశబ్దము వేదాంతగ్రంథముల నిర్వచింపబడుచున్న బ్రహ్మముగ దోచి వేఱుగ గన్పడినను, "రస్యతే ఇతి రసః" కావున తచ్ఛబ్దార్థమున నైక్యమయి యొకటిగ దోచుచున్నది. ప్రవృత్తి నివృత్తులు రెండును రుచిభేదమున బహ్వర్థానేకతలో గోచరించినట్లు దోచి, గమ్యస్థానప్రవేశమున నొక్కటిగ నెలయుచున్నవి. ఆలంకారికులు నిర్వచించిన రసమును, ముముక్షువు లనుభవించు రసమును నేకార్థముకలవైనను వేఱ్వేఱు పంథాల నడచుచు వచ్చినవి. శ్రీమద్భాగవతమునందలి నాయకుడీ రసభేదమును సృష్టించినట్లు తోచును. సనందాదులనుభవించిన రసము వేఱు. సంఖ్యాభేదమున కేమి? గోపికాది స్త్రీజాతి యనుభవించిన రసము వేఱు ననిపించుచున్నది శృంగారమును భక్తియు మేళనమొంది శ్రీమద్భాగవతమున నాట్యమాడినవి. ఈ భాగవత నాయకుడే జయదేవ, గోవర్ధన, శరణ, ఉమాపతిధర, ధోయీ, రూపగోస్వామి, వల్లభాచార్య, గౌరాంగ, రామచంద్రాదులు తన పేరు విన్నంతన సొగయునట్లు జేసికొనినవాడని తోచును. ఈ రసవిభేదము మధుసూదనుడు 74–78 సూత్రములలో సూచించినట్లు వికృతికర్తలు తెలుపుచున్నారు. రసవిచారమును తృతీయోల్లాసము 1–2 శ్లోకములలోను, అవసానమున తృతీయోల్లాసత్రయోదశసూత్రమునను నుడివినాడు అని వీరే చెప్పుచున్నారు. 'రసో వై సః' అనువాక్యమును సరస్వతి తన ఇరువదినాలుగవ సూత్రమున "పరమానంద ఆత్మైవరసః ఇత్యాహురాగమాః" అనుసూత్రమున దృఢీకరించుచున్నను భక్తినే రసస్థానమున నిలిపివేసి యున్నాడు—భక్తి శృంగారభేదమున రసవిచారము సలుపు సంప్రదాయము మహామహులనాక్రమించినది. దీనిలో ఆరు మొదలు పదివరకు గ్రంథములు పెరిగినవి. ఇది విజిగీషాపరులై గ్రంథముల పెంచ గలుగునటు మహాకవులనొనర్చి, నాటక పుణ్యావళిమున రసచంద్రికలు వెలయించినది మంజరులు చిదిమించినది. రసార్ణవముల నీదించినది. గంగాధరుని ప్రత్యక్షీకరించినది. ఇదియని యన నేల కేవలము రసమయం జగత్ చేసినది! వల్లభాచార్యుని పుత్రుడు విఠలుడు రససర్వసము నీ తరగతిలోనే రచింపగలుగుట యీ పారవశ్యత చేతనే—

దీని యనుబంధములో శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి గారు రసవిచారమును విపులముగ జరిపించిరి. అభినవగుప్తుడు రసములన్నియు నానందమయము లనుచున్నాడు. దీనిని శ్రీ శాస్త్రిగారు 160 పేజిలో చర్చించియే యున్నారు. వీరు చెప్పునట్లు రసానుభూతి దుఃఖములో లేదనుటకు భరతాదులే ఒప్పుకొనలేదు. దంతనఖక్షతాదులచే ననుభవించు బాధను తాత్కాలికముగ నెంచి, యట్టిదేయయినను రతిసుఖమునుమాత్రమే రసపారవశ్యమునకు హేతువని యెంచిన, భరతాదులూహించిన రసానుభూతి భేదమున వలసియుండును. మధుసూదన సరస్వతి మూడవ ఉల్లాసము ముప్పదియవ సూత్రమున నిట్లనుచున్నాడు. 'పరానందము సహకారులగు విభావాదులచే భక్తినామకమగును. రామానుజుడు 'శ్రీనివాసునియందుపనిషద్విశిష్టబ్రహ్మమునందువలె భక్తి నిలుచు గాక' యనుచున్నాడు. తానునుభవించు శ్రీనివాస దీక్షా జనిత పరమానందమే రసమని నిర్వచించుటచే భక్తి రసమును పరమానందమునకు పర్యాయపదముగ నెంచి నాడనుట స్పష్టము.



# రాజర్షి

శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరి

ఒక్కతఱిన్ మహోగ్రపవనోద్ధృతవహ్ని చెలంగి ప్రాంతముల్
పక్కణముల్ దహించి వెసఁబర్విన - నా మిథిలాపురంబునుం
జిక్కెయపూర్వశోకమునఁ జేడ్పడఁజేయఁ దదీయపౌరులం
దొక్కఁడు స్వాస్థ్యముం బడయ నోపఁడు దైవవిధాన మెట్టిదో?

రివ్వునవార్త నల్దెసలు రేఁగియు మింటికి నంటి యాపయిన్
దవ్వుల మౌనియాశ్రమము దాఁకను బోఁకఁగ - బెగ్గడిల్లి దా
దవ్వులఁ బాఱి రెందఱో యథాయథలైన యెడందలోపలన్
నెవ్వగ గూరి తత్త్వము గణింపని తత్తఱపాటు మీఱియున్

అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు మహర్షిగణంబునకేదొ బోధగాఁ
జెప్పుచు నుండ దానిఁ బరిశీలన సేయుచుఁ దత్త్వదృష్టిలోఁ
జిప్పిలు పారవశ్యమునఁ జిన్మయుఁడౌ జనకర్షి, మైకమున్
గప్పిన నాగుఁబాము వలెఁ గన్పడెఁ దన్మునిపర్యుసన్నిధిన్.

ఈవల - వాండ్రు వీండ్రు భరియింపఁగ నైతియుఁగాని భీతిమై
నావురు మించు బిక్కమొగమై తమయాస్తులు నేఁడు దగ్ధమై
పోవక తప్పదేమొ యని బోరున నేడ్చుచు గోఁచిగుడ్డలే
వో వెలలేని వస్తువులు నోపిక మూటలు గట్టి రయ్యెడన్.

జనక మహర్షి యత్తఱి విచారపరిస్థితి బ్రుంగి క్రుంగు త
న్మునిజనసంఘముం గనియు బుద్ధి మఱల్పఁడు; తాను దీక్షగా
ననుకొను తత్త్వచింతకు రవంతయు మార్పును సైఁపఁడేదియున్
దనకిఁకఁ బట్టనట్టులు మనంబున నెంచు నదేమి చిత్రమో!

అది గుఱుతించి యబ్బురమునంది మహాత్ముఁడు యాజ్ఞవల్క్యుఁడ
య్యదనున నూరకుండెఁ; విలయాగ్నిని బోలెడి కాఱుచిచ్చు న
మ్మదిగ సమస్త వస్తువులు 'మారణహోమ' మొనర్చి శాంతమున్
బ్రిదులగఁజేసి యొక్కమొగి బీతును గూర్చె విచిత్ర వృత్తిమై

దొరకిన దాఁకఁ దీవ్రమగు ధోరణి నాహుతిసేసి భస్మమున్
చెరువునఁబోసి - దైవము విధించినయట్లులు శాంతి మంత్రమున్
గఱపెను జిచ్చు; పిమ్మట - వికావికలైన మనస్సులూఱటం
దొఱఁగియు మాను లేదియును దోఁపకయూఁగిరి పర్ణశాలలో

స్తిమితము కూర్పఁగాఁదగిన తిరు ప్రబోధ మొనర్ప - మానవ
ర్గము నొకచోటఁజేర్చియు భరంబగు భీతిని బాఱఁద్రోలి శాం
తము శివమైన తత్త్వము నిదానముగాఁగఱపంగఁ బూనె ను
త్తమగురుదేవుఁ డత్తఱి హితంబు మితంబగు వాక్యధోరణిన్.

ఓ మునివర్యులార, వినమో కనమో యిటువంటి చిచ్చు లె
న్నఁడును? దాని కింత బెగడొందియు వందుర నేల? యీ యహం
తా మమతా పురస్కృతపథంబది గైకొని యిట్లు మీరు మీ
సేమము మాపుచేసికొని సేగిని బెల్లుగఁ బొంది యుందురే!

జనకుని శీలమెట్టిదో విచారణసేయఁగలట్టి శక్తి యొ
క్కనికిని గల్గునే? యతఁడు క్షత్త్రియమాత్రుఁడె? వాని జీవితం
బునఁ బొడసూపు జ్ఞానధనమున్ గుఱుతింపఁగనైన వీఱు నె
వ్వనికిని సాధ్యమే? యిట వివాదము లేదు పరీక్ష చేసినన్

ఈతఁడు శ్రద్ధధానుఁడయి యేతపముం బొనరించి విశ్వవి
ఖ్యాతి గడించెనో యెఱుఁగఁగావలదే మునులార, వీని ప్ర
ఖ్యాతికి మూలమైన విషయంబు రవంత యెఱింగిరేని యీ
రీతిగ సంచరింతురె హారీ! యిఁక నెట్లు తరింతురో గదా!

కరచరణాదులే నలుమొగంబుల యాస్తిగనున్న మీరు త
త్తఱపడి పాఠముల్ వదలి దవ్వుగఁ బోవఁగ నేల? ధారుణీ
శ్వరుఁడు మహామహుండు గుణవంతుఁడు ప్రాజ్ఞుఁడు బద్ధదీక్షుగా
నరయుచుఁ గూరుచుండెఁ బరమార్థమదేమొ యెఱుంగఁబోలదే?

విలువగలట్టి యామిథిల వేయివిధాల భయంకరాగ్నిలో
పల నుడుకెత్తువార్త యొకవంక వినంబడుచుండ దానికై

కలఁగఁడు లేఁడు; మిక్కుటముగాఁ దనధ్యానములో మునింగి పై
దొలఁగఁడు; వానివైఖరి సుదూరము చూచిన బుద్ధిరాదొకో!

శ్రీశుకులే యొకప్పుడు విశిష్టగుణాత్మునిగా నెఱింగి ధా
త్రీశుని వీని డగ్గఱి గ్రహింతురు ధర్మశ్రములైన నవ్య ది
వ్యాశయముల్ సమంజసములైనవి; యట్టి మహాత్ముఁ గూర్చి యే
కోశమునందు మీ రెఱుఁగఁ గోరరు మీ యవివేక మెట్టిదో?

అని రూక్షంబుగ యాజ్ఞవల్క్యముని యా యజ్ఞానులన్ మందలిం
చిన నమ్మానులు మానుఁ లైరి; దుదికాచేడ్పాటు మాయింపఁగా
ననువౌ త్రోవను జూపి వారలకు దివ్యంబైన తత్త్వంబు మిం
చిన వేడ్కన్ దెలియంగ నేర్పను జగచ్ఛ్రేయంబు గాంక్షించుటన్.



# ఎనభై ఏళ్ళ యువ రచయిత సోమర్ సెట్ మాఘమ్

'శ్రీ వాత్సవ'

ఎనభైయేళ్లు నిండిన యువక రచయిత జన్మదినోత్సవము జనవరి మాసాంతంలో సాహితీ ప్రపంచమంతటా మహా వైభవంగా జరుపుకొన్నారు. యావత్ ప్రపంచ పాఠకుల మన్ననల నందుకొన్న ఆ రచయిత రచనలు నూతన సంపుటాలుగా వెలువడినవి. ప్రపంచంలోని అన్ని ప్రాంతాలవారు, అందరు భాషా విమర్శకులు ఆ రచయితకు అభివందన మంగళహారతు లందించారు. అతడే ప్రసిద్ధాంగ్ల సారస్వతనిష్ణాత సోమర్సెట్ మాఘమ్. ఈతడు 1874 జనవరి 25 తేదిని జన్మించాడు. ఆంగ్లేయుడై జన్మించి ఇంగ్లీషు భాషలో రచించిన ఈయన శతాధిక గ్రంథములు ప్రపంచ నాగరిక భాషలన్నింటిలోనికి అనువాదములు పొందినవి. ఈ యెనభైయేండ్ల వృద్ధ యువకుని సాహిత్య జీవితంలో నాలుగువిధాలయిన వ్యక్తులు గోచరిస్తున్నారు. మానవలోకంలోని కష్టసుఖాలను తలక్రిందులుగా చదివి, ఆ చదివినదానిని యథాతథంగా చిత్రించిన నవలారచయిత ఒక వ్యక్తి. లోకంలోని చిత్రవిచిత్ర దేశాలను, ఆ దేశాలలో నివసించే మానవులను చూచి వారి ప్రకృతులను తన అనుభవనాళికలో వ పోసి క్రొత్త పరమార్థాలను కనిపెట్టి వాటికి నూతన స్వరూప నాలు చెప్పిన కథారచయిత మరొక వ్యక్తి. లోకమునందలి ప్రకృతిలో తటస్థపడిన సామాన్య జనుల ఆడంబరాలు అంతస్సులు తూచి, వాటి వెనుక మరుగుపడిన అజ్ఞాత మనఃప్రవృత్తులకు ఆకస్మిక ఛాయాచిత్రాలు తీసిన నాటకరచయిత ఇంకొక వ్యక్తి. తన జీవితంలో సగానికి పైగా భూభ్రమణం చేసి, వివిధదేశాలను దర్శించడంలో గడిపిన లోకయాత్రా రచయిత మరొక వ్యక్తి. ఈ నలుగురు రచయితలూ నలుగురు విభిన్న వ్యక్తులుగా కనిపించినప్పటికీ—ఈ విభిన్న వ్యక్తుల భిన్నత్వంలో సైతము ఏకత్వం గోచరించక పోదు. ఈ రచనలలో అంతర్వాహినిగా కనిపించేది ఒక అపూర్వమైన సందేశం. పాశ్చాత్య లోకానికి పరిచితంగాని ఒక ఆధ్యాత్మిక ధర్మసూత్రం. అదే భారతీయసంప్రదాయానుగుణమైనహిందూ వేదాంతం అని చెప్పడం సత్యదూరం కాదేమో! మాఘమ్ తన రచనలలో అనేకరకాల మానవ ప్రకృతిని చిత్రించినప్పటికీ జీవన సంధ్యాసమయంలో రానురాను ఈ నూతన వేదాంతాన్ని, ఆధ్యాత్మిక తత్వాన్ని ప్రదర్శిస్తూ వచ్చాడు. అందుచేతనే యేమో పాశ్చాత్య లోకంలో ప్రాజ్ఞులనేవారు అంతగా అతన్ని మెచ్చుకోలేకపోయారు. కాని బహుముఖ ప్రతిభాసంపన్నుడైన మాఘమ్ ప్రజ్ఞను ఎవరూ కాదనలేరు.

ఈతని రచన లన్నింటిలోకీ కథలూ, నవలలూ ఖ్యాతి కీర్తి అందుకొన్నాయి. ఆంగ్ల సారస్వతంలో ఆతడు చేసిన అకుంఠిత సేవకు, అతడు సాధించిన విశిష్ట గౌరవస్థానాన్ని ఎంత తీవ్ర విమర్శకులయినా కాదని చెప్పలేరు. కొందరు కొందరు మాఘమ్ నేటికాలపు రచయితలలో సమర్థుడే కాని, అగ్రగణ్యులలో లెక్కింపదగినవాడు మాత్రం కాడని అంటారు. పాశ్చాత్య విమర్శకులకు సులభంగా అవగాహన కాని తత్వశాస్త్రము, ఆధ్యాత్మికత, అద్వైతసిద్ధాంతములు తన రచనలలో చొప్పించి కొంతవరకు వారిని ఆశ్చర్యచకితుల్ని చేయడం చేత ఇటువంటి సమీక్షలు ఆతని సమకాలికులు చేస్తున్నారు. కాని మాఘమ్ నేటి రచయితలలో ఒక్కడని ఇప్పుడు కాకపోయినా మునుముందు అయినా ఒప్పుకొని తీరవలసి ఉంటుంది. ఆతని రచనలు సామాన్య పాఠకుని చకితుణ్ని చేయడమే కాక శాస్త్రీయ సమీక్షకునికూడ సబబనిపిస్తాయి. స్వప్న జాగ్రదవస్థల సమ్మేళనములో అతనిపాత్రలు సంచరిస్తూఉంటాయి. రచయిత ఒక నాటక సూత్రధారిలాగ తన పాత్రలను ప్రవేశపెట్టి తెరవెనుకకు తప్పుకొంటాడు. పాత్రలు చదువరుల యెదట సాక్షాత్కరిస్తాయి. ముఖాముఖీగా ముచ్చటిస్తాయి. ఒక్కొకసారి నగ్ననృత్యం చేస్తాయి. చిత్రవిచిత్రంగా సంచరిస్తాయి. చదువరి జ్ఞాననేత్రం ముందు ఈ పాత్రల జాగ్రదవస్థలోని తెరలు తప్పుకొంటాయి. ఈ పాత్రల ఉన్మీలనంలో, వారి అజాగ్రత్ ప్రవర్తనలోని కొన్ని సన్నివేశాలు గోచరిస్తాయి. అవి చదువరుల్ని ఉద్రేకపరుస్తాయి. సంభ్రమాశ్చర్యాలలో ముంచివేస్తాయి. విభ్రాంతుల్ని చేస్తాయి. వెక్కిరింతలతో కితకితలు పెట్టినట్లు, వింత

కాంతులతో మిరుమిట్లు గొలిపినట్టుస్ఫురిస్తాయి. చదువరి మాఘమ్ రచనలకు అలవాటు పడకపోతే తొలిసారి ఉక్కిరి బిక్కిరి అవుతాడు.

మిగతా రచయితలలాగే—మాఘమ్ తన నవలల్లో ఆదర్శవాదానికి చోటిచ్చి పాత్రల వాస్తవిక జీవితంలో నిరూపించడానికి ప్రయత్నం చేసినప్పటికీ—రానురాను వాస్తవిక జీవితంనుండి అధివాస్తవిక స్వాప్నిక జగత్తులోనికి తనపాత్రల్ని తీసుకొనిపోయి అక్కడ వారిని ఆవిష్కరించి వారి తీరనికోరికలు, వారి కలలు, వారి కలతలు, భయాలు భ్రాంతులు వ్యక్తపరిచాడు. అతడు వ్రాసిన తొలి నవల 'లిజా ఆఫ్ లేంబెత్' (*Liza of Lambeth*) ఇది కొంచెం ఇంచుమించు థామస్ హార్డీ వ్రాసిన 'టెస్సు' అనే నవలలాగుంటుంది. మాఘమ్ రచించిన ఇతర నవలల లాగే ఇదికూడా ఆత్మచరిత్ర అంటారు. 'టెస్సు' లాగే ఉన్నదని స్ఫురింపచేసే ఈ నవలలోకూడా ఒక వేదాంతసారాన్ని, ఒక జ్ఞానజ్యోతిని ఇమిడింప చేశాడు రచయిత. అదే మాఘమ్ ప్రత్యేకత. ఈ నవలమొదలు రేజర్సు ఎడ్జి (*Razor's edge*) వరకు అన్ని నవలల్లోను ఒక విధమైన నిర్లిప్తత కనిపిస్తుంది. ఈ నవలలో—కథానాయకుడు ఈ భౌతిక ప్రపంచంలో పడి కొట్టుమిట్టాడుతూవున్న ఒక బుద్ధిజీవి. అతనికి విభిన్నశక్తుల సంఘర్షణలో వాస్తవికలోకం భయంకరంగా కనిపిస్తుంది. శాంతికోసం, జీవన సంగ్రామశాంతికోసం ఎక్కడెక్కడో తిరుగుతాడు. ఎవరెవరినో చూస్తాడు. భారతదేశం వస్తాడు. ఒక మహర్షి సందర్శనం చేస్తాడు. ఆ మహర్షి దర్శనమాత్రంచేత అతని మనస్సునావరించిన చీకటి మబ్బులెన్నో విడిపోతాయి. కొంత వెలుగు కనిపిస్తుంది. అది చూచుకొంటూ తన గమ్యస్థానాన్ని వెదకుకొంటూ బయటికి వస్తాడు. ఈ నవలలో కథానాయకుడు 'ల్యారీ' మాఘమే అని అంటారు. ఇందులో జీవిత సమస్య పరిష్కరించడానికి పరబ్రహ్మైక్యసంధానమే పరమ లక్ష్యం అని ప్రబోధిస్తాడు రచయిత. మిగతా రచయితలలాగ నిరాశా వాదము — నిస్పృహా తత్వము మాఘమ్ రచనలలో గోచరించవు. క్షుద్రభోగాలను, భౌతిక సుఖాలను మించిన ఆధ్యాత్మిక లక్ష్యం ఉన్నదనే విశ్వాసము ప్రతిపాదిస్తూ ఉంటాడు రచయిత. అందుచేతనే యేమో నేటి విమర్శకులకు అంతగా నచ్చకపోవడం.

మాఘమ్ — పాశ్చాత్య లోకానికి ఇష్టమైనా కాకపోయినా మనదేశంలో అందరి మన్ననలూ అందుకొన్నాడు — భారతీయ తత్వాన్ని గ్రహించి — దాన్ని అంతో యింతో తన రచనలలో చవిచూపిన వారిలో ఆల్డస్ హక్స్లీ, మాఘమ్ ముఖ్యులు. వీరిరువురూ రెండువిధాలుగా మన వేదాంతాన్ని తమ రచనల్లో పొందుపరచారు. హక్స్లీ—వ్యంగ్యధోరణిలో తన పాశ్చాత్య ప్రపంచంలోని ప్రత్యేకతలోపాల్ని ఎత్తిచూపించి, వాటిని అతిశయోక్తులతో అవహేళనచేసి తన నూతనవాదాల్ని చూపాడు. మాఘమ్ అలాగ కాకుండా తన వాతావరణంలోనే కొత్త సన్నివేశాలతో తన పాత్రలు కొత్త పాఠాలు నేర్చుకొనేటట్టు చేశాడు. మాఘమ్ స్వతః గొప్ప వేదాంతి ధార్మిక సిద్ధాంతి. పాశ్చాత్యతత్వశాస్త్రం కూలంకషంగా చదివినవాడు. క్రిస్టియన్ తత్వంలో "బాధాసహాన తత్వాన్నీ" భగవత్ సందేశదౌత్యాన్నీ ప్రత్యక్షంగా నిరసించినవాడు. సౌందర్యాత్మకమైన భగవంతుని సృష్టిలో పాపం ఎందుకు ఉండాలి అనే ప్రశ్న ఆనాడు సిద్ధార్థుని కలంచినట్లే—మాఘమ్‌ని కూడా కలచివేసింది. పాశ్చాత్య సిద్ధాంతాలద్వారా ఈ సమస్య పరిష్కారం చెయ్యాలని చూశాడు. సాధ్యం కాలేదు. వేదాంతవిద్య నేర్చుకొన్నాడు. కర్మసిద్ధాంతం తన సమస్యకి ఒక పరిష్కారంలాగున తోచింది. ఉపనిషత్తులన్నీ చదివాడు. చినిగిన వస్త్రాలలాగున ఆత్మ శరీరాలను మార్చుకొనే విధానము అతనికి నచ్చింది. హిందూ వేదాంతాన్ని అనేకవిధాల మెచ్చుకొన్నాడు. అంతటితో తృప్తిపొందక తానే స్వయంగా భారతదేశం విచ్చేశాడు. తిరువణ్ణామలైలోని శ్రీరమణమహర్షి దర్శనం చేసుకొన్నాడు. మాఘమ్ రమణమహర్షిని చూచి యోగశాస్త్రము—ఉపదేశము పొందినటు వినికిడి. ఒక యోగిని చూచినవెంటనే తనకు మైమరపు కలిగినట్టు అదే ఒక యోగమహిమ అయినట్లు చెప్పుకొన్నారని మాఘమ్ తన నోటుబుక్కు వ్రాశాడు.

ఈ యోగిదర్శనం జరిగినపుడు మాఘమ్ శరీరారోగ్యం బాగాలేదు. అంతకుముందే స్పృహతప్పి పడిపోయాడు. నీరసంగా ఉండి కదలలేక ఒక పరుపు మీద కూర్చుండి ఉండగా యోగి తనంతట తానే మాఘమ్ పరుండియున్న గదిలోకే వచ్చి చిరునవ్వుతో నిలుచున్నాడు. అలాగ తదేక ధ్యాన ముద్రలో నిలువబడి మహర్షి పదిహేను నిముషాల పాటు చూచారట. మాఘమ్ అలాగే గమనించకుండా కూర్చున్నాడు. ధ్యాన సమాధి అయినతర్వాత యోగి ఏమైనా మాటలాడుతావా, ఏదైనా అడగాలని

ఉందా అని ప్రశ్నించారట. మాఘమ్ మాటాడలేదు. మహర్షి మందహాసంతో మౌనముద్రకూడా సంభాషణే అని అన్నారట. అని మాఘమ్ భుజాలపైపు చూస్తూ మరొక పదిహేను నిమిషాలసేపు తదేకనిష్ఠగా ఉన్నారట. తరవాత మాఘమ్ ఆరోగ్యం బాగయింది. మాఘమ్ మహర్షి కూర్చుండే మందిరంలోకివెళ్ళి కూర్చుండే వాడు. మహర్షి దినచర్య గమనించేవాడు. వింతగా ఉండేది. ఇదంతా అతిశయోక్తులతో పత్రికలలో ప్రకటించబడింది. నిజానికి ఇది ఒక దైహిక అస్వస్థత తప్ప వేరేమీ లేదన్నట్లు డాక్టర్లు పరీక్ష చేసి నిర్ధారణపరిచారని మాఘమ్ ఒప్పుకున్నాడు.

మాఘమ్ ఏ విషయమైనా గుడ్డిగా విశ్వసించే వ్యక్తికాడు. శాస్త్రరీత్యా తర్కనభర్తన చేసి హేతువాదంతో సమర్థిస్తేగాని ఏ వాదాన్నీ అంగీకరించడు. అవన్నీ చేసినతరవాతనే మాఘమ్ మన వేదాంత తత్వాన్ని అర్థంచేసుకొన్నాడు. అంతమాత్రం చేత అతడి మతం మార్చుకొన్నాడనడానికి వీలులేదు. అతను తన గ్రంథాలలో ఒక వేదాంతాన్నిగాని, ఒక తత్వాన్నిగాని ప్రచారం చెయ్యడు. ఉత్తమ రచయితగా తన పాత్రల్ని ప్రవేశపెట్టి, వాటిని ఆయా సన్నివేశాలలో మనయెదుట నటింపజేస్తాడు. వాటినుండి మనల్నే మన యిష్టంవచ్చిన గుణపాఠాలు నేర్చుకోమంటాడు. తన జీవితచరిత్రలో వ్రాసుకొన్నట్టు—అతను తన జీవితంలో మూడువిలువలు కనిపెట్టాడు. అవి సత్యము, సౌందర్యము, మాంగళ్యము. ఇదే మన వేదాంత గ్రంథాలలో చెప్పిన 'సత్యమ్ శివమ్ సుందరమ్'—ఇదే అతను అనుసరించాడు, ఆచరించాడు ఆదేశించాడు. ఏ ఉత్తమరచయిత అయినప్పటికీ ఈ సూత్రాలనే ఆచరించితే అమూల్యమైన రచనలు చేయగలడేమో !

మాఘమ్ నిజమైన కర్మయోగిలాగు కనిపిస్తాడు. దూషణభూషణ తిరస్కారాలు అతన్ని అంతగా వేధించినట్టు తోచదు. అజరామరమైన సాహిత్య వేత్తలలో మాఘమ్‌ను చేర్చడమా లేదా అనే మీమాంసలో విమర్శకులు చేసిన సూచనలకు మాఘమ్ అంతగా పట్టించుకోలేదు. నిజమైన నిష్కామ యోగిలాగ అన్నాడు.

"ఎవరు ఏమనుకొన్నా నాకేమీ చింతలేదు. నన్ను గొప్పవారిలో చేర్చకపోయినా చేర్చినాఒకటే. ఉత్తమరచయితగా నన్ను స్వీకరించినా స్వీకరించకపోయినా నేను లక్ష్యపెట్టను. ఎటొచ్చీ నన్ను మెచ్చుకొంటే కొద్దిగా సంతోషిస్తాను. నన్ను మెచ్చుకోవడంలేదని తెలిసినా నేను చలించేవాడినికాను.

"నాలో ఏదో ఉంది—జనం ఇంతగా ద్వేషించడానికి—ముఖ్యంగా కొందరు ప్రతికూలురవడానికి—అది సహజమే. ఒకరు అందరినీ మెచ్చుకోకపోవచ్చు. ఒకరు ద్వేషిస్తున్నారంటే దానివల్ల నాకు చింత కలగడానికి బదులు వింత కలుగుతుంది. అంతే. నన్ను ఇంతగా ద్వేషించడానికి కారణం ఏమిటో తెలుసుకోవాలని కుతూహలంగా ఉంటుంది. నా రచనలు కలకాలం నిలవవు అని అనేవాళ్ళంటే నాకు కోపం లేదు. నేను చేయదలచినది చేశాను. అంతవరకే నా జోక్యం — తరవాత ఎవరేమనుకొన్నా అది నా కక్కరలేదు"

ఈ భావాలు భగవద్గీతలో నిర్వచించిన స్థితప్రజ్ఞుడి మాటల్ని స్ఫురింపచేస్తున్నవి. విమర్శకులను గురించిన నిర్లిప్తతే — సాగ్రగా ఉన్మీలనంలో కూడా మాఘమ్ ప్రదర్శిస్తాడు. అతనికి బంగారుపగనీ భస్మకుంభమూ ఒకటే. ఉత్తములూ నీచులూ అతనికి ఒకటే ఏ పాత్ర ప్రదర్శించినా బాహ్య వేషాపహరణం చేసినట్టు చేస్తాడు. వారిలో దాగివున్న మన స్తత్వాలు బహిరంగంగా తేవాలనే కుతూహలం. అందుకే స్త్రీ పురుషుల్ని ప్రవేశపెట్టాడు. వారి ప్రేమలు, వారి కామవాంఛలు, వారి సమాగమాలు, వారి సంతాపాలు, సంఘర్షణాలు, సంతాపాలు ప్రదర్శిస్తాడు. ఇంతవరకు సభ్యలోకానికి గోచరంకాని పాప ప్రవృత్తులు, పాషండచర్యలు మసిబొగ్గులలోని మాణిక్యాలలాగు నూతన కాంతులతో గోచరిస్తాయి. కామవాంఛలను, ఉద్రేకాలను వర్ణిస్తాడు. కాని, డి. హెచ్. లారెన్సు, మపాసాలలాగ వాటిని సమర్థిస్తున్నట్టు, ఆ పాపచర్యలకు 'వకాలత్' తీసుకున్నట్టు కనిపించడు. నికృష్ట నిరాశా జీవితాలలోని దుఃఖాన్ని, దారిద్ర్యాన్ని, బాధలను నిరూపిస్తున్నపుడు, డోస్టో వెస్కీ వంటి రచయితలాగ జుగుప్స కలిగించి కరుణామయం చేయడు. మానవ వాంఛల్ని, ప్రవృత్తుల్ని, ప్రవర్తనల్ని యథాతథంగా మనముందు నివేదిస్తాడు. ఆ నివేదించడంలో అసామాన్యమైనశిల్పంప్రదర్శిస్తాడు. అల్ప పరిధిలో అనల్ప ఫలితాలు సాధిస్తాడు.

జీవిత యథార్థదృశ్యాల్ని యథాతథంగా చిత్రించడంలో మరీ వాస్తవిక ఛాయాచిత్రకారుడయిపోతాడు మాఘమ్. అంటే సామాన్య పాఠకుడికి అతని రచనలు అవలీలగా బోధపడతాయి. ముఖ్యంగా

అతని నవలలూ, కథానికలూ యీ సత్యాన్ని అలవరచు కొన్నాయి. అందుచేతనే కొందరు అగ్రగణ్య రచయితలలో చేర్చలేదేమో! ఉత్తమోత్తమ రచయితలు— ఆంద్రేజీద్, జీన్‌పాల్ సార్త్రి, విలియమ్ ఫాక్‌నర్ రవీంద్రనాథ ఠాకూరులలాగ కొంత గూఢార్థంకూడా కలిపిఉంచాలి. సులభంగా అవగాహన అయిపోతే సోమర్సెట్ మాఘమ్‌లాగ సామాన్య రచయిత అయిపోతాడు! ఎక్కువమంది పాఠకులకు సన్నిహితుడవుతాడు. అందుచేతనే ఆధునిక యుగంలో—సమకాలికులలో మాఘమ్ సంపాదించినంత ధనం—స్వంత రచనలద్వారా ఏ రచయితా సంపాదించలేదేమో.

మాఘమ్—రచించిన నవలలు అందంగా కట్టిన ఆంగ్ల గృహవసతులులాగ తీరుగా మనోహరంగా ఉంటాయి. అతడు వ్రాసిన—మూన్ అండ్ ది సిక్స్ పెన్సు, వాన్‌గోగ్ అనే హాలెండు చిత్రకారుడి కథ అయినప్పటికీ కల్పనాకథ లాగ ఆకర్షిస్తుంది. అంగారేకేక్సు అండ్ ఏల్—రేజర్సు ఎడ్జ్ మొదలయిన నవలలు. వీటిలో యథార్థవ్యక్తులు గోచరిస్తున్నప్పటికీ—కథాగమన వేగంలో వారిని గుర్తించము వాస్తవజీవితంలో వ్యక్తుల్ని చూచినట్టే చూస్తాము, మరచిపోతాం. ఈతని పాత్రలు సంసార మహాసాగరంలో తేలిపోయే నావలు. ఏ పాత్రత్రోవ ఆపాత్రది. ఇతని రచనలన్నింటిలోనూ సుప్రసిద్ధమైనది 'ఆఫ్ హ్యూమన్ బాండేజ్' ఇందులో ఇతివృత్తం-జీవితంలో అంగవైకల్యం చేత కుంటితనం వల్ల అవహేళన పొందిన వ్యక్తి తాను లోకంమీద పగదీర్చుకొంటూ సాధించిన ఆత్మోన్నతి. ఈ నవలకీ మాఘమ్ యథార్థజీవితానికీ కొన్ని పోలికలున్నవి.

మాఘమ్ మొదట నత్తివాడు. అతని నత్తిమాటలు చూచి అందరూ నవ్వేవారట—వేళాకోళం చేసేవారట. ఈ వైకల్యంవల్ల వచ్చిన దుష్కీర్తి పోగొట్టుకోవాలనే ఈతడు ఇతరవిషయాల్లో పేరు సంపాదించే ప్రయత్నం చేశాడు. తదేకదీక్షతో పాటుపడ్డాడు. పేరు ప్రతిష్ఠలు, ధనసంపదలు ఆర్జించాడు. తన భౌతికలోపాన్ని కూడా సరిదిద్దుకొన్నాడు. ఇదే—ఆధ్యాత్మికంగా ఈ 'మానవ పారతంత్ర్యం' అనే నవలలో చిత్రించాడు.

అయితే సామాన్య పాఠకులకు అవివాస్తవికమో కావో అనేతర్కంతో పనిలేకుండా లోకంలోపరిచితవ్యక్తులకు అపరిచిత సన్నివేశాలలాగ ఎదురవుతాయి.

కథానికలలో ఇది మరీ స్ఫుటంగా కనిపిస్తుంది. కొన్నికొన్ని పరిస్థితులు వాతావరణమూ కల్పించి, ఆ పరిస్థితులలో ఆసందర్భములో ఆ పాత్రలు అలాగ తప్పు చుకోకలాగ సహించుకోవడానికి వీలులేదన్నట్టు చేస్తారు. అదే రచయిత ప్రదర్శించే ఇంద్రజాల మహేంద్రజాలం. ఈ కథానికలలో పాత్రలు చెప్పరాని పనులు చేస్తారు. చేయరాని కృత్యాలు చేస్తారు. కాని ఆ సందర్భంలో అలాగ చేసినందుకు వారు మనకు దూరంకారు. మాఘమ్ కథల్లో మంచివాళ్ళూ వస్తారు. చెడ్డవాళ్ళూ వస్తారు. మంచివాళ్ళు చెడ్డపనులు చేస్తారు. చెడ్డవాళ్ళు మంచిపనులూ చేస్తారు. ఎవరు ఏదిచేసినా ఒకవిధమైన పరిస్థితుల ప్రభావంవల్లనే. దీనికి ఉదాహరణగా మాఘమ్ రచించిన *Rain*, *Rcd*, (వాన, రెడ్) అనే కథలు తీసుకోవచ్చు. వాన కథ జరిగింది ఇండోనీషియాలో. ఒక మతాచార్యుడు రాత్రివేళ, వానలో ఒక పాటక జాతియువతితో చేసిన చీకటి తప్పు దీనిలో ఇతివృత్తం అతడు మంచివాడు. సామాన్య వాతావరణంలో ఆపని చేయడు కాని కథకుడు కల్పించిన పరిస్థితుల్లో ఆపని చేశాడు. ఇలాంటి కథలు ఎన్ని అయినా మనం చూపవచ్చు

మాఘమ్ రచనల ప్రభావం మన తెలుగు రచయితలలో కొంతవరకు బుచ్చిబాబుమీద—పద్మరాజు గారిమీదా కనిపిస్తుంది. మాఘమ్ 'వాన'కూ పద్మరాజు గారి 'గాలివాన'కూ అంతగా సామ్యంలేకపోయినా కథానాయకులు రెండు కథల్లోనూ ఒకే రకం మనుష్యులు. గౌరవనీయులు. మంచివాళ్ళు. పరిస్థితుల బలానికి లొంగిపోయి తమదృష్ట్యా కానిపని చేసిన వాళ్ళు.

'బుచ్చిబాబు'—'నేనూ నీవూ మాఘమ్' అనే కథ వ్రాసి మాఘమ్ అభిప్రాయాలను అనుసరించిన కథ ఒకటి వ్రాశాడు. మానసికతత్వం ప్రకారం చేసిన కొన్ని ప్రయోగాలవల్ల మాఘమ్ రచనలకీ కుటుంబరావుగారి రచనలకీ అక్కడక్కడ సక్రృత్తుగా సమాన ధర్మం కనిపిస్తుంది. మొత్తంమీద మాఘమ్ ప్రభావం ప్రపంచంలోని ఇతర రచయితలమీద పడినట్టు మన తెలుగు రచయితలమీదకూడా కొంచెం పడింది. దానికి తెలుగువారు సంతోషించవలసి ఉంటుంది కాని చింతించవలసిన పనిలేదు.

మాఘమ్ ప్రపంచం అంతా పలుసారులు ప్రదక్షిణం చేశాడు. అతడు ఎక్కడికి వెళ్ళినా ఆ దేశ ప్రజలతో కలిసి వారి సుఖదుఃఖాలు పంచుకొని వారిని అవగాహన చేసుకొని వారి మనస్తత్వాలను నిర్వచించాలని చూశాడు కాని మిగతా రచయితలలాగ వారి లోపాలను గోరంతలు

కొండంతలు చేసి వెక్కిరించి వటకారం చేయడానికి ప్రయత్నం చేయలేదు. వలసరాజ్యాలలో వంగ జాతి స్త్రీ పురుషులు పడే కష్టసుఖాలు ప్రత్యక్షంగా చూశాడు నిగూఢ రహస్యమని పాశ్చాత్యులు భావించే ప్రాచ్యజాతుల మనస్తత్వాలు, జీవితలక్ష్యాలు తెలుసుకోవడానికి ప్రయత్నం చేశాడు. దూరప్రాచ్య దేశాలలో వర్తకులుగా, ప్రవక్తలుగా, ప్రవర్తకులుగా పరిపాలకులుగా నివసించే పాశ్చాత్యులయిన తెల్లవాళ్ల అహంకారాలు, అభిమానాలు, అశక్తిమూర్ఖత్వాలు గమనించాడు.

అమాయకులయిన ఆదివాసుల సహకారంతో అనుక్షణమూ ఆధారపడి, వారిని అథఃపాతాళాలలోకి అణగద్రొక్కి అనవరతమూ తాము కల్పించుకొన్న అసత్య వాతావరణంలో విహరించే పరిపాలకుల ఆడంబరాలు. ఆచార వ్యవహారాలు అద్దం కట్టినట్లు మాఘమ్ ప్రదర్శించాడు వాళ్లను అవహేళన చేశాడు. అజాగ్రత్ ప్రవృత్తులను ఆవిష్కరించాడు. ఇటువంటి పనే కిప్లింగ్ కూడా చేశాడు కాని అందులో కిప్లింగ్ తన జాతివారి ఆధిక్యాన్ని కొంచెపరచలేదు మాఘమ్ అలాగ కాకుండా తన జాతి తక్కువ బుద్ధుల్ని, కుచ్ఛిత తత్వాన్ని యథాతథంగా చిత్రించిన యథార్థవాది అయ్యాడు. అందుచేత లోకవిరోధి అయ్యాడు. విమర్శకులనేవారు ఏమను కున్నా గాని మాఘమ్ నవలలూ, కథలూ ప్రపంచ ప్రజాభిమానం చూరగొన్నాయి అనడానికి లక్షోపలక్షలుగా చెల్లిన అతని కథా సంపుటాలు, నవలలు నిదర్శనాలు.

మాఘమ్ కథలనేకం—వెండితెరమీద కెక్కి విజయవంతమైనట్లు—ట్రియో, క్వార్టెట్సు—త్రిస్తబకం, చతుష్కం అనే చిత్రాలు సాక్షులు. ఈ రెండు చిత్రాలలోనూ, మూడేసి కథలు, నాలుగేసి కథలు తీసుకొని వాటిని విడివిడిగా ఫిల్ములుగాతీసి ఒక ప్రోగ్రాముగా ప్రదర్శించారు. మాఘమ్ వ్రాసిన *Moon and the six pence* అనే నవల, మానవ పారతంత్ర్యం (*Of Human Bondage*) అనే నవలా ఇంకా ఇతర నవలలూ చలనచిత్రాలుగా అసమాన ఖ్యాతి నార్జించాయి.

వీటి అన్నింటికంటె మాఘమ్ ఎక్కువ ధన సంపాదన చేసింది—తన నాటకాలద్వారా! మాఘమ్ అన్నిరకాల నాటకాలు వ్రాశాడు. ఈ శతాబ్ది ఆరంభంలో అతడు వ్రాసిన సుఖాంత నాటకాలు (కామెడీలు) ప్రేక్షకులకు చక్కిలిగింతలు పెట్టాయి. మాఘం తన ఇరవైనాలుగో యేట తొలినాటకం రచించాడు. తన షష్టిపూర్తిలోగా కడసారి నాటకం వ్రాశాడు. ఈమధ్య మొత్తం ఇరవైగురు నాటకాలు వ్రాశాడు. అవి రంగస్థలంమీద వేలకొలది సారులు ప్రదర్శించారు. ప్రపంచంలో అన్ని ప్రధాన నగరాలలోనూ మాఘమ్ నాటకాలు ప్రదర్శించారు. కొంతమంది అగ్రరచయితల నాటకాలలాగ కాకుండా మాఘమ్ నాటకాలు ఎవరు అభినయించినా రక్తి కడతాయి. అయినప్పటికీ మాఘమ్ తన అరవయ్యోయేట నాటకరచన మానివేశాడు. కారణం అడిగితే అతడు రెండు ముఖ్యమైనవి చెప్పాడు " నేను నాటకాలుగా వ్రాయదలచుకొన్న అంశాలన్నీ నా యిరవైయారు నాటకాలలోనూ వ్రాశాను. ఇంక నాటకీకరించవలసిన అంశాలు లేవు. అందుచేత మానివేశాను. మరొక సంగతి. నేను హాస్య రసప్రధానమైన నాటకాలు వ్రాయడం మాని వేసి. గంభీరమైన నాటకాలు వ్రాయడం మొదలు పెట్టాను. అవి ప్రదర్శిస్తున్న సమయంలో కొన్నికొన్ని మాటలకు ప్రేక్షక జనం నవ్వడం మొదలు పెట్టారు. వారు నవ్వాలని నా ఉద్దేశం కాదు. జాగ్రత్తగా ఆలోచించవలసినచోట ప్రేక్షకులు నవ్వడం మొదలు పెట్టగానే, నేనింక అలాంటి రచనలు చేయ నవసరం లేదనుకొన్నాను విరమించుకొన్నాను." అన్నాడు. నిజమే కావచ్చు. ప్రేక్షకులలో అటువంటి సహృదయత లేకపోతే—రచయిత ప్రాణం చివుక్కుమని పోతుంది. ప్రేక్షకులు విమర్శకులు ఒకలాగు స్వీకరిస్తారనుకొని నాటకం వ్రాయడం, తీరా దానివల్ల మరొకరీతిగా పరిణమించడం చూడలేక తాను నాటకాలు వ్రాయడం మానేసినట్లు మరొకసందర్భంలో మాఘం చెప్పాడు. పూర్వకాలానికి ఈకాలానికి సాంఘిక పరిస్థితులలో వచ్చిన మార్పులవల్ల—నాటక రచనా పద్ధతిలోకూడా మార్పు వచ్చినట్లు మాఘమ్ ఒప్పుకొన్నాడు. అయితే దేశకాల పాత్రలతో భేదంలేకుండా కొన్ని నాటకాలు ఎంతకాలమైనా నిలుస్తాయి. మంచినాటకాలు—సినీమా, టెలివిజన్, రేడియో పోటీలకి తట్టుకోలేక నిష్క్రమించ నక్కరలేదు. మంచి నాటకాలుంటే వాటిలో యథాతథంగా ప్రాణంతోవున్న వ్యక్తులు మాటలాడడం అభినయించడం చూడాలనే ఉంటుంది. మాఘమ్ తన కథలకీ, నాటకాలకీ బీజాలు అనదగిన అనుభవాలు ఎప్పటికప్పుడు వ్రాసుకొంటూ వచ్చాడు. తన పద్దెనిమిదో యేట—మెడికల్ స్కూలులో చదువుతున్నప్పటినించీ మాఘమ్

నోట్సు వ్రాసుకొన్నాడు. అలాగ వ్రాసినవి కొంతం పదిహేను దస్త్రాలుగా తయారు అవుతాయట. కాని అవన్నీ మాఘమ్ ప్రకటించలేదు. వాటిలో కొన్నింటిని సేకరించి 1949 లో తన 75 వ యేట ఒక సంపుటంగా 'ఒక రచయిత నోటుబుక్' (*A Writer's Note Book*) అనే పేరుతో ప్రకటించాడు. అందులో తన దేశదిమ్మరితనము, రచయిత జీవితము, వేదాంతి తత్త్వమూ చెప్పిన గుణపాఠాలు క్రోడీకరించాడు. తన జీవితమంతా భవిష్యత్తులో కలలుకంటూ వచ్చినప్పటికీ రానురాను తన జీవన సంధ్యారాగంలో గతంతోనే నెమరువేసుకొంటూ జీవించడం నేర్చుకొన్నాడు. తాను ముసలివాడినయిపోయానని తన 70 వ యేట కూడ చింతించలేదు. అప్పుడు నాలుగు నవలలు వ్రాద్దామనుకొన్నాడు. వ్రాసివేశాడు. అందులో రెండు చరిత్రాత్మక కథలు. మూడోది రేజర్సు ఎడ్జి. (కత్తుల బోను). ఇదే అతని ఉత్తమనవల. దీనితోనే ఈనాడు — యుద్ధభయాలవల్ల విభ్రాంతులయిన పాశ్చాత్య మానవమాత్రునికి ఒక సందేశం ఇచ్చాడు. అది పాశ్చాత్య ధనికులకు అవగాహన కాలేదు. జీవిత లక్ష్యం — పురుషార్థ సాధనలో — పరబ్రహ్మైక్య సంధానం అని నిరూపించాడు. ఈ మోక్షసాధనలో జయాపజయాలకు వెరువని నిష్కామయోగిగా నిలువమని ప్రబోధించాడు. అందుచేత జరామరణ భయం అతనికి లేకపోయింది. డెబ్బయ్యవయేట, డెబ్బయి అయిదవయేట, తిరిగి ఈనాడు తన ఎనభయ్యోయేట మరణభయం లేకుండా ధీరుడై నిలిచి ఉన్నాడు. భగవత్ గీతలలో ఉదహరించిన 'ఆత్మ' నిర్వచనం ఇతనికి నచ్చింది. అనశ్వరమూ, అచంచలమూ, ఆద్యమధ్యాంతరహితమూ, అఖిలభూతి వ్యాప్తమూ అయిన ఆత్మజ్యోతిని దర్శించాడు. అందుచేత సత్యలోకంనుండి, బ్రహ్మనుండి ఆత్మ — పంచకాయ ప్రవేశంచేసి, యీ దేహాని విడిచి, తిరిగి, చిత్ స్వరూపమైన భౌతిక ప్రపంచమునుండి ఆనందపరబ్రహ్మస్వరూపంలోనికి పోతుందన్న సిద్ధాంతం నచ్చింది. అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం అనేమాట తెలిసింది. పూర్వకర్మ సంజనితఫలమే ఈనాడు పాపంగా దుఃఖంగా గోచరిస్తున్నది — లేకపోతే ఆనందమయాత్మకమైన భగవత్ సృష్టిలో పాపానికి తావులేదు. ఈ పరమసత్యాన్ని ప్రబోధించిన హిందూ వేదాంతమే అతనికి హిందూ కర్మసిద్ధాంతాలమీద అత్యంత విశ్వాసం కలిగించింది.

ఈ ప్రపంచంలో ఉన్నంతసేపు ప్రతివ్యక్తి తనకు గల భయాలను దుఃఖాలను మరచిపోయి — తాను ఎదుర్కొన్న సమస్యలకు తన తెలివితేటలవల్ల ఒక మంచి పరిష్కార మార్గం ఆలోచించి — తాత్కాలికంగా ఆనందం సాధించడానికి ప్రయత్నిస్తాడు. ఈ ఆనందసాధనకు వ్యక్తితోపాటు — సాహిత్యవేత్తలు, శిల్పులు, చిత్రకారులుకూడ తోడ్పడి — వ్యక్తి అనుభవములకు సన్నిహితమైన వాసనలు అభిరుచులు కల్పించి తద్వారా ఒక కొత్త సంస్కారము కలిగించడానికి ప్రయత్నం చేస్తారు. సామాన్య మానవుడికి ఇటువంటి సంస్కారం అందివ్వడమే కళయొక్క ప్రయోజనం. అంటే కళా ప్రభావం సౌందర్య సమర్చనతో ఆగక ధర్మసాధనవరకు పోవాలి అంటారు ధీమంతులు తత్త్వజ్ఞులు. కావ్యం విషయంలో మన భారతీయ విమర్శకులు ఈ లక్ష్యాన్నే ఉత్తమోత్తమ కావ్య ప్రయోజనంగా గుర్తించి "విశ్వశ్రేయః కావ్యం" అన్నారు.

ఈలక్ష్యాన్నే మనస్సులో పెట్టుకొని మాఘమ్ కళ ధర్మసాధన కుపకరించితే తప్ప, అది రసజ్ఞుల హృదయాలకి నల్లమందు వంటిది అన్నాడు.

ఈ లక్ష్యంతోనే అతడు తన రచనలు చేశాడు. ఆ రచనలు కొంతవరకు ధర్మసాధనలో మానవుని ప్రబుద్ధుని చేయడానికి ఉపకరించాయి. అవి ఉత్తమ సాహిత్యంలోకి చేరతాయా?

అది కాలమే నిశ్చయించాలి.

భవభూతి చెప్పినట్లు,
"కాలోహ్యయం నిరవధిః
విపులాచ పృథ్వీః॥"

# పళ్ల విరిగిన దువ్వెన

శ్రీ దోగిపర్తి వెంకటరమణ

పళ్ళు విరిగిన దువ్వెన!...

ఎముకలు విరిగి...కాలం మళ్ళి జిడ్డు ముసలి ముహంతో ముసగ్గా కిందపడి వుంది! పోట్లాటలో విజయం సాధించి, వీరి ఆప్యాయంగా చేతుల్తో పైకి లేవనెత్తి ... జిడ్డు తుడిచి ముద్దు గులిపాడు! ... దీని కోసమే ఇందాకట్నుంచీ రణగోల! ..సీతికీ తనకీ మధ్య భీకరపోరాటం!—పొద్దుణ్నుంచీ ఇద్దరిమధ్య ఒకటే ఆరాటం! రక్తసంబంధాలు త్రెళ్ళిపోయి, సౌదర్యాలు సమసిపోయి- విద్వేషం పెనవేసుకొని, వాగ్వాదం ద్వంద్వసంఘర్షణ సీతిని ఓడించేసి, ఆఘర్షణలోంచి బయటికి తీశాడు వీరిగాడు, గర్వరేఖ ముఖంమీద మొలిపించుకొంటూ — సీతి బిక్కముహం వేసుకు చూస్తోంది! ఇందాకట్నుంచీ దొర్లి దొర్లి దెబ్బలాడి దెబ్బలాడి నలిగిపోయిన పరికిణీ... నూనెడాగులూ, మరకలూ పడ్డ నీలంరంగు జుబ్బా... జుట్టురేగి, బొట్టురేగి, కాటుక చెరిగి ... ఈర్ష్యగా ఆ విరిగిన పళ్లదువ్వెన పైపే మనసు లగించి చూస్తోంది!

'నాకదే కావాలి నాకదే కావాలి' అన్నట్టు ప్రగాఢవాంఛ—చూపులో తనకి దక్కక మరొకళ్ల చేతికి దక్కిపోయిందన్న ఈరసం, అసహ్యం—ఎడనెడ కళ్ళల్లో మెదిలిస్తూ, నీడలు నీడలుగా దుఃఖమేఘాలు పరుచుకుంటూ చూస్తోంది!

వీరిగాడికే ఎందుకు దక్కాలీ? ఆపళ్లు విరిగిన దువ్వెన? వాడు ముందుగా చూసి కాజేశాడు. చెలరేగిన ముంగురులు కళ్ళకడ్డంగా పడుతున్నాయ్!

కోపంగా కళ్లెఱ్ఱగిల్లగా పళ్లు బిట్టగఱచి—"ఏరా వీరీ! నా దువ్వెన నాకిచ్చి"—అంది. ఈసారి కళ్ళల్లో కోపావేశం పెదవులమీంచి జారిపడింది.

వీరిగాడు మాత్రం...ఆ 'రుద్రమాంబా భద్రకాళీ లోచనోజ్జ్వలరోము'లకి హాపెలెత్తి పళ్ళులేని దువ్వెన పారేసి పారిపోలేదు! సరిగదా—హాహ్హా హ్హా అని హేళనగా నవ్వాడు ముఖానికి వికారం పూసుకుని.

'మగవాడిది నాదిసుమా హక్కు...ఈ హక్కు భుక్తా లనుభవించాల్సినవాణ్ణి నేను' అన్నట్టు నవ్వుతూ చూశాడు, ఈ నవ్వుని తిట్టుకింద నెటకారం కింద వెక్కిరింతకింద జమకట్టి......"ఊఁ ఊఁ నా దువ్వెన నాకిచ్చి" అని ఏడుపు సాగించింది. వీరిగాడికి ఏడ్చే ఆడవాళ్ల రహస్యం తెలిసిందికాదు లేకపోతే తనూ పెంకులెగరగొట్టును! ప్రస్తుతాని కీతగవు ఏ విధంగానూ పరిష్కారం కావడానికి, ఒక వెలుగు గోచరించలేదు ఇద్దరూ చీకట్లో చిందులు తొక్కుతున్నారు. ఇందాకట్నుంచీ వంటింట్లో పని చేసుకొంటోన్న మంగతాయారుకి—ఆడపిల్ల సతి ఏడుపు ఘుర్రుమని అంటుకుంది.

చేతిలో అట్లకర్రతో బయటికి ప్రత్యక్షమౌతూ..."ఏమిట్రా! పడవ రణగోల మీరూను... ఇల్లు తీసి పందిరేస్తున్నారు! ఏం వొచ్చింది మీ ప్రాణాలకి." అంది విసుపూ కసురూ మాటల్లో విసురుతూ.

వీరిగాడికీ విషయం అంతుచిక్క చావలేదు! ఇందాకట్నుంచీ, తామై పోట్లాడుకుంటూన్న విశేషం ఇంత చులకనగా లేకిగా తీసిపారేయడం చాలా అసహ్యమనిపించింది! ఒక సమస్య పరిష్కరించుకొనే నిమిత్తం తమ పోట్లాట ప్రాధాన్యతని గుర్తించకుండా, తెలుసుకోకుండా దాన్ని 'గోల' అని కొట్టి పారేయడం ఏవిధంగానూ సహించరానిదైంది!

"నీకు గోలగావుంది మరి! ఈ దువ్వెన నాదయితే, ఇందాకట్నుంచీ, ఇమ్మని పీకుతోంది చెల్లి" అన్నాడు, దువ్వెన జోబీలో దాచేసుకుని, దాని వాసన సైతం పైకి పీచకుండా చేతుల్తో కప్పుతూ...

"ఏం దువ్వెన్రా అది? ఏదీ పైకితియ్యి" అంది మంగతాయారు.

"అమ్మా! నా దువ్వెన నా కిచ్చిమనే"—సీతి మళ్ళీ అదే పాట పాడింది ఏడుపులోంచి తొంగి చూస్తూ...

వీరిగాడు దువ్వెన పైకితీసిన పాపాన పోలేదు. ఒక్కసారి 'ఉహుఁ' అని, బుర్ర అటు హిమాలయ పర్వతాలనించి కన్యాకుమారి అగ్రందాకా తిప్పేశాడు.

సీతి పరికిణీ వేళ్ళతో తమాషాగా సుంద్రంగా చుట్టబెట్టుకుంటూ, బద్ధకంగా వళ్ళు విరుస్తూ—చిగుళ్ళపైకి శీఘ్రంగా కనపడేట్టు—పెదవులు సెలవివార సాగదీసి, ఏడుపు మళ్ళీ సాగించింది!—ఇదే

అదనన్నట్టూ, ఈ అదను దాటితే దువ్వెన తనకు దక్కదన్నట్టూ

"దువ్వెన తెస్తావా? తన్నుల్నా తింటావా?" అని చేయెత్తింది మంగతాయారు. వీరిగాడికి చేయెత్తేసరికి—ఎంత ధైర్యం గల మగవాడైనా—వణుకుపుట్టింది. ఐనా బలవంతంగా దువ్వెన వేళ్ళసందుల్లో బిగబట్టి, నెమ్మదిగా పైకితీసి చూపించాడు. ఒకవేళ నీతి మీద పడి గబుక్కున లాక్కుని పారిపోతుందేమో అన్నంత భయపడుతూ...

గుప్పెట్లోంచి, సందు సుమ్ముల్లోంచి ముసలవ్వ తొంగిచూసినట్టు తొంగిచూసింది దువ్వెన పళ్లూడిపోయిన బోసిభాగాన్ని స్పష్టంగా చూపుతూ...

"ఓరి నీయిల్లు బంగారంగానూ.. పళ్లు విరిగిన నీలం దువ్వెన్రా! ఏ పెంట కుప్పమీద సంపాయించావురా? అవతలపారేయ్!" అంది మంగతాయారు విరగబడి నవ్వుతూ. వీరిగాడికి రోషం, ఆవేశం, ఆవేగం ముంచుకొచ్చింది. ఇల్లంతా గాలించి గీలించి, సంపాయించిన దువ్వెన్ని చూసి, విరగబడి నవ్వుతుందా? కన్నకొడుకు పడ్డకష్టాన్నయినా కానరాదే తల్లికి?... సహించలేకపోయాడు వీరిగాడు. దుఃఖ పర్యంతం కళ్లల్లోంచి ప్రవహించనుంకించింది. కాని రసాభాస ఔతుందేమో అని, తనూ 'హిఁ హిఁ హిఁ' అని నవ్వేసి ఊరుకొన్నాడు.

"ఇది నా జేనేవ్! అమ్మా! నీతికి దాన్ని చూస్తే కళ్లుకుట్టాయి. నాదగ్గరేదుంటే అది లాక్కోవాలంటుంది. దానిమీదే గంటలతరబడీ పడేడుస్తుంది. అది మొన్న కొనుక్కున్న రిబ్బను నాటకం వాడిలా కట్టుకుంటూనంటే ఇచ్చిందేమో...? అడుగు! అన్నీ దానివి పీనాసిబుద్ధులేనే! ... నా కణికలోంచి రోజుకో బలపమ్ముక్క పిరిచేస్తోంది దొంగముం..."

"ఛీ వెధవా నోరుముయ్! ఆడపిల్లనలా అనొచ్చా? నోరు నొక్కుతా..."

మంగతాయారు చేతిని కొట్టడానికి తయారు చేస్తూ అంది! "ఈ యిల్లూ పొలాలూ, ఆ స్తిపాస్తులన్నీ నువ్వనుభవించడానికే కాదురా! దానికేవుంది? ఆ పసుపుతాడు మెడలో పడగానే...అత్తారింటికి వెళ్లిపోతుంది! ఈ ఉండే నాలుగురోజులన్నా దాన్ని నిలబడనీయ్!" ముఖం తీక్షణంగా మార్చి స్పష్టంగా ఒక సిద్ధాంతాన్ని స్థాపిస్తున్నట్టు అంది!

"శేషత్తయ్యగారింటికి నేనూ వెడతాను! నీతే నేమిటి మహా వెళ్లేది! అదే నేమిటి మహా ఊడబొడిచింది!...అక్కడ సోమిగాడూ నేనూ ఎంచక్కా గోళీకాయలూ, గూటీబిళ్లలు ఆడుకొంటాం"—వీరిగాడు ఊరిస్తూ, బెల్లిస్తూ అన్నాడు.

దేవుడి గదిలో జపం చేసుకుంటూన్న నాయనమ్మ చావిట్లోకొచ్చి, "ఏవిఁటి? మంగా? ఏవిఁటీ జగడం" అంది.

నాయనమ్మ దగ్గిర నీతికి మరింత చనువెక్కువేమో—దాంతో ఆవిడ దగ్గిరకెళ్ళి గునిసింది 'నాయనమ్మా! దువ్వెనిప్పించవూ?' అంటూ.

"పళ్లు విరిగిన పాడుదువ్వెన! ... ఛీ ... అదెందుకే? నాన్నగార్ని రానీ మంచిది కొనుక్కుందాం—ఆ వెధవకి చూపెట్టినన్నా చూపెట్టమాక—" మంగతాయారు కూతుర్ని బుజ్జగిస్తూ అంది

"కొనుక్కుంటే కొనుక్కోమను నాకేం అక్కర లేదు..." నాయనమ్మ నీతిని దగ్గిరికి లాక్కుని, "పోన్లేవే! నీకణా ఇస్తా ఏవఁన్నా కొనుక్కుందూగాని..."

ఈమాటలు వినేసరికి, వీరిగాడి నోరూరింది. అంతా, నీతినే దగ్గిరికి లాక్కోవడం, బుజ్జగించడం—ఎప్పుడూ ఇవ్వనన్నది ఇచ్చేస్తాననడం—చిత్రంగా వెగటుగా ఈర్ష్యగా తోచింది. మెల్లిగా నాయనమ్మ దగ్గరగా జేరి, "నాయనమ్మా! ఈ దువ్వెనిస్తా ఏమిస్తావ్?" అన్నాడు.

"ఈ దువ్వెనకి నాదగ్గర బేరం పెట్టావుట్రా? ఏదీ పైకి తియ్! దాని మొహం ఎలా వుందో చూదాం."

దువ్వెన బయటికి తీసి చూపించాడు.

"నాకులాగే వుందిరా! పళ్ళు విరిగి జిడ్డు గారుతూ..." నాయనమ్మ విరగబడి నవ్వింది. "ఇదేనట్రా? నిన్నా మొన్నా ఈ తెలుపురూలా, ఆ గూట్లో—చిక్కుడుపాదులు ఎగ్గరా పడేస్తూవుంటే ఎవరికీ అక్కరలేకపోయింది..... ఇవ్వాళ దీనికి కొమ్ములు మొలిచాయట్రా?"—

"మన పక్కింటి గోపాలంవగ్గర దువ్వెనుందే! వాడు నిన్న బళ్ళోకి తెచ్చి చూపించాడు. ఇవ్వాళ ఆ వెధవగాడికి చూపించి ఉడికించాలి."

"ఆఁ మీ తగువులు వింటూ కూర్చోడానికి తీరుబడిలేదురా! ఎలాగో తగలెయ్యండి"—మంగతాయారు వంటింట్లోకి జారుకుంది!

ఇంట్లో ఇద్దర్లో—ఏ ఒక్కరు, ఏ వస్తువు సంగ్రహించినా, రెండోవాళ్లు సహించలేరు. అది

ల్లావు గాని...నువ్వూ ఆడేదానివి. మేమెవరం గాము...దానికి, వాడి లోబీలో గుచ్చెనిప్పించండీ! సగం గొడవ తగ్గుతుంది!"

"ఆ గుజ్వెన దాని కెందుకూ? అది వాడిది"

"ఐతే మరోసాటి కొనివ్వండి దానికి"

"కావాలంటే మీరే కొనుక్కోండి, మాకేం? నీదువ్వెన బయటికి తియ్యరా! అమ్మనీ, చెల్లినీ, నాయనమ్మనీ, అడిద్దాం"

నవ్వుతూ, అన్నాడు సోమేశం!

"బాగా నేవుంది చిన్న పిల్లాడిలా! మీకేం ఏడిపించనక్కరలా... కావాల్సినప్పుడు మేమేఏదుస్తాం! ...నీళ్లు మరిగిపోతున్నై స్నానానికి రండి!"

వీరిగాడు గర్వరేఖముఖంమీద నాట్యమాడుతూ వుంటే బయటికి తీశాడు ఆ దువ్వెన కొస్తా

"ఓస్.. ఇదేం దువ్వెన్నా?...పళ్లు కొలవలే పారేయాల్సిందే!...పళ్ళు విరిగి...మొహం విరిగి... అవతల పారెయ్ మంచిది కొనుక్కుందాం?"

"ఊహుఁ నేను పారెయ్యను గోపాలంగాడికి చూపించి, నా గొప్పతినం చూపించాలి. నిన్న వాడిలాంటిదే బళ్లోకి తీసుకొచ్చాడు"

"పారెయ్‌రా సీతికి పారేయ్! మనం మంచిది కొనుక్కుందామన్నాంగా... ఒక పేకెట్టు దువ్వెన్లు తెస్తాను! ఊఁ పారేయ్!...పారెయ్ మరి"

వీరిగాడికి, అది పారేసేందుకు, ఏవిధంగానూ మనస్కరించలేదు. మీదు మిక్కిలి తిరస్కరించాడు.

"పారేయ్‌మంటే పారేస్తావా?..."

కళ్లెర్రజేశాడు కోపం నటిస్తూ సోమేశం!

"ఏదీ కొత్తదువ్వెన?"

బిక్కు బిక్కుమని చూస్తూ అన్నాడు అదిస్తే, ఇది పారేస్తానన్నట్టు.

"అది పారెయ్ చెప్తా."

కదిలాడు. ఇక వాడిదగ్గర్నుంచి, అది పారేయిస్తేనేగాని, శాంతిలేనట్టనిపించింది. సీతి ముఖం వాడి వత్తలైవుంది. ఏడ్చిందేమో.. కన్నీటి మకిలి ధారలు కళ్లనిండా కిలంపట్టి వున్నయ్!

శిథిలగృహాన్ని విడవలేక విడిచినట్టు విడిచాడు. పగిలిపోయిన గాజు కూజాని పారేయలేక పారేసినట్టు పారేశాడు. దాని కింకొ దగ్గరగా నిలబడుతూ, సీతి వచ్చి కిందపడిందాన్ని లాగేసుకుంటుందేమో అని భయపడుతూ...చూస్తున్నాడు పులుకు పులుకున!

సీతిని, "తీసుకోవే!" అని గదమాయించాడు. సీతి నసిగింది. భయపడింది.

"నాకూ...కొ...త్త...దువ్వె...నా" అని సాగదీసి సాగదీసి అంది ప్రతీ అక్షరాన్నీ. "పళ్ళు విరిగిపోయింది! అదెందుకు నాకు" అంటూ.

"దానికోసమే...ఇందాకట్నుంచీ, పేచులాటా, పెడబొబ్బలూ...ఏడుపులూ ఎందుకూ మరి" కళ్లల్లో రోషం వెలాడుతూంటే గర్జించాడు. బలవంతంగా చేతుల్లో పెట్టబోయాడు. తోసి పారేసింది.

వీరిగాడి మొహం వెలవెలబోయింది. ఎందుకు వద్దంది? తను కొత్తది కొనుక్కుంటాననేసరికి, దాని చెవులు నిక్కాయి. ఇప్పుడా, పాత పనికిరాని పాడుదువ్వెన పళ్లు విరిగిం దెవడికావాలి?... సోమేశం చాలా ప్రయత్నం చేశాడు ఆ దువ్వెన అంటగడదామని సీతకి.. సీత కళ్లంట మళ్ళీ నీళ్ళు తిరిగాయి. "నాకు కొత్తదే కావాలి" అంటూ కూచుంది. సోమేశం వీరిగాడివైపు తిరిగాడు. "పోన్లే! నువ్వే తీసుకోరా! దాని కొద్దట..."

"నాకు కొత్తది కొంటానన్నావు గామూ? అది దానికిచ్చెయ్" అన్నాడు వీరిగాడు దిక్కు మొహం వేసుకుని—

"ఏడిశారు! అసలు మీకు దువ్వెన్లెందుకంట? బోడితలలూ మీరూను" అని కసుగుకున్నాడు.

"నువ్వెనా కొంటానన్నావూ?..." అన్నాడు వీరి. "ఊఁ కొనివ్వండి! చెరో హాటి! మీరే రేపెట్టారు! వాళ్ళలో వాళ్ళే ఏదో గొడవపడితే ఏదో పోను. మీరు చేసిన నిర్వాక మేమిటి?...కొనివ్వక పోతే, మీ భుజాలెక్కి తాండవమాడుతారు! ఏది కనిపిస్తే అది పగలగొడతారు." అని చెప్పి పాకిచింది మంగతాయారు.

సోమేశం కొనక తప్పదన్నట్టు వాతావరణం బలంగా సూచిస్తోంది. ఆమాట కొట్టెపారేయాలని చూస్తున్నా సోమేశానికి, పిల్లలకి దువ్వెన్లెందుకూ? అన్న ప్రశ్న తలెత్తింది

"ఎందుకురా? ఈ దువ్వెను మీకు"

వీరిగాడికి నవ్వొచ్చింది. ఐనా మొహమాటంగా నవ్వకుండా, "దువ్వుకోడానికి" అన్నాడు.

కాపుకి సరిపడేటంత జుట్టే లేదుగదా! మొన్నే అన్నవరంలో జుట్టు తీయించుకొచ్చాడుగదా?... అసలెందుకు ఈ సమస్య?—"

"జుట్టురానీ...నీకు కొంటా! ఏవేఁసీతీ! అమ్మ దువ్వెన్తో దువ్వుకోనువ్వు"—

"సరే" అని బుర్రూపింది సీతి.

అసలు కలహకారణంగా రసమయ పట్టులో ఓలలాడిన, అబోసి దువ్వెన, పళ్ళువిరిగిన దువ్వెన. ఐదునిమిషాల్లో స్వేచ్ఛగా పెంటమీద దొర్లాడుతోంది!

# ప్రాచీన రాజసౌధములు

## శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

భువనములకుఁ జేరుఁ బెట్టు సంప్రదాయము మన నాఁట నేనాఁటనుండి యనూచానముగా వచ్చుచున్నదో మనకుఁ దెలియరాదు. కాని, ప్రాచీన కాలమున రాజులు, సంస్థానాధిపతులు, జమీందారులు మున్నగువారు తమ రాజప్రాసాదములకు జాలవఱకు సన్వర్థములే యనందగు పేళ్ళు బెట్టుకొని వాని నా పేళ్ళతోనే వ్యవహరించుటకు ముచ్చటపడుచుండెడివారని తెలియుచున్నది. తెలుఁగునాఁట వెలసిన యట్టి రాజసౌధములు కొన్నిటిని గూర్చిన ప్రశంసలు మనకు మన సాహిత్యములో నచ్చటచ్చట గానవచ్చుచున్నవి. ఆయా యి ప్రశంసల మూలమున దెలియవచ్చుచున్న ప్రాచీన రాజసౌధములను గూర్చియు, వానికి సంబంధించిన యితర విశేషములనుగూర్చియు నించుక తెలిసికొందము.

1. గృహరాజసౌధము — రెడ్డిరాజులకుబూర్వము తెలుఁగునాఁట వెలసిన రాజప్రాసాదములెట్టివో మనకు దెలియరాదు. రెడ్డిరాజులకాలమున మనకు దెలియవచ్చుచున్న రాజప్రాసాదములలో గృహరాజసౌధము పేర్కొనదగినది. ఈ గృహరాజ సౌధ నిర్మాణమును గూర్చి యొక కట్టుకథ కొండవీటి దండకవిలెలో గలదు.

శ్రీనాథుడు కోమటి వేంకారెడ్డిగారి యాస్థానమున నున్నకాలమున నొకప్పు డాతడు విద్యానగరమునకు రెండవ హరిహరరాయలను సందర్శింప బోయెనట! అప్పు డాతడు మీ యూరేది యని యడుగగా శ్రీనాథుఁడు

పరరాజ్య పరదుర్గ పరవైభవశ్రీలఁ
గొనకొని విడనాడు కొండవీడు — ఇత్యాదిగాఁ బద్యమును జెప్పి తన నివాసము కొండవీడని తెలియజేసెనట! శ్రీనాథుఁడు విద్యానగరమున నే రాజసమ్మానమునకై వేచియుండెను. హరిహరరాయ లొకనాడు కొలువుదీరియుండి యొంటి స్తంభముతో నున్నతోన్నత మగు నొకమేడను నిర్మింప దనకు దలపుగలదనియు, నది యనన్యరాజ కల్పితముగా నుండవలయుననియు సభ్యులకు తెలిగించెనట! శ్రీనాథుఁ డదివిని తనయేలిక యగు రెడ్డిరాజునకుఁ బెంపు సెలయింపదలచి 'దేవా! మా భూపాలుని రాజధానియగు కొండవీటిలో మింటిదనంటు నట్లొంటి కంబపుమేడ యీ వఱకే నిర్మింపబడెను' అనెనట! రాయ లది విని యాశ్చర్యముజెంది యథార్థ మరసి వచ్చుటకుఁ దన భృత్యులను కొండవీటికిఁ బంపెనట! తన యాడిన యనృతము బయల్పడిన నవమానము వాటిల్లునని భయపడి శ్రీనాథుడు తన యిష్టదేవత నారాధించి యేడుతాళ్ళ పొడుగును, వేయు ప్రేంకులు చుట్టివచ్చు నలవునుగల నవులూరులోని యుమ్మెచెట్టును స్తంభముగా నలవరించి కొండవీటిలో గృహరాజుమేడ నప్పటి కప్పుడే నిర్మింపజేసెనట! ఈ విషయము దెలిసికొని రాయలు శ్రీనాథుని కవితసమ్మాన మొదవించెనట! అభూతకల్పనతో గూడిన యీ కథ యెంతవఱకు విశ్వాస్యమో మనకు దెలియదు.

ఇందు పెదకోమటి వేమభూపాలుని యేలుబడి కాలమున కొండవీటిలో గృహరాజసౌధము నిర్మింపబడుట మాత్రము యథార్థము. ఇట్టి సౌధవార్త కాలమునం దాంధ్రదేశమున నెక్కడను లేదట! ఈ క్రింది పద్యము జూడుడు —

పోలయ వేమన్న పొలుపార బండ్రెండు
వత్సరంబులు గాచె వసుధగొల్ల
నటవెన్క ముప్పది యన పోత వేమన్న
వన్నెవాసికి నెక్క వసుధయేలె
ధర్మాత్ముడన వేమధరణీ కళత్రుండు
పదియు నేనిట భూమి బదిలపఱచె
ప్రజల కుబ్బసముగ బదునాలు గేడులు
కొమరగిరి యేలెను సమయుదాక
నేలె గోమటి వేమన యిరువదేడు
రాచవేమన్న నాల్గువర్షముల నేలె
మించి కట్టిరి గృహరాజు మేడ కొండ
వీట నూటేండ్లు రెడ్లు భూవిదిత యశులు.

చాటుపద్య మణిమంజరి. ప్రథమభాగము.

శ్రీనాథమహాకవి శాసనకృతిలో నొకచోట నీ గృహరాజ సౌధప్రస్తావము కలదు.

శ్లో॥ ఆక్రాంతం గృహరాజసౌధ నివసల్లక్ష్మీ కరాభ్యంతర
క్రీడాంభోగృహ తాళవృంతపవన ప్రస్తారవిస్తారితః
వాయుః కేసరవాసనాసురభితో యస్యార్థి చింతామణే
ర్దారిగాచామతి దానకేళి జనితం స్వేదాంభసాం జాలకమ్.

—చెఱువు శాసనము

కొండవీటి కైఫీయతులో గృహరాజు మేడకు సంబంధించిన వృత్తాంత మిది చూడుడు.

'ఈ గుండాలకు దక్షిణం పూర్వం రెడ్లవారు కట్టించిన బహు ప్రబలమయిన కోనేరు వున్నది. ఈ ప్రదేశమందు రెడ్లవారియొక్క రాజగృహములు అని చెప్పినారు. ఆ కోనేటికి పశ్చిమం హద్దు అనుకుని గృహరాజు మేడదిబ్బ అని వున్నది రెడ్లవారు ప్రభుత్వం చేసే కాలమందు కోమటి వేమారెడ్డిగారు శ్రీనాథుని వారియొక్క ప్రభావంచేతను నవులూరి పోతురాజు దేవాలయందగ్గర వున్న యేడుతాళ్ల పొడుగున్నా, యేడుమోకులు తిరిగే లావున్నా గల తుమ్మచెట్టు తెప్పించి స్తంభంగా చెక్కించి వంటి స్తంభం మేడ కట్టించి తమకు యిష్టమైన ఆదిలక్ష్మీ కామేశ్వరి అమ్మవారికి సింహాసన స్థానంగా నేర్పరిచి వైభవములు జరిగించి యీ మేడ శిఖరానకు, బొలినోరు వేంకటేశ్వరస్వామి దేవాలయానకు మకరతోరణం కట్టించినారట! ఇక్కడ వెంకటేశ్వర స్వామివారు వున్న కొండసహజా తూర్పుగా వుంటుంది. ఈ మేడకు అనుకునే జడ్డిగాలభావి అనే కోనేరు వున్నది'—

ఈ కైఫీయతులో గృహరాజ సౌధము ఆదిలక్ష్మీ కామేశ్వరికి నాస్థానముగా నుండినట్లు వ్రాయబడినది. అది యథార్థము. శ్రీనాథుని శాసన శ్లోకమునగూడ నా సౌధము 'లక్ష్మీ నివాసము' గానే వర్ణింపబడి యున్నది.

ఈ గృహరాజ సౌధము నిర్మింపబడినతర్వాత దాదాపుగా నిర్వది ముప్పది సంవత్సరములకే పర రాజులపాలై మాఱుపబడినది. అయ్యు నప్పటి కైదువందల సంవత్సరములు కడచిన యీ కాలమున గూడ నయ్యది తన సన్నివేశము నెఱింగించుచు జరిత్రాన్వేషకులకు వ్యసనము గలిగించుచున్నది.

2. త్రైలోక్యవిజయసౌధము—గృహరాజ సౌధమునకు దగువాత భోగ్యనగిన సౌధరాజము త్రైలోక్య విజయసౌధము. ఈ సౌధమున కొక ప్రత్యేకత గలదు. రాజమహేంద్రవరమున వీరభద్రారెడ్డి యీ సౌధముననే రాయడోలగ ముండి కాశీఖండమును దనకు గృతి యిమ్మని శ్రీనాథుని గోరెను! కాశీఖండములోని యీ క్రిందిపద్యము జూడుడు.

సీ. త్రైలోక్య విజయాభిధంబైన సౌధంబు
చంద్రశాలా ప్రదేశంబునందు
సచివసైన్యాధీశ సామంతనృపవార
సీమంతినీ జనశ్రేణి గొలువ
శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు
విద్వత్కవీంద్రులు విస్తరింప
గర్పూర కస్తూరికా సంకుమద గంధ
సార సౌరభము దిక్పూరితముగ
నిజభుజావిక్రమంబున నిఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠ మెక్కించినట్టి
యన్న వేమేశ్వరుని యంక మాశ్రయించి
నిండు గొలువుండె గన్నుల పండువగుచు.

త్రైలోక్య విజయసౌధము నందలి 'చంద్రశాలా ప్రదేశము'నందు గొలువుండి శ్రీనాథుని బిలువ బంచినాడు [illegible]దారెడ్డి! ఈ చంద్రశాలా ప్రదేశమునందు గూర్చుండిన గోదావరీ తరంగ తాండవ మగపడునట! ఈ క్రిందిపద్యము జూడుడు—

త్రైలోక్య విజయ సౌధ వి
శాల మహోత్తుంగ చంద్రశాలా
వ్యాలోకిత గౌతమ క
న్యాలహరి విహార తాండవాటోపునకున్.

త్రైలోక్య విజయసౌధమునందలి చంద్రశాల విశాలము, మహోత్తుంగము నయినదట!

ఇప్పుడు చిత్రాంగిమేడ యని చెప్పబడెడు దిబ్బ యీ త్రైలోక్య విజయసౌధపు బాటిదిబ్బ యగునా యని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు శంకించుచున్నారు.

3. ముత్యాలశాల—శ్రీనాథుని విద్యా వైశారద్యము సత్కృతి గాంచిన సభాగార మిది! శ్రీనాథుడిచ్చటనే కనకాభిషేక సత్కార మందినాడు. శ్రీనాథుడు కర్ణాటాధీశ్వరు డగు ప్రౌఢదేవరాయలను దర్శించుటకై కొండవీటినుండి విద్యానగరమునకు బోయెను. విద్యానగరమున

'కర్ణాటక్ష్మానాథేంద్రుని' సభలో డిండిమ భట్టారకునకును, శ్రీనాథునకును గొప్ప విద్యావివాదము జరిగెను. అందు శ్రీనాథుడు డిండిమభట్టారకునోడించి 'కవిత్వ విజయోత్సాహంబు' గైకొనెను. కవి సార్వభౌమ బిరుద మాతనికి రూఢమయ్యెను. ఆ సందర్భమున కర్ణాటాధీశ్వరు డగు ప్రౌఢదేవరాయలు తన 'ముత్యాలశాల'లో బహు పండిత పరివార బహుకార పూర్వకముగా కనకాభిషేక సత్కారము గావించెను.

సర్వజ్ఞ సింగభూపాలుని సందర్శింపబోవుచు శ్రీనాథుడు చెప్పిన యీ క్రిందిపద్యము జూడుడు—

సీ॥ దీనారటంకాల దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పగులగొట్టించితి ఉద్భటవివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూష క్రియాశక్తి రాయలయొద్ద
బాదుకొల్పితి సార్వభౌమ బిరుదు
పలుకుదోడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునను
గీ॥ ఎటుల మెప్పించెదో నన్ను నింకమీద
రావుసింగ మహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొనియుండి నీవు
సరస సద్గుణ నికురుంబ! శారదాంబ!

కాశీఖండము కడపటగూడ శ్రీనాథుడు తనకు విద్యానగరమున 'ముత్యాలశాల'లో జరిగిన స్వర్ణస్నానమును జేర్కొనినాడు. ఈ క్రింది పద్యము జూడుడు—

కర్ణాట క్షితినాథ మౌక్తిక
సభా గారాంత రాకల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ
కవిరాట్సంస్తుత్య చారిత్ర! దు
గ్ధార్ణోరాశిగభీర! ప్రాహ్ణా
ముఖ మధ్యాహ్న పరాహ్ణార్చితా
పర్ణావల్లభ! రాజశేఖర మణీ!
పంటాన్వయ గ్రామణీ!

4. శారదా మందిరము—ఇది సర్వజ్ఞ సింగభూపాలుని సభాభవనము. శ్రీనాథుడు సర్వజ్ఞ సింగభూపాలుని దర్శించుటకై రాచకొండకు బోయినప్పు డచ్చటి సభాభవనమున నెలకొలుపబడియుండిన శారదావిగ్రహమును గాంచి 'దీనారటంకాలదీర్థ మాడించితి' ఇత్యాదిపద్యము జెప్పినాడు.

'ఎటుల మెప్పించెదో నన్ను నింకమీద
రావు సింగమహీపాలు ధీవిశాలు
నిండు కొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణ నికురుంబ! శారదాంబ!'

అనుటచే రావు సింగమహీపాలుని కొలువుకూటములో శారదావిగ్రహము నెలకొలుప బడియుండుట రూఢి యగుచున్నది. ఆ కొలువుకూటమునకు శారదా మందిర మను పేరు కలదనుటయూహా మాత్రమే!

5. భువనవిజయము—రెడ్డిరాజుల కాలమునకు దరువాత శ్రీ కృష్ణదేవరాయల కాలమున గొన్ని సౌధ రాజములు వెలసినట్లు మనకు గానవచ్చుచున్నది. రాయల గృహవైభవము పారిజాతాపహరణమున నిట్లు ప్రశంసింపబడినది.

సైంధ్యద్విప గంధ నిబ
ద్ధాంధ్యాళి ప్రతిపదోదితాలయ విభవా
వంధ్య ప్రబంధకృతి సం
బంధ్యనుభావునకు బుధిల మనుభావునకున్.
(ఆ ౧. ౬౧ ప)

కృష్ణరాయని గృహవైభవములను వింధ్యోద్భవము లగు వేనుగుల మదజలముల గ్రోలుచు మదాంధములై యున్న 'తుమ్మెదలు సర్వత్ర కీర్తించుచున్నవో యనునట్లుల వుంకారములు సేయుచుండు ననియు, నట్టి గృహవైభవముల నలరు నాలని మహాత్మ్యమును కవులు ప్రబంధములందు బొగడుదురనియు భావము.

మనుచరిత్రములో గూడ నొకచోట నితని గృహవైభవము ప్రశంసితమయినది. ఈ క్రింద పద్యము జూడుడు—

నాగాంబాసుత జితకద
నాగత మదనాగ సంగమానూప గృహా
భోగా భోగపురందర
భోగీంద్ర శయాన పురుష పూజా ప్రవణా!
(5 ఆ. 106 ప).

భువనవిజయము రాయలవారి సభాభవనము. సాహితీసమరాంగణ సార్వభౌములయిన శ్రీ కృష్ణదేవరాయలవారీ భువన విజయ సభాంగణమున నే కొలువు దీరుచుండువారు. అష్టదిగ్గజములీ సభాస్థానమునే యలంకరించి రాయలతో విద్యాగోష్ఠులు నెఱపిరి. అల్లసాని పెద్దనార్యుని స్వారోచిష మను సంభవరచనమునకు రాయలవారు ప్రోత్సహించినదియు నీ సభాభవనమునందే. మనుచరిత్రమునందలి యీ క్రిందిపద్యము జూడుడు.

క॥ భువనవిజయాఖ్య సంస
ద్భవనస్థిత భద్రపీఠి ప్రాజ్ఞులగోష్ఠిన్

గవితామధురిమ 'డెందము
దవులఁగ గొలువుండి సదయతఁ గను బల్కెన్.
(పీఠిక ౧౩)

పారిజాతాపహరణమునఁగూడ నీ భువనవిజయ ప్రస్తావము గలదు. పద్య మిది చూడుడు—

"భువనవిజయాఖ్య సంస
న్నవరత్న విభా ప్రభాత నలినాప్త! రమా
ధవచరణ కమలసేవా
ప్రవణమతీ! వీరరుద్ర పర్వతవజ్రీ!"
(౫ ఆ. 108 ప)

భువనవిజయ సభాభవనము నవరత్నఖచితము. అందలి నవరత్నములకు బాలసూర్యుని బోలినవాఁడు శ్రీకృష్ణదేవరాయలు. అనగా బాలసూర్యుడు రత్నములను ప్రకాశింపచేయునట్లు కృష్ణరాయమహారాజు భువనవిజయ మను పేరుగల తనకొలువుకూటమునందలి సభాసదులమనంబులను వికసింపజేయువాఁడని భావము.

6. మలయకూటము—భువనవిజయము రాయల వారి సభాభవనము కాగా మలయకూటము రాయల వారు నివసించు రాజప్రాసాదమై వాసి గాంచినది. 'మలయకూట ప్రాసాదనివేశ'యని పారిజాతాపహరణమున నాతఁడు ప్రశంసితుఁడయినాడు. ఈ క్రింది పద్యము జూడుడు—

"శ్రీసదన లోచనాబ్జద
యాసార మరందపోషితార్థి భ్రమరో
ల్లాసగుణ మలయకూట
ప్రాసాదనివేశ! కృష్ణరాయమహీశా!"
(2 ఆ. 1 ప)

కృష్ణరాయల లోచనములు సౌభాగ్యకలితము లగు తామరలవలె నున్నవనియు, నందుండి మకరందము వలె దయారసము వర్షించుననియు, నా దయారసమనెడు మకరందముచేత యాచకు లనెడు తుమ్మెదల నాతఁడు పోషించుచున్నాఁడనియు, నట్టి యాచకులచే నిండిన మలయకూట ప్రాసాదమునం దాతఁడు నివసించుననియు భావము. యాచకు లనగా నిచ్చట గళాప్రవీణు లగు కవిగాయకులు మొదలగువా రని యర్థము.

మనుచరిత్రములోఁగూడ నొకచో నీ మలయకూట ప్రస్తావము కలదు. క్రిందిపద్యము జూడుడు—

క॥ తిరుమలదేవీ చరణో
దరలాక్షా కల్ప కల్పితస్థలకమల
స్ఫురదిందీవర బంధుర
హరిహయమణి మలయకూట హర్మ్యవిహారీ!
(౩ ఆ. ౧౪౩ ప)

తిరుమలదేవి కమలములను బోలిన చరణోదరములయందు బూసికొనియుండిన లత్తుకచే నేలపై స్థలకమలములు కల్పింపబడెననియు, నా నేలపై జెక్కియుండిన యింద్రనీలము లా స్థలకమలములపై ప్రాలిన తుమ్మెదలవలె నుండెననియు నట్టి మలయకూటప్రాసాదమున రాయలు నివసించుచుండుననియు భావము.

కాని మనుచరిత్రములో 'హరిహయమణి వలయకూట హర్మ్యవిహారీ!' యను నపపాఠము ముద్రింపబడి యున్నది. హరిహయమణిమయ మగు మలయకూట మను హర్మ్యమున విహరించువాఁ డనుటయే సరసమని 'శ్రీసదన లోచనాబ్జ' యను పారిజాతాపహరణము నందలి పద్యము తెలుపుచుండుటచే నిది సంస్కర్తల ప్రమాదమని చెప్పవచ్చును. హరిహయమణి వలయములు గల శిఖరములతోఁడ నొప్పుమేడ యనుటకంటె నింద్రనీలమణిమయమగు మలయకూట ప్రాసాదమున నుండువాఁడనుటయే హృద్యమనియు, మలయకూట మనునది యాతని ప్రాసాద' మనుటను గమనింపక సంస్కర్తలేదే నొక యర్థమును గుడిచెట్టి మకారమునకు బ్రక్కనున్న కొమ్మును దీసివేసి యుందురనియు దలపగూడును. కాన 'హరిహయమణి మలయకూట హర్మ్య విహారీ!' యను పాఠమే కవ్యభిప్రేతమగుట నిశ్చయము. మనుచరిత్రమునందలి యీయపపాఠమును గుర్తించి, శ్రీ దూసి రామమూర్తి శాస్త్రిగారు తమ పారిజాతాపహరణ పీఠిక పూలమున లోకమునకు వెల్లడించిరి.

7. విజయభవనము — శ్రీ కృష్ణదేవరాయల యనంతరము క్రీస్తుశకము పదునేడవ శతాబ్దిలో రాజన్వంతి మయిన యాంధ్ర సామ్రాజ్యలక్ష్మి దక్షిణదేశమునకు వలసపోయినది. తంజావూరు నేలిన యాంధ్ర నాయక రాజగు రఘునాథ నాయకుని కొలువున నీ సౌధరాజము నిర్మింపబడినది. రఘునాథ నాయకుఁడు పాండ్య, తుండీర, నేపాళ, చోళగులను జయించిన వెనుక క్రీ. శ. 1616 ప్రాంతమున నీ సౌధరాజమును దాను బొందిన విజయములకు జిహ్నముగా గట్టించినాడు. రఘునాథ నాయకాభ్యుదయమున నీ విజయభవన ప్రశంస యిట్లు కలదు—

'విజయ చిహ్నములచే నెలయుచునున్న
విజయభవనరాజ వేదికాస్థలినో—

చేమకూర వేంకటకవి రచితమగు విజయవిలాసమును రఘునాథ నాయకు డీ సభాభవనమున నే కృతిగొనియుండును. విజయవిలాసమునఁగూడ నీ సభా

భవనము వ్యంగ్యముగా పేర్కొనబడియున్నది. ఈ క్రిందిపద్యము జూడుడు:-

చెలులు ప్రసంగ వశంబున
నలరెం గడు విజయభవన మనినన్.

(3 ఆ. ౨౬ ప.)

ఇచ్చట విజయుడు (అర్జునుడు) ను్న భవనమని కథాపక్షమున నర్థము. రఘునాథరాయలు కట్టించిన విజయభవనమని వ్యంగ్యముగా నిందు సూచితమగుచున్నది. వేంకటకవి తన కావ్యమునకు విజయవిలాసమని పేరు పెట్టి యుండుటయు భావస్ఫోరకముగా నేయున్నదనుటలో సందేహము లేదు. దానికి సుభద్రా పరిణయమని నామాంతరము. ఇదియు బయి యూహామునకు నిర్ధారకము!

8. విజయరాఘవ విలాసము — చెంగల్వ కాళకవి రచితమగు రాజగోపాల విలాసమున 'విజయరాఘవ విలాస' మను నొక సౌధరాజము పేర్కొనబడియున్నది. అది రఘునాథ నాయకుడు కట్టించిన 'విజయభవనమే' యగునో కాక తద్భిన్నమో తెలియరాదు.

రఘునాథ నాయకుని కుమారుడగు విజయరాఘవ నాయకుడు 'విజయరాఘవవిలాస' మను భవన రాజమునందు సింహపీఠికపై గొలువు దీరియుండి చెంగల్వ కాళకవిని బిలువబంచి

'పదియార్వన్నె పసిండికిన్ వలపు
పైపై జెందు చందంబునం
జదురుల్ మీఱు భవత్ప్రబంధ
మిల నిచ్చల్ దక్షిణద్వారకా
సదనాస్థాన కథానుషంగములచే
సంభావ్యమై మించె నే
డది మాకంకిత మీవొనర్పుమని
యాహ్లాదంబు సంధిల్లగన్.

పలికినాడు. విజయ రాఘవ విలాస భవనరాజమునుగూర్చిన వర్ణనము రాజగోపాల విలాసమున నిట్లు కలదు —

'...కురులు కూకటితోడం గూడియు గూడని చిన్నారి పొన్నారి ప్రాయంబునం బగులం దృణప్రాయంబు సేసి పట్టంబుగట్టుకొన్న గిట్టినంబుసూచి సహింపక మట్టుమీఱిన పాండ్య తుండీర కర్ణాట కరహాటాదులం బంపులనంపి వెంపరలాడించి పెంపు గనిన నిజ విజయాంక లేఖ్యంబులవలన వలనుగాంచి మించు నాకీర్ణ శిశిర పన్నీరంబు, నాలిప్త కుంకుమపంకంబు, నాపూర్ణ పూర్ణకుంభంబు, నాలక్షిత తోరణ ధోరణికంబు, నాబద్ధ జాంబూనదాంబరంబు, నాలంబిత చమరవాలంబు, నా సంజితా నర్ఘ్యసింహాసనంబు, నాపాదితాష్టాపదపాదపీఠంబు, నాస్తీర్ణ వివిధవర్ణాస్తరణంబు, నాలక్షిత శుభలక్షణంబునగు 'విజయరాఘవ విలాసం' బను భవనరాజంబునందు —

విజయరాఘవ విలాస మను నా భవనరాజమున 'శారదాధ్వజము' కలదు. ఈ క్రింది పద్యము

ఒక్కొకయెడ జీని చక్కెరపానకం
బానిన ట్లాహ్లాద మావహిల్ల
నొక్కొక్కయెడ దావి సెక్కొన విరజాది
సరము లెత్తినరీతి బరిమళింప
నొక్కొక్కయెడ జల్వ లుప్పతిల్లగ మంద
మారుతంబులు మించుసుహిమ నెలగ
నొక్కొక్కయెడ మేనజొక్కు సంపాదించు
వెలది వెన్నెలతేట విధము మించ
గవిత రచియింప విజయరాఘవ విభుండె
నేర్చునని వాణి నర్తించు నేర్పుమీఱఁ
జామరానిల కందళ చలితమగుచు
దనరు సభయందు నల శారదాధ్వజంబు—

9. సరస్వతీ మహలు — నాయకరాజుల యనంతరము తంజావూరును మహారాష్ట్ర భూపతులు పరిపాలించిరి. వారిలో శరభోజీ మహారాజు కాలమున సరస్వతీ మహలు నిర్మాణము గావింపబడినది. అందు గొప్ప తాళపత్ర గ్రంథ భాండాగారము గలదు. నేటికి నది యమూల్యములు, నితర త్రాలభ్యములు నగు తాళపత్ర గ్రంథములో ప్రాచీన సాహితీ సంపదకు గాణాచియై విరాజిల్లుచున్నది! *

* ఉపజీవ్య గ్రంథములు—
శృంగార శ్రీనాథము - శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి
మనుచరిత్రము -
పారిజాతాపహరణము -
రాజగోపాల విలాసము - చెంగల్వ కాళకవి.
శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారి షష్టిపూర్తి విన్నాన సంచిక.

కథానిక :

# ష్టయ్య పంతులు

శ్రీ మా. గోఖలే

ఆ పల్లెటూర్లో ఎప్పటిలాగే తెల్లవారింది. పల్లె ప్రజలు తమ నిత్యజీవితానికి భిన్నం లేకుండా ఎవరి పనులకు వారు తయారవుతున్నారు.

బాదంచెట్టు పందిరివేసి, సొరతీగె పాకిన ఆ పూరిగుడిసె చిన్నపిల్లల బడిపంతులు కిష్టయ్యపంతులిది. గుడిసె చుట్టూ ఖాళీప్రదేశానికి చిల్లకంప దడి లాగ రక్షణవుంది. ఇతర ముళ్ళల్లాగానే చిల్లకంప ముళ్ళుకూడా పరిసరాల్లో సంచరించే ప్రాణులకు గుచ్చుకుంటే పెట్టవలసినంత బాధ పెట్టి తీరుతుంది. అయితే యీ విశ్వాసం ఆరోజు ఉదయం కిష్టయ్య పంతులుకు పూర్తిగా నశించింది.

పొరిగింటివారి పాడిబర్రె కిందటి మధ్యరాత్రి సమయంలో ఆ చిల్లకంప దడిని ఛేదించుకుని కిష్టయ్య పంతులు గుడిసెమీదకు యేపుగా యెగబాకుతున్న సొరతీగను కూకటి వేళ్ళతో సహా పెళ్లగించింది.

తెల్లవారంగానే కిష్టయ్యపంతులుతో పాటు యీ దృశ్యాన్ని చూసిన కిష్టయ్యపంతులుభార్య కోటమ్మ, ముందు ఎంతకోపంతో వణికిపోయినా తొందరపడి యెవరిమీదా నోరెత్తలేదు. 'ఇంతపని చేసిందీ పొరిగింటి వెంకయ్య బర్రె' అని కిష్టయ్య పంతులు, కోటమ్మ సులభంగా గ్రహించారు

"ఎంతపని జరిగింది! మన పిల్లలు లేచి సొర గను చూసుకుని యెంతగా బాధపడతారో! ఎవరికేం పాపం బద్దలయిందో - నాకెందుకొచ్చింది, ఆ మంచో చెడ్డో మీరే విచారించుకోండి. అవతల నాకు గంపెడంత పనుంది." అంటూ తీగె తెగినట్టు సొరపాదు దగ్గిరే కుప్పన కూలిపోయిన కిష్టయ్యపంతుల్ని పాదుదగ్గిరే వొదిలేసి లోలోపల శపించుకుంటూ యింటిపనికి వెళ్ళిపోయింది కోటమ్మ.

తెల్లవారంగానే ఆనాటికి సరిపోయే విస్తళ్ళు కుట్టటానికి గుడిసెమీద పందిరివేసిన బాదంచెట్టు ఆకులు కోసే అలవాటున్న కిష్టయ్య పంతులు ఏపైన ఆ సొరపాదు యెదుగుజూసి మురిసిపొయ్యేవాడు. బాదమాకులు కోస్తూ సొరపాదు ఏ క్షణాన పిందె వేసినా వేస్తుందనే భ్రమతో సొరతీగ ఆకౌకసందున అతి సూక్ష్మంగా రోజూ పరిశీలించేవాడు కిష్టయ్య పంతులు. సొరతీగె పిందెలు ఆకులచాటున దాక్కున్నట్టు కిష్టయ్య పంతులు కలలు కన్నాడు.

తెగిపోయిన సొరతీగ ప్రాణానికి బాధతో విలపిస్తున్న కిష్టయ్య పంతులు హృదయం బాధనివారణకు పరిహారం కోరింది. వెంటనే ఎవరో తన్నినట్టు లేచిన కిష్టయ్య పంతులు పొరిగింటివారింటికి అడ్డంగా ఉన్న చిల్లకంపదడి దగ్గరకు వెళ్ళి "వెంకయ్యబావా" అని కేక వేశాడు ఆవేశంతో.

కిష్టయ్యపంతులు వేసిన కేక విన్న పొరిగింటి వెంకయ్య కొంచెం కట్టువస్త్రం అదీ సవరించుకుని చిల్లకంపదడి దగ్గరకు చేరేలోపల కిష్టయ్య పంతుల్ని అంతరాత్మ ఒక్క క్షణం నిలవేసింది.

'ఎంతైనా పశువయిన బర్రెగొడ్డు మన స్తత్వానికి మానవ జీవితంలో పరువు ప్రతిష్ఠలున్న నీ వ్యక్తిత్వం లొంగిపోతుందా?' అంది అంతరాత్మ. 'నీ పొరుగింటి వెంకయ్యబావ నీ సొరతీగపై ప్రయోగించటానికా యింత కష్టకాలంలో ఆ బర్రెను పోషిస్తున్నది? అనివార్యంగా పలుపు తెగిన ఆ పశుచర్యకు యెవరూ బాధ్యులు కారు.—నీ వ్యక్తిత్వాన్ని గౌరవించు గౌరవించు—' అని పోరుతుంది అంతరాత్మ.

"ఏం కిష్టయ్య పంతులూ? యివాళ పొద్దున్నే పిలుస్తుండావు, ఏం కత?" అన్నాడు చిల్లకంపదడి దగ్గరకు చేరుకున్న వెంకయ్య.

"మాశావా వెంకయ్యబావా! రాత్రి నీ బర్రెగొడ్డు ఎంతపని చేసిందో?" అన్నాడు రుద్ధకంఠంతో కిష్టయ్యపంతులు ఆవేశాన్ని నివారించుకుంటూ.

"ఈ బర్రె పడిసావ! యిది మనం సెప్పినమాట యింటయ్యాంటయ్యా పంతులూ! రేత్రి పొలుపుతడు తెంపనే తెంపింది గావాల్ను. యిట్ట తెల్లారి లేసి చూస్తునుగందా వామిలో జనపకట్టె చెత్తి చెత్తగా

తినేసి నెమరేస్తా కూకుంటది! అయితే మీ గొడ్లకి కూడ నేర్పించవల్ల మాట!" అన్నాడు వెంకయ్య.

"నాకు బావా ఆ సారతీగ ప్రాణాన్ని నిలువునా ఎట్లా తీసిందో!" అన్నాడు కిష్టయ్యపంతులు సారతీగ వేపు దిగులుగా వేలు పెట్టి చూపిస్తూ.

"అరెరెరె యెంతపని జరిగిందీ! నిక్షేపమంటి సారతీగను కాస్తా పాడైన పెట్టుకుందే! యిన్నాళ్ళ దీనికి మూడింది!" అన్నాడు వెంకయ్య దవడ కొరుక్కుంటూ.

"పోనీలే బావా, చూడు బర్రె దాన్నేం కొట్టకు. అది పసువు. మనలాగ దానికి విచక్షణ తెలియదు. ఏదో తొందరపడి పిలిచాను గాని అసలీ విషయం నీకు చెప్పక నేపోదును. దైవికంగా జరిగింది; ఎవరేం చేస్తారు పోనీ" అన్నాడు కిష్టయ్యపంతులు వెంకయ్య ఆవేశానికి భయపడుతూ.

"అసలయినా తినేసేదో ఆ జనపకట్టే నే తిని కూచోక యీ పనేంది? యిదిగో పంతులూ నువ్వు మంచోడివి గాబట్టి సరిపోయిందిగాని లేకపోతే యిన్నాళ్ళ తెల్లారంగానే రగడ తిగులుకునేదే! ఇంకా నయం లేచి వెళ్ళ మంచిదయింది! ఇదిగో పంతులూ మా వాములదొడ్లో సారపాదేశాను, కాయ కాయటం మొదలు పెట్టిందంటేయిగ నీ యిష్టం — యెన్ని కావాలంటే అన్ని తెచ్చుకో - తెలిసిందా?"

వెంకయ్యతో జగడం పెట్టుకోనందుకు మనసులో ధన్యవాదా లర్పించాడు కిష్టయ్యపంతులు.

మెల్లిగా నల్లి చిక్కుపడిన సారతీగ మొదలు సరిజేసి వెలిగించబడిన వేళ్ళను ఆశతో తిరిగి పాదులో పూడ్చి పాదుకు నీళ్లుపోశాడు కిష్టయ్యపంతులు.

"ఇహ యిన్నాళ్ళంతా ఆ సారతీగ మొదట్లోనే కూచుంటారా ఏమిటి ఖర్మ! వెళ్ళి ఆ పిచ్చెమ్మ దగ్గరో, పుల్లమ్మదగ్గరో, కాసిని మజ్జిగచుక్క పోయించుకు రండి" అని కిష్టయ్యపంతులు, వెంకయ్యల సంభాషణ వంటపొయ్యి అలుక్కుంటూ విన్న కోటమ్మ ఒక్కక్షణం ఆగి, కేకవేసి చెప్పింది.

"బాదమాకులు కోసినాక అట్లాగే వెళతాలే" అన్నాడు కిష్టయ్యపంతులు ఆకులు కొయ్యటానికి వెదురుగడ వెతుక్కుంటూ.

"ఇహ సరే! మనం తీరా తీరిగ్గా తరలివెళ్ళేసరికి ఆ దొరికే ఒక్కచుక్కా ఎవరో తన్నుకుపోతారు. ముందావిషయం చూడండి మళ్ళీ బడికి వేళయిందంటారు - ఇటొచ్చి సత్తెప్పాల సొమ్ముసరాంకి నెయ్యి తీరుబడి లేదు" అని చెప్పింది కోటమ్మ.

మజ్జిగ సత్తెప్పాల తీసుకుని, పొడుగ్గా కప్పుకున్న పైవుత్తరీయం కింద కనపడకుండా సదిలంగా పెట్టుకుంటూ ఆ సందులోంచి వెళుతున్న కిష్టయ్య పంతులుకు చుట్ట కాల్చుకుంటూ వాములదొడ్డికి బర్రెగొడ్డును తోలుకుపోతున్న బసవయ్య యెదురైనాడు.

బసవయ్య బర్రెగొడ్డును చూసే చూడంగానే నిన్న సారతీగ కర్రను కట్టేసిన మొక్క కొంచెంసేపు గుండె దడదడా కొట్టుకున్నా కన్నులు సగం మూసుకుని సాగువుంగా వస్తున్న బసవయ్య బర్రెనూ, పక్కనే ఆ బర్రెగొడ్డును అన్యాయంగా ఆదలించుకుంటూ వస్తున్న బసవయ్యనూ చూసి మనసు మెత్తపడిపోయిన కిష్టయ్యపంతులు వెంటనే బసవయ్యను పలకరించాడు.

"ఏం బసవయ్యన్నా బాగున్నావా? యీ మధ్య కనిపించి చాలారోజులయిందే? పెద్దవాడివైపోతున్నా పెద్దతనం వస్తుంటేను నీకు" అన్నాడు కిష్టయ్యపంతులు క్షణంకిందటి ఘటన హరించుకున్నట్టు.

"ఇప్పట్నుంచి పెద్దతనం వచ్చిందని చెప్పాకుంటే పట్టపగలే మా కళ్ళకు సంతలు కట్టరూ మీ బామ్మలంతా చేరీ—ఇహ్హి—ఇహ్హి—" అంటూ మట్టి పొగతో పాటు పెద్దతనంగా నవ్వాడు బసవయ్య.

"నీ కొడుకు నిన్ను సాంగదీసి గుద్దుతున్నా యింకా నీకు పులుపు తగ్గలేదే బసవయ్యన్నా. ఇహీ హిహిహీ!" అంటూ అమాయకంగా బసవయ్యతో వంత గలిపినవ్వాడు కిష్టయ్యపంతులు.

"మరి అట్లాంటి చదువు చెపితిరి వాడికి. ఇక వాడు నామాట వింటాడెంటయ్యా పంతులూ? యేదో ఆ చేత్తోనే వాడికో అనుగూణుర్ని తగిలిస్తివా పెళ్ళికి నీకింత పప్పుబువ్వ పెడ్తా." అన్నాడు బసవయ్య కిష్టయ్యపంతుల్ని ఆప్యాయంగా చూస్తూ.

"ఒక్క పప్పుబువ్వతోనే పోనిస్తావా నిన్ను బసవయ్యన్నా! తథాస్తు! శీఘ్రమేవ కల్యాణప్రాప్తిరస్తు! అయితే మీ బర్రెగొడ్డు ఎప్పుడూ యీనుతుంది బసవయ్యన్నా?-అన్నట్టు చూశావా బసవయ్యన్నా, రాత్రి వెంకయ్యబావ బర్రెగొడ్డు వొచ్చి మా సారతీగను యెట్లా ధ్వంసం చేసిపోయిందో! నాలుగు సారపిందెలు పడితే యీ బీదపంతులుకు యెంతో ఉపయోగమో చూడు బసవయ్యన్నా?" అన్నాడు కిష్టయ్యపంతులు మరుక్షణంలో కుంగిపోతూ. "అరెరెరె!

తెల్లవారంగానే ఎంత పనయిందీ! ఇవన్నీ దైవికంగా జరిగేవి కిష్టయ్యపంతులూ! యీ విషయాల్లో యెవర్నీ మనం ఏమీ అనలేం" అన్నాడు బసవయ్య.

"కాదా మరి బసవయ్యన్నా! ముందు కోపంతో ఒళ్లు గిహించుకుపోయింది కాని చివరికి వెంకయ్య బావతో పల్లెత్తుమాట అన్నానా? అది నోరులేని పసువు! ఇంతకీ నా అదృష్టం ఆ విధంగా వుంది. ఇదిగో బసవయ్యన్నా పొద్దున్నే నిన్నడగటం ధర్మం కాదు గాని నోరుచేసుకు అడుగుతున్నా; ఒక రూపాయి బదులుంటే సర్దుతావా, జీతం అందగానే తీర్చుకుంటా." అన్నాడు కిష్టయ్య పంతులు.

"రూపాయే! రూపాయి కాదు గదా యింటో ఒక్క ఎర్రని ఏగాని లేదంటే నమ్ము పంతులూ! నిన్న మా బావమరిదికి అరిజంటుగా వుత్తరం రాయించాలని ముక్కాణీకోసం వూరంతా తిరిగా. ఇదిగో పంతులూ ఆ లెక్కకొస్తే మా రైతులకంటే మీ పంతుళ్లే యెయ్యిరెట్లునయం! నీకు నెల తిరిగేసరికి పాతిక రూపాయలంటూ కంటికి కనిపిస్తాయ్. మరి మా యవారం పంటలొచ్చిన మూణ్ణాల ముచ్చటేగా!" అన్నాడు బసవయ్య.

"ఆ, ఇహ నన్నుజూసి నువ్వూ, నిన్నుజూసి నేనూ ముచ్చటపడాల్సిందే! నిజం చెబుతున్నాను బసవయ్యన్నా, నాలుగు నెలలనుంచి జీతాలు లేవు- మరి పైన ఆ భగవంతుడే వున్నాడు! పాతిక రూపాయల నా కుటుంబస్థితికి యెంతకావాలి బసవయ్యన్నా? పోనీ యీసారి మీ బర్రెగొడ్డుయీనే యీ పంతులుకు యింత మజ్జిగ చుక్కన్నాపోస్తావా? యిహ యీసారి నిన్ను ఒదలేదు లేదు." అన్నాడ కిష్టయ్యపంతులు.

"ఒకచుక్క గాకపోతే రెండుచుక్కలు పోయించుకుపో. నిన్ననే యెవరు-అగెరె బర్రెగొడ్డేది? చూశావంటయ్యా పంతులూ ఓ తెంప నీ సొంతీగ తెగిందంటుంటెవి, దీన్ని కాస్తా వొదిలేసి కూసుంటెని —ఎవరింటి మీదన్నా పడిలేదు గదా—వస్తా కిష్టయ్యపంతులు-" అంటూ గబగబ వెళ్లిపోయాడు బసవయ్య.

నిజానికి ఉదయంపూట ప్రాథమిక బడిపంతులైన కిష్టయ్యపంతులుకు యీ విధంగా సందులు గొందుల్లో కనపడ్డవారితోనల్లా తన కష్టసుఖాలు చెప్పుకుంటానికి తన వుద్యోగం ఒప్పుకోదు. ఉదయం ఏడున్నర గంటలకే బడిలో గీగామంటుంటే పిల్లలకు పాఠాలు ప్రారంభించవలసినవాడు సందుగొందుల్లో కాలయాపన జేస్తే వుద్యోగానికి ముప్పురావటం అటావుంచి క్రమశిక్షణతో నడుస్తున్న బడిలో చదువుకోవలసిన పిల్లకాయలు గోతులుతవ్వి గోలీకాయ లాడుకుంటూ జుట్టూ జుట్టూ పట్టుకుని ఒళ్లంతా పీక్కుని రక్తం కాలవలు కట్టిస్తారు.

అయితే యిరవయ్యేళ్లపాటుగా తనకి దక్కే జీతంచెబ్బులిన్నీ పవిత్రంగా ఎంచుకుంటున్న కిష్టయ్య పంతులు తన వుద్యోగం విషయంలో నిర్లక్ష్యంగా వుంటానికెందుకు వీలేలేదు.

అందుకే బసవయ్యతో పదినిమిషాలు ఖర్చయిందనే గాభరాతో మజ్జిగ సత్తెప్పాలను గుర్తుకుంచుకుంటూ గబగబ సందులుపడి దాటేసరికి కాళ్ళకు కిర్రుచెప్పులు, చంకలో చేతికర్ర, రెండు చేతుల్తో పొగాకు పాయ చుట్టకుంటూ వొస్తున్న రత్తయ్య మీద పడ్డంత పనయింది కిష్టయ్యపంతులుకు.

"ఏంపంతులూ యవారం మా జోరుమీదున్నట్టే, యేంది కత?" అన్నాడు రత్తయ్య చుట్టినచుట్ట ఒక పంటితో కొరుకుతూ, ఒకంటితో కిష్టయ్య పంతుల్ని చూస్తూ.

"నువ్వా రత్తయ్యతమ్ముడూ! యింకా నయం. పుణ్యానికి నీమీద పడితిని కాదు! యెన్ని పనులున్నా తెల్లవారేసరికి మాకీబడి తొందర తప్పనే తప్పదుగదా! బాగున్నావా రత్తయ్యా! మీకు పొలంపన్లతోనూ మాకు బడితోను సరిపోతుంది. పొద్దుం చేసుకుంటానికి కొస్త మంచిపొగాకు చూచిపెడతానంటివి, యేం. మళ్ళీ మనం జతపడ్డానే లేదుగా!" అన్నాడు కిష్టయ్య పంతులు ఒక్కక్షణం ఆగిపోదామనుకుంటూ.

"పుగాకు సంగతి ఆనక సూద్దాంగానీ, నువ్వు బళ్ళో పిల్లకాయలకు పాటాలు సరీగా చెబుతుండావంటయ్యా పంతులూ?" అన్నాడు రత్తయ్య.

"అదేమిటి రత్తయ్యా యివాళ వింతగా మాట్లాడుతున్నావూ! బళ్ళో పిల్లలకు మేము పాఠాలు సరీగా చెప్పకపోతే రోజూ బడికెందుకు వెళ్లటం, దండెక్కు గాకపోతే! ఏమైనా ఆ దండెగమారి పన్లు యింతవరకు మా వల్ల నవటంలేదు రత్తయ్యా." అన్నాడు కిష్టయ్య పంతులు రత్తయ్యతోటి సంజేహిస్తూ.

"అయిసయమేందో మీ పంతుళ్ళకు తెలవాల్సిందే గాని, అయితే మొన్న మా పిల్లకాయ లచ్చిన్నారా

...ష్ని కొట్టావంటచేనికయ్యా పంతులూ? మరదంతా పాఠాలు చెప్పటమేనంటావా?" అన్నాడు రత్తయ్య.

"ఎవరు—లక్ష్మీనారాయణ్ణా! జ్ఞాపకం రావటం లేదే! అథవా రెండు వేసేవుంటా ననుకుందాం, దానికి నువ్వింత పనిగా బెట్టుకుని నిలబెట్టి అడగాలా రత్తయ్య తమ్ముడూ? పిల్లలు బళ్లో కొంటెపనులుచేసీ, పాఠాలు సరీగా చదవక, యెనోన్ని అవస్థలు పెడుతుంటే వాళ్ళను మా విధిగా భావించి దారిన పెట్టేందుకు రెండుదెబ్బలు వేసినా తప్పకింద తీసుకోకూడదు రత్తయ్యా. మీ పిల్లవాడేమిటి అందరు పిల్లలూ మా కొకటే. వాళ్ళు చక్కగా చదువుకుని పెద్దవాళ్లై ప్రయోజకులైతే మా శ్రమఫలితం దక్కుతుంది. ఆమాటకొస్తే మీ తమ్ముడు సుబ్బయ్య నాదగ్గర చదువుకు నేప్పుడు యెన్ని దెబ్బలు తినలేదూ?" అన్నాడు కిష్టయ్యపంతులు.

"కొడితేమటుకు బర్రెగొడ్డును కొట్టి నట్టు అంతలావు దెబ్బంటయ్యా కొట్టటం?" అన్నాడు రత్తయ్య.

"శివశివ! మరీ అంత అపవాదు నెత్తిన వెయ్యబోకు రత్తయ్య తమ్ముడూ! బళ్ళో వున్నంతసేపూ నీ పిల్లవాడు నా పిల్లవాడే. ఆ మాటకొస్తే ...న్నో మెత్తగా దెబ్బవేసి వూరుకుంటానా తప్పజేసే? యిరవ... నుంచి యీ ఉద్యోగం అఘోరిస్తున్నాను, పిల్లల మనస్తత్వం గురించి నా కివ్వాళ కొత్తా రత్తయ్యా?" అన్నాడు కిష్టయ్యపంతులు.

"కాదని నే ననుగాని యెందుకైనా మంచిది కొత్తె కనిపెట్టి పోవయ్యోవ్ పంతులూ, అనక యవారం చెడుద్ది. యెళ్లొస్తా— కొత్తె బద్రం—" అంటూ చుట్ట ముట్టించుకుని కిర్రుచెప్పులు విరగదొక్కుకుంటూ యెటుగానో వెళ్ళిపోయాడు రత్తయ్య.

'శివ శివ! తెల్లవారే యెంతమాటన్నాడు యీ రత్తయ్య!' అనుకుని విచారిస్తూ అప్పుడే పిల్లలు బడికి పోవటం మాసిత త్తరపడుతూ మజ్జిగ సత్తెప్పాలతో పుల్లమ్మ యింటివేపుకు గబగబ యింకో పదడుగులు వేసేసరికి బడిపిల్లలు సీతారాముడు, రత్తయ్య కొడుకు లక్ష్మీనారాయణ, యెదురైనారు కిష్టయ్య పంతులికి.

"మేం బడికిపోతున్నాం పంతులు గారూ!" అన్నాడు ఆరోజు బడికి పెందరాడే బయలుదేరిన సీతారాముడు దస్త్రం సుకుంటూ.

"ఇయాల మీరు బడికొస్తారండీ పంతులూరూ?" అన్నాడు లక్ష్మీనారాయణ కిష్టయ్య పంతుల్ని కొంచెం ఓరగా చూస్తూ.

"రాత్రి పాఠాలు బాగా చదివావా లక్ష్మీనారాయణా?" అనడిగాడు కిష్టయ్యపంతులు లక్ష్మీనారాయణ్ణి ఒక వింతవస్తువుని చూస్తున్నట్టు చూస్తూ.

"సదివానండీ పంతులూరూ" అన్నాడు లక్ష్మీనారాయణ తడుముకోకుండా.

...నారాయణా?" అనడిగాడు కిష్టయ్యపంతులు తడుముకుంటూ.

"మొన్నెప్పుడండి పంతులుగారూ? గాపకం రావటం లేదండీ!" అన్నాడు లక్ష్మీనారాయణ.

"దెబ్బ బాగా తగిలిందా లక్ష్మీనారాయణా?" అన్నాడు కిష్టయ్య పంతులు.

"అబ్బే యేం లేదండీ పంతులూరూ!" అన్నాడు లక్ష్మీనారాయణ అమాయికంగా.

"ఏం కిష్టయ్య పంతులుగారూ యింకా యిక్కడే వున్నారు. యివాళ బడికి శెలవు పెట్టేరా?" అనడిగాడు బడికి పోతున్న తోటి పంతులు రామయ్య.

"ఆఁ - ఆఁ - లేదే - ఏదీ - వస్తున్నా ఇప్పుడే వస్తున్నా నీ వెనకనే—" అంటూ బడికి తయారైన రామయ్యను నిర్ఘాంతపోయి చూస్తూ మజ్జిగ సత్తెప్పాల కనపడకుండా వుత్తరీయం చాటున భద్రంగా దాచుకుంటూ దాదాపు పుల్లమ్మింటికి పరుగెత్తాడు కిష్టయ్య పంతులు.

"పుల్లమ్మక్కయ్యా-ఓపుల్లమ్మక్కయ్యా, ఎక్కడున్నా? ఒక్కచుక్క మజ్జిగ పొయ్యవూ బడికి వెళ్లిపోయిందీ?" అంటూ పుల్లమ్మింటికిచేరిన కిష్టయ్య పంతులు హడావిడిగా పిలిచాడు పుల్లమ్మను.

"ఎవరూ?. మీరండీ కిష్టయ్యపంతులు గారూ, యెవరా అనుకున్నా! అయ్యొ నే నేంచేతును పంతులుగారూ! తెల్లారంగా నే ఆ రామయ్యపంతులొచ్చి ఆ ఒక్కచుక్క కొస్తా పోయించుకు పొయ్యాడే!" అంది పుల్లమ్మ యిల్లలుకుతున్న అలుగ్గుడ్డతో వచ్చిఅట్టాగే నోరు తెరుచుకు నుంచుంటూ.

"ఎంతపనిచేశావ్ పుల్లమ్మతల్లీ! నిన్న అంతగా మరీమరీ చెప్పిపోతిని మరింతేనా నువ్వుచేసింది!" అన్నాడు ఒక్కసారిగా నిలువునా స్తంభించిపోయిన కిష్టయ్యపంతులు

"అయ్యో యేం సెయమంటారు పంతులు గారూ, నెపితికివుండదీ! ఏం వుంటే ఏం సారదకం! ఆ రామయ్యపంతులొచ్చి పోస్తేగాని కుదరదంటూ పల్లకన్నం కాడే కూకునె! దబ్బుసెల్లి ఆ పిచ్చెమ్మ సన్నినన్నా అడెగండి. కూసిని పొయ్యనన్నా పోసుద్ది"అంది పుల్లమ్మ.

"పోస్తే అదృష్టవంతుణ్ణే! కాని నాకీ అదృష్టం రోజూ వుండవలసిందేగా పుల్లమ్మక్కా! ఎవరికైనా యేదో ఒకరోజైతే పరవాలేదు; రోజూవచ్చి సొంత సొమ్ము లేపోయినందుకు పోతుంటే నిజానికి పోసేవారికి కొంతకష్టంగా వుంటుంది పుల్లమ్మక్కా! ఏదో యీ బీదపంతులంటే కనికరంతో విసుగు లేకుండా నువ్వే కాసినో ముక్కలు పోస్తుంటావు; పోనీ అదే పది వేలు — తెల్లవారే ఎంత న్యాయం జరిగిందో చూశావా పుల్లమ్మక్కా! ఆ వెంకయ్యబావ బర్రె గొడ్డు కాస్తా చక్కని మా సారతీగను ఎంత సర్వ నాశనం చేసిందో చూశావా పుల్లమ్మక్కా! ఇంక నా రమో పదిరోజులలో పిందె వయ్యటానికి సిద్ధంగా వుంది! అవిధంగావుంది నా అదృష్టం పుల్లమ్మక్కా!" అన్నాడు కిష్టయ్య పంతులు సారతీగను స్మరిస్తూ.

"ఎంతన్యాయం జరిగింది పంతులు గారూ! దాని మొగుళ్ళారా, ఆ బర్రెగొడ్డు పడక పడక మీ యింటిమీనే పడాలా?" అంది పుల్లమ్మ సానుభూతితో.

"ఆ తారతమ్యం పశువులకు తెలుస్తుందా, నాకు జరగవలసిందేదో జరిగి పోయింది గాని!— అరెరెరె యివ్వాళ యింక నేను బడికేం పోతాను!— పోస్తా పుల్లమ్మక్కా - రేపన్నా కాస్త చల్లచుక్క వుంచు నీకు పుణ్యంవుంటుంది - అన్నట్టు వెంకయ్యబావేడీ కనిపించడూ?" అన్నాడు కిష్టయ్యపంతులు వెళ్ళిపోయేవాడు కాస్తా యేదో పీకినట్టు నిలబడిపోతూ.

"తెల్లగా తెల్లారకతలికే పొలం యెళ్ళాడుగా! అయినా ఆయనకి కూసేపు యింటి కాడుంటే యేందో పురుగు తొలుస్తానే వుంటది!"అంది పుల్లమ్మ వెంటనే మొగుడు వెంకటాద్రిని తలుచుకుంటూ.

"చివరికి వెంకటాద్రి బావను నమ్ముకొన్నేయింటో లేకుండానే పోయినానే! - సరేవస్తా - ఆఁ, ఏం లేదు పుల్లమ్మక్కా - ఒకరూపాయుంటే బదులిస్తాడేమో అడుగుదామనుకున్నా - ఇంటో చాలా యిబ్బందిగా వుంది - ఏదీ మరిప్పుడే కనపడకుండా పోయెనుగా! - ఏదో అడగలేక అడుగుతున్నా యేమీ అనుకోకు పుల్లమ్మక్కా! బావ నీదగ్గర వచ్చేమీ వుంచడుగా?" అన్నాడు కిష్టయ్యపంతులు తలెత్తకుండా.

"అయ్యో పంతులుగారూ మీ బావ సంగతి యింకా మీకు తెలవకనే పాయెనే -" అంటున్నది పుల్లమ్మ దిగులుగా—

"అబ్బే నాకు తెలియకగాదుగాని ఏదో అడిగాలే పోనీ పుల్లమ్మక్కా - ఏం అనుకోబోకు - వెంకటాద్రి బావొస్తే చెప్పు వచ్చిపోయినానని. వస్తా పుల్లమ్మక్కా - అరెరెరె! బడికంట కొడుతున్నారే." అంటూ గెలుబందికోసం తహతహ పడిపోయిన నాడిరాదిరికం గాగుపడుతూ ఖాళీ మజ్జిగ సత్తెప్పాలతో గబగబా ఆ సందులు గొందుల్లో పమాయమైనాడు కిష్టయ్యపంతులు.

తన ... హెడ్మాస్టరు ... చేస్తుంటాడు — ... తమను లేనిరెండు ... సైనా సరే తరగతిలో వాళ్లు ... వాళ్లు ఒకళ్లనొకళ్లు పీక్కు ... కొట్టుకుంటూ ... పెడుతుండే హెడ్మాస్టరు సృష్టించిన పడుతుంది తను వచ్చేసరికి హెడ్మాస్టరు జేబుగడియారం నిమిషాలు లెక్కపెట్టుకుంటూ తన తరగతి గుమ్మం దగ్గర నుంచుని తనకోసం చురచురా చూస్తుంటాడు. తన ప్రవర్తనగురించి ఖచ్చితంగా నిగ్గదీసి అడుగుతాడు - తనకు పగువుగా వుద్యోగకాలం ముగించుకునే యోగ్యత లేదు - తనను వుద్యోగంలోంచి గెంటవేస్తే ట్రైనింగు ప్యాసైన ముత్యాలాంటి పడుచువాళ్లు వందలు, వేలకొద్దీ నిమిషాలమీద వొచ్చి వాలుతారు- అసలే తనది పాతకాలపు ట్రైనింగు అనుకుంటూ యమపాశంతో వుచ్చు బిగిసినవాడి మాదిరి దల్లగా బడిలో తన తరగతిలో ప్రవేశించాడు కిష్టయ్య పంతులు.

తరగతిలోని పిల్లలంతా నిశ్శబ్దంగానూ, భయభక్తులతోనూ కిష్టయ్యపంతులువైపు చూశారు.

ఆ పిల్లల మొహాలు యెంతో అందంగావున్నయ్! ఆపిల్లలు తన విద్యార్థులు! వాళ్లకు తనవిద్య, తన శ్రమ, శక్తి, తనజీవితం అంకితమైందనుకున్నాడు కిష్టయ్య పంతులు ఆనాటి పాఠాలు ప్రారంభిస్తూ.

# మధురతంజావూరు నాయకరాజులనాటి ఆంధ్రవాఙ్మయము

శ్రీ నేలటూరు వేంకటరమణయ్య

## పుదుకోట సాహిత్యము

పుదుకోట ఆంధ్రనాయక రాజ్యము కాదు. పుదుకోట రాజులు శుద్ధ ద్రావిడులు, మరవకళ్లరు జాతులలో నొక జాతికి జెందినవారని చరిత్రకారుల యభిప్రాయము. ఈ శుద్ధద్రావిడ ప్రభువుల కాంధ్రభాషపై నభిమానము గల్గుటయు నందు వారు గ్రంథ రచన సేయుటయు వింత. క్రీ. శ. 1682 నుండి 1730 వఱకును పుదుకోట సంస్థానము నేలిన మొదటి రఘునాథుని కాలమునుండియు నాంధ్రభారతి కది తావలమై యుండెనని తోచుచున్నది. ఈతనిపై నాంధ్రకవులు రచించిన చాటువులు పెక్కు గానవచ్చుచున్నవి. ఇతని తమ్ముని కుమారుడైన రామస్వామిన్నపాలుని నాయకునిజేసి యుద్దం[illegible] వి[illegible]కుడైన శేషయార్యుడు శృం[illegible] దండకమును రచించెను. మఱియు నీ మొదటి రఘునాథరాజు పుత్రుడైన తిరుమల రాయడును నతని పుత్రుడగు రాజగోపాలుడును నాంధ్రకవుల నాదరించి వారిచే నుతింపబడిరి. క్రీ. శ 1730 మొదలు 1769 వఱకు రాజ్యమొనర్చిన విజయరఘునాథుడు సుప్రసిద్ధుడు. ఇతని యాస్థానమున నుదురుపాటి కవులు, ఉద్దండకవి సీతారామార్యుడును నతని పుత్రుడగు వెంకనయు వెలసిరి. వెంకన తాను రచించిన యాంధ్రభాషార్ణవమను నిఘంటువును విజయరఘునాథుని కంకితము గావించెను. ఈ రఘునాథుని పుత్రుడు, క్రీ. శ 1769-89 ల మధ్య ప్రజాపాలన మొనర్చిన రాయ రఘునాథ తొండమా నాంధ్ర కవియై వాసికెక్కెను. ఇతడు తానుద్దండకవి విధేయుడనని చెప్పుకొనియున్నాడు. ఈ యుద్దండకవి నుదురుపాటి వెంకన్న తండ్రియగు "మహోద్దండకవి" బిరుద ప్రశస్తుడైన సీతారామార్యుండే కాని యన్యుడు గాడు. కావున కొచ్చెర్లకోట వెంకటకృష్ణారావుగా రూహించినట్లు రాయ రఘునాథుడు సీతారామార్యుని శిష్యుడును, నతని పుత్రుడగు వెంకనార్యునికి సమవయస్కుడును సహాధ్యాయుడునై యుండవచ్చును. రాయ రఘునాథు డుద్దండకవికి పేరు తెచ్చిన శిష్యుడు. ఇతడు మహా విద్వాంసుడై కవితా ప్రావీణ్యాతిశయముచే వన్నెకెక్కెను. రాయరఘునాథుడు తాను, "వాత్స్యాయనాది వేద వేదాంత పర్యంత నిఖిల తంత్ర నిర్మిత గ్రంథ సచ్ఛిక్షణ విదిత మహాకవి ప్రబంధ నూతన [illegible]కరణ సామర్థ్య నిరంకుశ ప్రతిభా విభాసురు"డనని తన వైదుష్యమును బలమును ప్రకటించుకొన్నాడు. అంతటివాడగు నేమో చెప్పజాలము గాని యితడు రచించిన పార్వతీ పరిణయమునుబట్టి యతని కవితా నైపుణ్య మసాధారణమైనదని చెప్పక తప్పదు.

పార్వతీ పరిణయ కృతిని గూర్చిన యైతిహ్య మొకటి గలదు. నుదురుపాటి వెంకన్న ఈ గ్రంథమును రచియించి రాజు పేర ప్రకటించెనని ప్రతీతి. పార్వతీ పరిణయ కవిత్వమాంధ్ర భాషార్ణవము యొక్క కవిత్వము వంటిదే. కాని పార్వతీ పరిణయములోని దుష్ప్రయోగముల నాధారపఱచుకొని యది వెంకనార్యుని రచన కాదనియు రాయ రఘునాథకృతమే యనియు కొచ్చెర్లకోట వేంకటకృష్ణరావుగారు వాదించుచున్నారు. వ్యాకరణ విరుద్ధప్రయోగములనుబట్టి గ్రంథకర్తృత్వమును నిర్ణయించుటకు వీలు కాదు. కృష్ణరావుగారు చూపు దుష్ప్రయోగములన్నియు నాయక యుగవాఙ్మయమున సామాన్యముగ గానవచ్చునవే. వెంకనార్యుం డట్టి దుష్ప్రయోగములజేసి యుండడనుట యతని గ్రంథములనన్నిటిని బరిశీలించి నిర్ధారింపవలసిన విషయము. కాని మనకు లభించిన సాక్ష్యము నాధారపఱచుకొని రాయ రఘునాథుండు పార్వతీపరిణయ కర్త కాడని నిశ్చయించుటకు సాధ్యము గాదు.

"ఏది యెట్లున్నను," వేంకట కృష్ణరావుగారు చెప్పినట్లు, "గ్రంథము మాత్రము లోకోత్తరములగు వర్ణనలతో నిండియున్నది." కాని, యిందలి కవితా

మాధుర్యముచే నానందపరవశులై వారు చెప్పిన, "అలంకారికులు చెప్పిన ద్రాక్షేక్షు కదళీ నారికేళాది పాకము లీరుచికి సమానమని చెప్ప వలను పడదు. శయ్య యద్భుతమైనది. అనేకాంధ్ర గ్రంథములు పుట్టిన పిమ్మటఁగూడ నిట్టి క్రొత్తకల్పనలం జేర్చినవాడితఁడొక్కడే. కొన్ని తావులను మహాకవి కాళిదాసుని కుమార సంభవములోని శ్లోకముల ననుసరించెను. ఇతనికి దెలిసినంత యౌచిత్య మితరులకు దెలియదనుట సాహసము కాదు" అను విమర్శనా వాక్యములు సంపూర్ణముగ నంగీకరించుటకు వలను పడదు.

పార్వతీపరిణయ కథను ఇతివృత్తముగ కావ్యములను రచించిన ఆంధ్ర కవి వతంసులు కొందరున్నారు. నన్నెచోడకవి కుమార సంభవమునను, శ్రీనాథుడు హరవిలాసమునను పార్వతీ పరిణయమును వర్ణించి యున్నారు. నన్నెచోడుని భావగాంభీర్యము గాని శ్రీనాథుని కవితావిలాసము గాని రాయ రఘునాథుని కావ్యమున గానరావు. అట్లనుటవలన నతని కవిత్వము సామాన్యమైన దని యెంచరాదు. తేట తెనుఁగు మాటల రసము చిప్పిల్లునట్లు గవిత్వము నమృత ధారాధరము వర్షించునట్లు చెప్పుటయం దితనికి సాటివారు లేరు.

రాయ రఘునాథుఁడు కవిజన కామధేనువు. ఇతని యాస్థానమును విద్వత్కవు లనేకు లుండిరి. వీరి యందు ముఖ్యుఁడు నుదురుపాటి వెంకన్న. కవిత్వమునం దితడు రాయ రఘునాథునికి సమానుడు. ఇతని ముద్రిత గ్రంథములలో నొకటి నిఘంటువు, మఱియొకటి రాజవంశప్రశస్తి. వీని మూలమున నతని కవితాతిశయమును వివరించుటకు సాధ్యము కాదు. ఇతని మల్లు పురాణమును రఘునాథీయమును బ్రకటితమగువఱకును సాహిత్యప్రపంచమున నితని స్థానము నిర్ణయించుటకు వీలుపడదు.

రాయ రఘునాథుని యనంతరము పుదుకోట సింహాసనము నలంకరించిన విజయ రఘునాథుడును నాంధ్రభాషాభిమానియే; స్వయము గ్రంథకర్త గాక పోయినను గవులను జేరదీసి సత్కరించి గ్రంథరచనకు బురికొల్పెను. నుదురుపాటి వెంకనార్యుని పుత్రుడగు సాంబకవి యితని సమకాలికుడే. ఇతని యాస్థాన కవులలో గోనసూరు నారాయణయ్యంగా రగ్రగణ్యుడు. ఇతడు భారద్వాజగోత్రసంభవుడు; అప్పయార్యుని మనుమడు; జియ్య వెంకటమహాచార్యుని పుత్రుడు; వీరరాఘవముని ప్రేంఖత్కృపాపాత్రుడు; శఠకోపయోగి కరుణాసంప్రాప్త సారస్వతుడు; మీదు మిక్కిలి విజయ రఘునాథునికి గురువు. రఘునాథుని యాదేశముపై భానుమిశ్రుని రసమంజరి యను శృంగార శాస్త్రగ్రంథము నాంధ్రీకరించెను. ఇతనిది సరసమైన కవిత్వము; ధారాళమైనధార; సంస్కృతపదభూయిష్ఠమైనను భావనాతికఠినమై సులభగ్రాహ్యమై మృదుమధురమై యొప్పారుచున్నది. ఇతని యాంధ్ర రసమంజరి గుడిపాటి కోదండకవి యాంధ్రీకరణమువలె నింకను నముద్రితమే. ఇవి ముద్రితమై ప్రచురములగు వఱకును వాని తారతమ్యములను నిర్ణయించుటకు గాని యెంతమట్టు యథామాతృకములో కనుగొనుటకు గాని వీలు లేదు. విజయ రఘునాథుని తమ్ముడును నతని వెనుక సింహాసనము నధిష్ఠించి క్రీ. శ. 1835 మొదలు 1839 వఱకును పుదుకోట నేలిన హిజ్ ఎక్సలెన్సీ బిరుదాంకితుడైన రఘునాథుడును నాంధ్రకవులను బోషించెనని చాటువులమూలమున విదితమగుచున్నది. ఇతనికుమారుడగు రామచంద్రుడు నుదురుపాటి వెంకన మనుమడైన చిదంబరకవినిపోషించి యతనిచే చంద్రాననా దండకమును దన పేర జెప్పించుకొనెను. ఇట్లే డెనిమిది తరములవఱకును పుదుకోట ప్రభువులు ద్రావిడదేశమునం దాంధ్రభాషను బెంపొందించి ధన్యాత్ములైరి.

## ద్విపద కావ్యము

దక్షిణదేశమున ద్విపదకావ్య రచన తంజావూరు, మధుర నాయక రాజ్యముల స్థాపనకాలముకంటె ముందె ప్రారంభమైనది. అచ్యుత రాయల యేలుబడిక్రింద క్రీ.శ. 1530 40 మధ్య మధుర ప్రాంతదేశమును బాలించిన గోల్లి బసవనాయకుని పుత్రులు పెదరామప్ప చినరామప్ప లాంధ్రసారస్వతమును ద్రావిడదేశమున నెలకొల్పినవారిలో బ్రథములనియు, వారి ప్రోత్సాహముచే బచ్చుకప్పురపు తిరువేంగళ కవి చొక్కనాథ చరిత్రను వ్రాసెననియు ముందు చెప్పియున్నాను. చొక్కనాథచరిత్ర ద్రావిడదేశమున విరచింపబడిన ప్రథమ ద్విపదకావ్యము. తిరువేంగళ కవి విద్వత్కుటుంబమునకు జెందినవాడు. విజయనగర సంస్థానమును నితని పెద్దలు వంశపారంపర్యముగ నాశ్రయించియుండిరి. "ఈతనితండ్రి తిప్పరాజు, ఈతని తాతయు జిన్నతాతయు నగు తిమ్మరాజును నయ్యలును కర్ణాటాధీశ్వరులైన ప్రౌఢరాయలచే సత్కృతులై పచ్చుకప్పురము వారని పేరందిరి." ఈ చొక్కనాథ చరిత్రయందు మధురయందు వెంచేసియుండు చొక్కనాథ—సుంద

-స్వామి లీలలు వర్ణింపబడినవి. శైలి సరళమైనది; నాతి కఠినమైన భాష. కవిత్వము ధారాశుద్ధి కలిగి చదువుట కింపుగ నుండును. కాని సామాన్యమైనది; మొదటి తరగతి ద్విపద కావ్యములలో జేరదు.

నాయక రాజ్యములు స్థాపింపబడిన పిమ్మట దాక్షిణాత్యకవులు ద్విపదను విస్తారముగ యక్షగానములందు వాడిరి; కాని కేవలము ద్విపద కావ్యములను రచించినవారి సంఖ్య చాల తక్కువ. తంజావూరి వారి దృష్టి విశేషముగ పద్యకావ్య యక్షగాన రచనలందు లగ్నమై యుండినది; మధురవారు శృంగార ప్రబంధ వచనకావ్య రచనాసక్తులై యుండిరి. కావున ద్విపద కావ్యములం దభిరుచి యాంధ్రదేశమందువలె నంత విరివిగ బెరుగలేదు; కాని ద్రావిడదేశమందు ద్విపద కావ్య రచన సంపూర్ణముగ నాగిపోయెనని యనుకొనరాదు.

తంజావూరు రఘునాథనాయకు డచ్యుతాభ్యుదయ నలచరిత్ర లను రెండు ద్విపద కావ్యములను రచియించెను. రఘునాథుడు నలచరిత్ర పీఠికయందు,

'భూషించి యచ్యుతాభ్యుదయ కావ్యంబు
నిర్మాణమున మాకు నిఖిలదేశముల
నిర్మల సత్కీర్తి నెగడు గావునను
నటువలె ద్విపద కావ్యము వేరెయొకటి
ఘటియించి సత్కీర్తి గైకొందుననుచు
*        *        *        *
కలిదోష హరణము కలితపుణ్యైక
ఫలితమైనది నలోపాఖ్యానమనుచు.'

అనినిర్వచించియున్నాడు. ఇందు అచ్యుతాభ్యుదయ మింకను లభ్యముగాలేదు. నలచరిత్ర 1928 సెప్టెంబరు మొదలుకొని 1929 ఏప్రిల్ మాస పర్యంతము కీ. శే. కావ్యనిధి చెలికాని లచ్చారావుగారిచే స్థాపితమైన యాంధ్రభాషోల్లాసిని యను సారస్వత మాసపత్రిక యందు ప్రకటింపబడెను.*

రఘునాథ నాయకుడు అచ్యుతాభ్యుదయ నల చరిత్రలను వ్రాసెనని విజయరాఘవుని రఘునాథ నాయకాభ్యుదయములోని

భువి మెచ్చ నచ్యుతాభ్యుదయ కావ్యంబు
నవరస సహితంబు నల చరిత్రంబు
హరువైన పారిజాతాపహరణంబు
మెఱవడి జూపు వాల్మీకి చరిత్ర
జానకీ కల్యాణ చాటు కావ్యంబు.

అను పంక్తులవలన దెలియవచ్చుచున్నది. ఈ పంక్తులే రఘునాథాభ్యుదయము నందును గానవచ్చుచున్నవి. సంగీత సుధయందు దీని ప్రస్తావము గలదు.

"శ్రీ పారిజాతాపహరణ ప్రబంధం
చిత్రంచ వాల్మీకి చరిత్ర కావ్యం
తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర
మోక్షం చరిత్రంచ నళస్య చిత్రం
శ్రీ రుక్మిణీ కృష్ణ వివాహ యక్ష
గానం ప్రబంధా నపినైక భేదాన్"

ఈ నలచరిత్రము ఎనిమిది యాశ్వాసముల గ్రంథము. శ్రీరామచంద్రుని కంకితము సేయబడినది. నలదమయంతుల కథ సంపూర్ణముగ నిందు వర్ణింపబడినది. పీఠికయందు కథాంశమును రఘునాథు డిట్లు సూచించియున్నాడు.

'అరసి యీ కథ తొల్లి వ్యాసమహర్షి
వరుడై యాద్యంతముల్ వ్యక్తంబుగాగ
పలికెను పిమ్మట పల్కంగలేక
యలసులైరో మెు శ్రీహర్షాదికవులు
పూర్వభాగము జెప్ప బూనిరిగాని
సర్వంబు జెప్పంగ జాలరై రెందు
పూర్వోత్తర కథాంశములు సకలంబు
నిర్వచించెదనందు నెమ్మది నేని
తలచి యిందుల కిష్ట దైవంబు కరుణ
గలుగంగవలెనందు గాంక్షింపుచుండ.'

నలచరిత్ర పూర్వోత్తర కథాంశములను వర్ణించు ద్విపదకావ్యము చక్రపురి రాఘవాచార్యకృతము మఱియొకటి కలదు; కాని రఘునాథుడు శ్రీహర్షాదు లలసులై పూర్వభాగము నే చెప్పిరిగాని సర్వమును జెప్పక విడిచిరనుటవలన నతడు రాఘవాచార్యుని కావ్యము నెఱుగడనియును, నొకవేళ రాఘవా

* ఈ గ్రంథము చిత్రాడ రామవిలాస ముద్రాశాలలో 1921 వ సంవత్సరమున ముద్రిత మాయెనని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాసియున్నారు! కాని యది సందేహాస్పదము. ఏలనగా, మొదట మాస పత్రిక సంచికలలో గొంచెము కొంచెముగ ప్రకటించి తరువాత గ్రంథము నొక్క సంపుటముజేసి ప్రచురించుట యెల్లయెడలను వాడుకయందుండు పద్ధతి. ఈ పద్ధతి నే యాంధ్రభాషోల్లాసినీ పత్రికాధిపతులును నవలంబించిరి. కావున శ్రీ వెంకటరావుగారు వ్రాసినట్లది 1921 లో ప్రకటింపబడి యుండజాలదు. 1931 లో ప్రకటితమయ్యెనేమో.

చార్యుని కృతి రఘునాథుని కర్వాచీనమైనది కావచ్చుననియు దోచుచున్నది. రఘునాథకృత నల చరిత్ర రాఘవాచార్యుల రచనకంటె రసవత్తర మైనది. కవిత్వము వాల్మీకి చరిత్ర వంటిదే. పదముల పొంకమును నుడికారపు బింకమును, వర్ణనా చమత్కారమును పాత్రపోషణ విధానమును రఘునాథుని కవిత్వమునకు వన్నె యిడుచున్నవి. వాస్తవికత యొప్పెసలార వర్ణనాంశములు కనులకు బొమ్మకట్టునట్లు మాటల చిత్తరువును జిత్రించుటయందు రఘునాథునికి జక్కని నేర్పు కలదు. నలదమయంతుల యరణ్య సంచారవర్ణన నొక యుదాహరణముగ గొనవచ్చును:—

కాంతారమున త్రోవ గనియందు నెంట
కాంతామణియు దాను కంటకంబులెండ
జడిసి యాకుల యట జలమె యాకులతి
పుడిసిట ద్రావి గొబ్బున ప్రేగులెల్ల
నొక్కటవాతికి నొడ్డగిలంగ
గ్రక్కుచు నీగొత గనుకంటె నిచట
గ్రక్కున బోయిన గడు మేలటంచు
పొక్కుచు నాకట పొదలపై బొదల
గొలమింత నేదైన నలమిడె నమలి
బలిమి గ్రమింగుచు గుండె బట్టిన నేల
కుతికెలబడి యొండొరుల చేయూత
గతిగూడుకొన లేచి కదలిపోవుచును
గ్రుక్కిపై తోలునస్థులె చిక్కి చాల
చిక్కి చక్కలములై చేరంగరాని
మైలకప్పనను జన్మమె యింక చాల
చాలుబో యనుపించు చలిబోని చీర
యొంటికట్టుల చేత నొగయుచు రొండి
యంటి చీములు గార నసపులు దూర
కంపలు జెరమై కడుదుమ్ము దేర
చెంపల నెండ్రుకల్ చెమటలు జార
దుర్భరఖేదంబు దొరయ నయ్యాది
గర్భేశ్వరులు మహా గహన మధ్యమున
నట యొకచోట పాయక ప్రొద్దు గ్రుంకి
నటువలె నిపుడు గాఢాంధకారములు
మూగపార్శ్వని కుంభముల మూకసమితి
మూగ దయ్యములన మూల్గుచునుండ
చుట్టుపట్టులు మానుసులు వచ్చినట్లు
చెట్టులు గనుపింప చేరి వీక్షించి
మతియును మిట్టాడ మానిసి లేక
పలిచి తూరుపుబోయ పల్లెలనుండి
కలిచి తెచ్చిన యెముకలు పచ్చితోలు
తలచుగా పంత గద్దలు క్రిందనైన
కడుకొని చీకటిగలు చాల ముసరి
వడిలేచి ఝుమ్మని వలగొని తిరుగ
యొడనెగ పెనుపుట్ట నెపలిన చీమ
లపెరగాగెను నెంట లప్పట్టుపట్టిక (?)
వచ్చి పంచితలి గోవంగ నచ్చోట (?)
పుచ్చి పచ్చనితోక పురుగులు నపెలి
లులలుల మనుచు తొల్చుచు నుండెనందు
బొలసిన గసురు కంపునకు పైదోము
గమియుప్పతిలి యొల్ల కడలను గప్ప
జోమ జోమన నెల్లచోటుల చక్క
పిడుగులు పుగావులు బెట్టినట్టట్టు
గడుగురీగలు వారగాలి గొట్టి లకు
కడకు కొంతటజారి కామించి పూరి
యొడనెడ వేలంగ నెడపక ఘుమ్మ
దూలముల్ నుసిరాల గునిసి వాసములు
వ్రాలి ప్రీలగ వారి వదలిన పాము
గోడలపై పాము కుబుసంబులాడ
చూడంగ గోత వచ్చుచునుండు నొక్క
రచ్చకొట్టము గాంచి రమణియు దాను.

విజయరాఘవుండు రెండు ద్విపదకావ్యముల రచించినట్లు తంజావూరు సరస్వతీ మహాలు పుస్తకభాండాగార తెలుగు లిఖిత గ్రంథ పట్టికవల్ల దెలియుచున్నది. అందు పాదుకాసహస్రమొక్కటి. ప్రహ్లాద చరిత్ర పీఠికలో

"ఘనతరంబగు పాదుకా సహస్రంబెల్ల ద్విపద జేయు కళావతీత నూజ" అని చెప్పుకొని యున్నాడు. కాని పై ద్విపదకావ్యము ఇప్పుడలభ్యము. రెండవదియగు రఘునాథ నాయకాభ్యుదయ మిటీవల ముద్రింపబడియె. ఇది మూడాశ్వాసముల గ్రంథము; విజయరాఘవుని తండ్రియగు రఘునాథుని రాజ్యవైభవ మిందు వర్ణింపబడినది. రాజధానియగు తంజాపురమును, రాచనగరునందలి దైనందిన జీవన విధానమును జక్కగా వివరింపబడినది. రఘునాథ నాయకు డొకనాడు వాహ్యాళికి బోగా వారకాంత యొకతె యతని గని వలచి దన కోర్కెను నెఱవేర్పుమని వేడుచు పెంపుడు చిలుకచే వర్తమాన మంపెను. దాని వేడికోలంగీకరించి రఘునాథుడా రాత్రి యా వేశ్య మందిరమునకుబోయి దానిగూడెను. ఇది యీ ద్విపదకావ్యమందలి ఇతివృత్తము. చరిత్రాత్మక మగుటచే నిందు కథాకల్పన కవకాశము లేదు. రఘునాథుని వాహ్యాళి సమయమున గాంచి

మోహించిన వారకాంత చిత్రరేఖయు చారిత్రక వ్యక్తి యగునేమో. కల్పితమైనను దాని కథయందు క్రొత్తదన మేమియు లేదు. పోతనగారి కాలమునుండియు నీ రకమైన కథ యాంధ్రలోకమునకు బరిచితమైనదే. మఱియు ద్రావిడ వాఙ్మయమున వాడుకయందుండు "ఉలా" కూడ నిట్టిదే. కావున విజయరాఘవుని కథాసంవిధానమున నవ్యత యేమియు గానరాదు. ఇతని ద్విపద రచన చక్కనిదే. సోమశేఖర శర్మగారు చెప్పినట్లు "యథోచితములైన వర్ణన విశేషములతో వీనులకు విందు గొల్పుచుండును. కుంటుగంటులు లేని ధారాళమైన మృదుమధురశైలి విజయరాఘవునిది; భావోద్వేగమున బదముల లలితమైన కూర్పులోబడి ప్రతిచరణము నర్థ మాకలు లేక పరువులు వారుచుండును"; కాని విజయరాఘవునిది యత్యుత్తమ జాతి ద్విపద గాదు. రంగనాథ సోమ తిరువెంగళనాథాదుల ద్విపద కితనిది సరిపోలదు. కాని చారిత్రకదృష్టిని పరిశీలించిన రఘునాథ నాయకాభ్యుదయము మిక్కిలి యుత్కృష్ట రచన యని చెప్పక తప్పదు. విజయరాఘవుడు నాయకరాజుల కాలమున దంజావూరు సంస్థానమున వాడుకయందుండిన నగరి మర్యాదలను, రాజకీయ, సాంఘిక విషయములను, సంగీత వాద్య నాట్య విద్యావిశేషములను, జక్కగ జిత్రించి యున్నాడు. కావున రఘునాథ నాయకాభ్యుదయమును దీని కనుబంధమని చెప్పదగిన రఘునాథాభ్యుదయ నాటకమును నాయకయుగ చరిత్ర రచన కత్యంతోపయుక్తములైన యమూల్య మూలాధార గ్రంథములు. ఇవి రెండును గాక విజయరాఘవుడు మోహినీవిలాసమను ద్విపద కావ్యమును రచియించె నని శ్రీనిడదవోలు వెంకటరావుగారు చెప్పుచున్నారు. తమ వాక్యమున కాధారముగ ప్రహ్లాదచరిత్రపీఠికలోని, "ఆలమోహినీ విలాసాఖ్య ద్విపదకృతి నాటకం బొనరించు నలసమాన" యను సీసపాదము నుదాహరించిరి. ఇది పొరపాటు. విజయ రాఘవకృత మోహినీవిలాసము నాటకము గాని ద్విపదకావ్యము గాదు. ఎవ్వరో రచించియుండిన ద్విపదకావ్యము నతడు నాటకమొనర్చినాడు. అంతియ. అతడు మొదట దానిని ద్విపదగ రచించి తరువాత నాటకము జేసియుండరాదా? యను ప్రశ్న మొకటి రావచ్చును; కాని యట్టి సందర్భములందు నాటకమునకును ద్విపదకును దానే కర్తనని విజయరాఘవుడు స్పష్టముగ జెప్పుచున్నాడు. "ధర రఘునాథాభ్యుదయము నాటకముగా, ద్విపదగా రచియించు ధీరవర్య" యని. మోహినీ విలాసవిషయమున నిట్లు చెప్పక 'మోహినీ విలాసాఖ్య ద్విపద కృతి నాటకం బొనరించితి'నని వచించియుండుటవలన మోహినీ విలాస ద్విపద యతడు రచించినది కాదని తెలియుచున్నది.

ఇవిగాక విజయరాఘవుడు దన కవితా సామర్థ్యమును దెల్పుచు:—

"కేళిమై గోపికాగీతలు భ్రమర
గీతలు తెనుంగించు సద్యతన భోజ
సరిలేని ఫాల్గుణోత్సవమెల్ల
రగడచౌపదములొనర్చిన భవ్యచరిత
ధర రాజగోపాల దండక సందర్భ
వైదర్భిగన్న విద్వత్కవీంద్ర
సారమౌ వీర శృంగార సాంగత్యంబు
మెఱయించు రసికుల మేలుబంతి
సంపంగిమన్నారు సాంగత్యమునమర్చి
జగతి మెచ్చిన తెఱజాణరాయ"

యని తాను సంఘటించిన కావ్యవిశేషములను వివరించినాడు. అతడు తెన్గించిన గోపికాగీతలును భ్రమర గీతలును ద్విపదలో పద్యరచనలో నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. ఫాల్గుణోత్సవమును గోపాల దండకమును రగడ చౌపద దండక రచనలందతనికి గల నేర్పును వెల్లడి సేయుచున్నవి. అన్నిటికంటె వీర శృంగార సాంగత్యమును, సంపంగిమన్నారు సాంగత్యమును ముఖ్యమైనవి. ఇవి రెండును కర్ణాటక సాంగత్య ఛందమున వ్రాయబడిన యాంధ్ర ప్రబంధములు. కర్ణాటక ఛందోరీతుల ననుసరించి గ్రంథ రచన జేసిన కవి యితడొక్కడే. ఈ సాంగత్య కావ్యములు రెండును నామమాత్రావశిష్టములై పోవుట కడు శోచనీయము.

సుప్రసిద్ధ లక్షణకవియగు గణపవరపు వేంకటపతికవి తాను "బాల రామాయణ ద్విపద"ను పొసగించినట్లు ప్రబంధ రాజవేంకటేశ్వర విజయ విలాస పీఠికయందు జెప్పియున్నాడు. ఇది నష్టమై పోయినది.

ఈకాలమున ద్విపద భారతము, కట్టా ద్విపద రామాయణము మున్నగు పెక్కు ద్విపద కావ్యములు వెలువడినవి. కాని యా గ్రంథములకు నాయక రాజులతో నెట్టి సంబంధ ముండినట్లగపడదు. కావున యా ద్విపదకావ్యముల నిట ప్రస్తావించవలసిన యావశ్యకత లేదు.

## వచన కావ్యములు

ఆంధ్రభాషయందు వచన రచన గడు ప్రాచీనమైనది. పద్యమునకంటె వచనమే ముందు పుట్టినది. క్రీ. శ. 7 వ శతాబ్దమునుండియు వచనము వ్యవహారమందుండెనని శాసనములు సాక్ష్యము బలుకుచున్నవి. "శ్రీ పోలి మహారాజు ల్లోళన ఇన్నులోలి అణపోతుల రేవణకాలు పుద్దనకాలు ఇచ్చిన పన్నాస పెన్నాఱి ఇరై ఊనికిన్ తేనిలిచ్చిన వాన్ఱుపఞ్చ మహాపాతకున్డగున్. అసినైరువు లికితమ్" ఇది యేడవ శతాబ్దము నాటి వచన రూపము. ఇందు "కొన్ని కొన్ని పదాలు మాత్రమే కాకుండా వాక్యరచనకూడా విలక్షణంగానే వున్నది." అని శాసన పరిష్కర్తలు సోమశేఖర శర్మగారి యభిప్రాయము. సంస్కృతభాషా సంపర్కమువలన నీరూపము సత్వరముగ మాఱినది. భాష సంస్కృత పద భూయిష్ఠమైనది. పదియవ శతాబ్ద ప్రారంభ మప్పటికిది యెట్లు మాఱెనో ప్రథమ చాళుక్య భీముని ధర్మవర శాసనము విదితము సేయుచున్నది. "గుణగణాభరణుండు దన. క. ని ఈశ్వరునకుం గార్తికేయుంబుంబోలె చౌషష్టికలా విశారదుం డెయిన అయ్యపయ్యయు సకల శాస్త్రార్థపారగులయిన పెదపణ్డరంగులు అయలమ పెగ్గడలుం గరమ్మున పండరంగును ఈ ధర్మనిర్వాహణోద్యోగమునకు..." ఇత్యాది. కొంచె మెంచుమించుగ నిట్టి వచనమె నన్నయ్యభట్టుగారి భారతమున గానవచ్చుచున్నది. నన్నయభట్టు మహాభారతమె యాంధ్రకవులకు మేలుబంతియైనది. కాని యీ వచనమంతయు పద్య కావ్యాంతర్గతము. కేవల వచన గ్రంథములు 17 వ శతాబ్దారంభమువఱకును దలచూప లేదు.

మనకిప్పు డుపలబ్ధము లైన వచన కావ్యములను రెండు తెఱగుల విభజింపవచ్చును. జనానీకమున కైనందిన వ్యవహారమునందుండు వాడుక భాషయందు వ్రాయబడినవి కొన్ని. ఇవి జనసామాన్యము నుద్దేశించి వ్రాయబడినవి. ఇప్పుడు కొంతవఱ కందలి భాష దుర్గ్రాహ్యమైనను వాని రచనాకాలము నందవి సులభగ్రాహ్యములుగనె యుండెడివి. గ్రాంధిక భాషయందు రచింపబడినవి మఱికొన్ని. ఇవి విద్యావంతులకొఱకు వ్రాయబడినవి.

వాడుక రచనయందు వ్రాయబడిన వచన రచనలలో రాయవాచకము ప్రధానమైనది. ఇది చరిత్ర గ్రంథము. కృష్ణదేవరాయల చరిత్రము యిందు వర్ణింపబడినది. ఇది విశ్వనాథ నాయనికి అజ్ఞాత నామధేయుడైన యతని స్థానాపతి వ్రాసిపంపిన విన్నపమైనట్లందు కలదు. గ్రంథకర్త కృష్ణరాయలకు సమకాలికుడు గాడు. సుజనులచే విన్నయట్టి విషయమును వ్రాసితినని చెప్పుకొన్నాడు.

"విజయనగర వృత్తాంతము
సుజనులచే విన్నయట్టి సూనృతవాక్కుల్
ప్రజలకు దేట పడంగా
సృజియించితి కృష్ణరాయ శేఖరు చరితల్."

అని గ్రంథారంభముననె చెప్పినాడు. ఈ విశ్వనాథ నాయనయ్యవా రెవ్వరో తెలియదు. ఈ విశ్వనాథ నాయనయ్య మధురరాజ్య స్థాపకుడైన కటికము విశ్వనాథనాయకు డగుటకు సంశయము లేదని జయంతి రామయ్య పంతులుగా రానతిచ్చినారు. ఇందు కనుగుణముగ పదునాఱవ శతాబ్ద మధ్యకాలమున నిది వ్రాయబడెనని సెలవొసగినారు. ఈ గ్రంథకర్త మధురరాజ్య స్థాపకుడైన విశ్వనాథ నాయకుని యొక్క స్థానాపతియు గాడు; పదునాఱవ శతాబ్దమునం దీ గ్రంథము వ్రాయబడనులేదు. కుమార ధూర్జటి రాయవాచకమును బద్యకావ్యముగ రచియించి యార్వీటి చిన వెంకటపతి కంకితమిచ్చెను. ఈ చినవెంకటపతి క్రీ. శ. 1630 - 42 ల మధ్య కర్ణాటక సామ్రాజ్యమును పాలించిన ముమ్మడి వెంకటపతి రాయల తమ్ముడు. కావున అప్పటికె రాయవాచకము రచియింపబడి యుండెనని నిశ్చయముగ జెప్పవచ్చును. ఇంతకంటె సూక్ష్మముగ రాయవాచక రచనా కాలమును నిర్ణయించుటకు దగిన సాక్ష్యముందె కలదు; రాయవాచక కర్త భాగ్యనగరము నెఱుగును బాహుబలేంద్రముకుంద గజపతిని, రాణాజగదేవుని, మల్ల అనంతరాజును పేర్కొనియున్నాడు. భాగ్యనగరము క్రీ. శ. 1589 సంవత్సరమున నిర్మింపబడెను. బాహుబలేంద్ర ముకుంద గజపతి క్రీ శ. 1694 వఱకు రాజ్యము జేసెను; రాణాజగదేవుడు

"అళియ రామావనీశతిరుమల నృపాల
వరుల శ్రీరంగరాయల సరసుడైన
వీర వేంకట రాయల వెలయరాయ
పట్టభద్రులజేసి నప్పార్థివుండు."

అని పొన్నతోట యాఖిళ కవి తన వామన పురాణ పీఠికయందు చెప్పియున్నాడు. వీరవేంకటరాయలు

క్రీ. శ 1685 వ సం॥న పట్టభద్రుడాయెను; మఱ్ఱి అనంతరాజు క్రీ. శ. 1607 వ సంవత్సరమున సిద్ధవటమునందు శాసనమును నిల్పెను. కావున రాయవాచక రచయిత క్రీ. శ. 16 వ శతాబ్దపు తుదను 17 వ శతాబ్ద ప్రారంభమునను వర్ధిల్లెనని చెప్పవచ్చును. అటులు రాయవాచకమున జెప్పినట్లు వాస్తవముగ మహామండలేశ్వర కాశీ విశ్వనాథ నాయనయ్య వారికి స్థానాపతియై యుండిన ఆ విశ్వనాథ నాయనయ్య యెవ్వరో విచారింపదగియున్నది. మధుర నాయకరాజ వంశమునకు నా రాజ్యస్థాపకుడైన విశ్వనాథ నాయకుడు గాక మఱియొక విశ్వనాథుడు గలడు. అతడు క్రీ. శ. 1595 మొదలు 1601 వఱకు పాలించిన రెండవ కృష్ణప్ప తమ్ముడు; 1601 మొదలు 1609 వఱకు పాలించిన ముత్తుకృష్ణప్ప నాయకుని తండ్రి. అతడు క్రీ. శ. 1601 వ సం. మునకు ముందు తన యన్న రాజ్యకాలమున గతించుట వల్లనేమొ సింహాసనము నెక్కలేదు. రాయవాచక రచయిత కొలిచిన ప్రభు వీ విశ్వనాథ నాయకుడై యుండవలయును. అగునేని రాయవాచకము 16 వ శతాబ్దాంత్య దశకమున వ్రాయబడెనని నిశ్చయింపవచ్చును.

రాయవాచకము, 16 వ శతాబ్దాంతమున రాయ సామ్రాజ్యమున రాజకార్య వ్యవహారములను నడుపు అధికార వర్గమునందు చెలామణియందుండిన భాష యందు వ్రాయబడినది. పార్సీభాష సంపర్కము వలన ఆ భాషనుండి రాజకీయ పారిభాషికపదము లనేకము లిందుజొచ్చినవి. తత్కారణమున నది సులభ గ్రాహ్యము గాక పాఠకులకు క్లేశము గలిగించుచున్నది. అతి దీర్ఘవాక్యములును ప్రాత వచన రచనావిధానమును అచట నచట భావ వైశద్యమునకు బంధకములై వ్యథాజనకము లగుచున్నవి. కాని మొత్తముమీద నిందలి భాష, పొల్లుమాటలుగాని యనావశ్యకవర్ణనలుగాని లేక, పటుత్వము గలిగి యున్నది.

రాయ వాచకమును బోలినదె మఱియొక వచన గ్రంథమును ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించియున్నారు. దీని పేరు తెలియదు. "రాయవాచకము వంటి చరిత్రము" అని పరిషత్తువారు నామకరణము జేసియున్నారు. భాష రాయ వాచకమువంటిదె. కాని చరిత్రవిషయమంత సత్యాత్మకమైనది కాదు; దీని నెవ్వ రెప్పు డెచ్చట రచించిరో నిర్ణయించుటకు దగిన సాధనములు లేవు.

కాలక్రమము ననుసరించి రాయ వాచకమునకు బిమ్మట నాటకభాషయందు వ్రాయబడిన వచన గ్రంథము మధుర మంగాపుంశ్చలీ విలాసము. ఈ మధుర మంగ, చొక్కనాథ నాయని రాణియై, యతని యనంతరము తన మనుమ డగు విజయరంగ చొక్కనాథునికి బ్రాపై యాతనిపక్షమున 1689 మొదలు 1706 వఱకును మధుర నాయక రాజ్యమునుపాలించిన మహారాణి మంగమ్మ. ఇందు వర్ణింపబడినది యామె రాజ్య పరిపాలన చరిత్ర కాదు, గ్రంథ నామమున సూచింపబడిన ట్లామెయొక్క పుంశ్చలీవృత్తి. మహారాణి మంగమ్మ దానధర్మ పరాయణురాలని లోక ప్రతీతి. దీనికి ప్రత్యక్ష విరుద్ధమైనది ఇందలి ఇతివృత్తము. ఇందు ఆమె మన్మథ క్రీడలు వర్ణింపబడియున్నవి. గ్రంథకర్త యెవ్వరో నిశ్చయించి చెప్పుటకు వీలుపడదు; అతడే కారణమువలననో మంగమ్మయొక్క కోపమునకు పాత్రుడై, దేశత్యాగముజేసి తిరుచినాపల్లినుండి యానెగొంది వఱకును గల దేశమున పలు తావుల గ్రుమ్మరుచు నిడుమలు గుడిచెను. అతడు మంగమ్మపై గసిదీర్చుకొనుటకు చంద్రికా విలాసమునుబోలి పచ్చిబూతులు గల భాషలో నామె దుశ్చరిత్రమును గర్హించెను. మఱియు దన యనుభవములను సమకూర్చెను. బూతుల పుస్తకమైనను— అప్పటి దేశకాలవిద్యమానము లందు ప్రతిబింబించుచుండుటవలన — చరిత్రకారుల కది యత్యంతోపయుక్తమైనది.

అన్యదేశరాజకీయ పరిభాషా పదభూయిష్ఠము గాకున్నను, ఇందలి భాషకును రాయ వాచక భాషకును దగ్గరి పోలికలు గలవు. రచనాపద్ధతియు, నన్వయ సౌలభ్యములేని దీర్ఘవాక్యములును రెంటికిని సామాన్యము. మదనోద్రేకముగల్గించు వర్ణనలు, తీక్ష్ణమైన భాష, పోకైన మాటలును నీ గ్రంథమునకు ప్రత్యేకతను గల్గించుచున్నవి. గ్రంథకర్త కవిత్వము జెప్ప నేర్చినవాడు. పుంశ్చలీ విలాసమునందందు ద్విపద కలదు.

తరువాత పేర్కొనదగినవి మాఘ మాహాత్మ్య శ్రీరంగ మాహాత్మ్యములను రెండు మాహాత్మ్య గ్రంథములు. మహారాణి మంగమ్మయొక్క పౌత్రుడైన విజయరంగ చొక్కనాథ నాయకుడీ గ్రంథములకు కర్త. ఇవి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమునం దున్నవి భాష వ్యావహారికము. 'ఈ వచనము నిరుపమున వలనుపడదు.

సులువుగా నర్థమగునట్లు వ్యావహారిక శైలిని రచియింపబడినది' యని ప్రభాకర శాస్త్రులవారి విమర్శ. ఇవి ముద్రితములైనగాని విజయరంగ చొక్కనాథ నాయని వచనరచనా విధాన మిట్టిదని వివరించి చెప్పుటకు సాధ్యముగాదు.

రాయవాచకాదులపద్ధతి ననుసరించి వ్రాయఁబడిన మఱియొక వచనగ్రంథముగలదు. ఇది తంజావూరాంధ్ర రాజులచరిత్ర. దీని రచయిత యెవ్వడో తెలియదు. కాని, యతడు మధుర నాయకుల కాశ్రితుడో పక్షపాతియో కావలయును. ఏలనగా నతఁడీ గ్రంథమును వ్రాసినది కేవల సత్యమైన చరిత్రాంశములను యథాతథముగ వర్ణించుటకొఱకు గాదు. తంజావూరు రాజ్యమును ఆక్రమించుకొని యేలుటకు మధుర నాయకులకు న్యాయమైన హక్కు గలదని నిరూపించుట కొఱకు. ఇందుకొఱకు చరిత్ర విరుద్ధమైన కథ నొకదానిని కల్పించినాడు. నాగమ నాయకుడు కృష్ణ రాయల కవిధేయుడై తిరుగబడెననియు నందుమీదట నాగమ నాయని పుత్రుడు విశ్వనాథ నాయకుడు తండ్రియని గణింపక రాయలనడిగి యాజ్ఞను గైకొని దండుతో దరలిపోయి యాతని గట్టితెచ్చి రాయలముందుంచెననియు, రాయ లాతని స్వామిభక్తికి మెచ్చి దక్షిణ సింహాసనమున కాతని నధిపతిగావించి చోళ పాండ్య రాజ్యముల నాతనికి బంచియిచ్చెననియు, దరువాతి అచ్యుతరాయలు తన మరదలు మూర్తిమాంబను చెవ్వప్పనాయన కిచ్చి పెండ్లిచేసి, యామెకరణముగ చోళరాజ్యమును విశ్వనాథ నాయకుని యేలుబడినుండి విడదిసి యిచ్చెననియు నొక గాథను సృష్టి చేసినాడు. గ్రంథ రచనా కాలమెద్దియొ సూక్ష్మముగ నిశ్చయించి చెప్పుటకు వీలులేదు. కాని ప్రాయశః అది పదునెనిమిదవ శతాబ్దమున రచింపబడెనని యూహించుటకు గొంత యవకాశము గలదు. ఏలనగా, నీ తంజావూరాంధ్రరాజుల చరిత్ర ఇట్లు సమాప్తమగుచున్నది. "పారిపోయిన చెంగమల దాసుకొడుకు విజయరాఘవనాయడు, అతని కొడుకు విజయమన్నారప్ప నాయడు, ఆతడు చొక్కనాథ నాయని మనుమడు విజయరంగ చొక్కనాథనాయని వారికి తన చెల్లెలి నిచ్చి వివాహముచేసి వారిచ్చిన జాగీరు అనుభవిస్తూ వుండెను." విజయరంగ చొక్కనాథుడు క్రీ. శ. 1706—1732 ల మధ్య రాజ్యపాలనముజేసెను, కావున నీ గ్రంథరచన పిమ్మట నెప్పుడో జరిగియుండవలయును.

తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర, భాషనుబట్టి చూడగా, రాయవాచకము కంటెను, మధురమంగా పుంశ్చలీ విలాసముకంటె గడు నర్వాచీన రచన యని తోచుచున్నది. మెకంజీ సంపుటములలోని గ్రామ కైఫీయతులలో పెక్కింటిభాష యింతకంటె ప్రాచీనతరముగ గానవచ్చుచున్నది. విస్పష్టమైన భాష; అజ్ఞాత పదములు గాని, బహుళముగ నన్యభాషా పదములు గాని కానరావు. వాక్యము లాధునిక రచనలందువలె నాతి దీర్ఘములు; వాని రచనా విధానము గూడ నట్టిదె. పరిష్కర్తలు వేటూరు ప్రభాకర శాస్త్రులవారి "తోడిమ"యందలి భాషాదులకును దీనికిని విశేష భేదము గానరాదు. శాస్త్రులవారు తంజావూరాంధ్రుల రాజుల చరిత్రను ఉన్నదాని నున్నట్లు ముద్రింపక సంస్కరించి ముద్రించిరేమో యని సంశయము గలుగుచున్నది. విచారణీయము.

గ్రాంథిక వచన రచనలు :—గ్రాంథిక వచన రచన లనగా గ్రాంథిక భాషలో వ్రాయబడినవి. గ్రాంథిక వచన రచనలు మన కెఱుకపడినంతమట్టుకు క్రీ. శ. 17 వ శతాబ్దపు టుత్తరార్థమున ప్రారంభమైనట్లు కానవచ్చుచున్నవి. ఇవియన్నియు భారత భాగవత రామాయణాది పురాణేతిహాసములకు తెలుగుసేతలే. కొందఱు ఆంధ్రీకరణముల ననుసరించిరి. మఱికొందరు సంస్కృత మూలములకు తెనుగు వ్రాసిరి. ఆంధ్రవాఙ్మయ చరిత్రాధ్యాపకులు స్మరణయందుంచుకొన దగిన విశేషాంశమొకటి కలదు. ప్రాచీనాంధ్ర కవులు సంస్కృతేతిహాస పురాణాదులను పద్యకావ్యములుగ వ్రాసిరి; తరువాతి వారు వీనిని ద్విపద కావ్యములుగ వ్రాసిరి; 17 వ శతాబ్దము వారు వీనినె వచన కావ్యములు సేయగడగిరి. ఇది యితిహాస పురాణాదులపై వారికిగల యభిమానము దెల్లము సేయుటయె కాక స్వతంత్రగ్రంథ రచనయందు వారి కభిరుచి చాల తక్కువయనియు జాటుచున్నది. గీర్వాణ సాహిత్యమున కాంధ్ర సాహిత్యము నకలుగ దయారగుట కిదియె ముఖ్యకారణమని తోచెడిని.

తుపాకుల అనంత భూపాలుడు దాక్షిణాత్య వచనకావ్య రచయితలలో మొదట పేర్కొనదగినవాడు. భారత వచన రచనయందు కళువె వీరరాజున కితడు తోడ్పడుటచేత నేమొ శ్రీ నిడదవోలు వెంకట్రావుగా రితని మైసూరివారిలో జమకట్టిరి. "ఈ తుపాకుల యనంత భూపాలకుడు మధుర రాజుల

యొద్ద దళవాయి యని తెలియుచున్నది." అని పల్కినారు ప్రభాకర శాస్త్రులవారు. అతని గ్రంథాంత గద్యవలన యతని చరిత్ర కొంత తెలియుచున్నది ఇందు "చంద్రగిరి కృష్ణ నృపతనూజ ..తుపాకుల యనంత భూపాల' యని తన యునికిని జెప్పుకొన్నాడు. ఇందువలన అతని తండ్రి చంద్రగిరి వాస్తవ్యుడైన కృష్ణ నృపుడనియు నతని యింటి పేరు "తుపాకుల" యనియు తెలియవచ్చుచున్నది. ఈ చంద్రగిరి కృష్ణనృపుడు సుప్రసిద్ధుడైన తుపాకుల కృష్ణప్పనాయకుడు గాని యన్యుడు గాడు. తుపాకుల కృష్ణప్ప మొట్టమొదట క్రీ. శ. 1637 లో చెంచి నాయకుల సేనాధిపతియై యుండెను. క్రీ. శ. 1648 లో చెంచికోటను రాజ్యమును బిజాపుర సుల్తాను జయించి స్వాధీనము జేసికొనిన పిమ్మట నతడు గోల్కొండ సుల్తానుకు సర్వాధికారియైన మీరుజుమ్లా కొలువునజేరి యతని సేనాధిపతియై యతని శత్రువులతో యుద్ధములు చేయుచుండెను. క్రీ. శ. 1656 లో మీరుజుమ్లా స్వామిద్రోహము జేసి యౌరంగజేబు కొలువును బ్రవేశించినప్పుడు, కర్ణాటకమునందలి దన సైన్యమును దుపాకుల కృష్ణప్ప కొప్పజెప్పెను. క్రీ. శ. 1656 వ సం॥న తుపాకుల కృష్ణప్పనాయకుడు పులికోటను ముట్టడించియుండెగా నబ్దుల్లాకుతుబ్షాహు సైన్యాధిపతియైన కుల్లీ బేగు సైన్యముతో నతని దాకి యుద్ధమున బరాజ్ముఖుని గావించి బందీకృతుని జేసెను. ఇతని కుమారుడైన యనంత భూపాలుడు వెంకట్రావుగారు తలచినట్లు మైసూరు రచయితలలో జేరడు. తుపాకుల కృష్ణప్పనాయకుడు బందీకృతుడయిన పిమ్మట అతని సన్నిహితజ్ఞాతియు నతని క్రింది దళనాయకులలో నొక్కడునైన తుపాకుల లింగమనాయడు కుటుంబముతోగూడ తిరుచినాపల్లెకు బోయి చొక్కనాథ నాయకు నాశ్రయించెను. చొక్కనాథనాయకు డాతని కుమార్తెను మంగమ్మను వివాహము జేసికొని యతనికి సేనాధిపత్యమిచ్చెను. అతడు పూర్వము తన యజమానునిమీది యభిమానముచే నతని పుత్రుడగు ననంతభూపాలుని దనవెంట దోడ్కొనిపోయి మధుర సైన్యమున దనక్రింది దళవాయిగ నియమించియుండవచ్చును. అగునేని యతడు ప్రభాకరశాస్త్రులవా రనినట్లు మధురనాయకులయొద్ద దళవాయిగా నుండుటయందు దసంగతి మేమియు లేదు

అనంతభూపాలుడు పెక్కు వచన కావ్యములను వ్రాసెను. విష్ణుపురాణము, మహాభారతమున నాది, సభా, శేషధర్మ, అనుశాసనిక పర్వములు- మొదటి మూడు పర్వముల వచనరూపం దిట్టగు కవుల ... మూలానుసారము వ్రాసెను. మిగత పర్వముల నితడొక్కడె రచించెను. రామాయణము సుందరకాండ—భగవద్గీతలు. ఇందు విష్ణుపురాణము ముద్రితమైనది. కాని యిప్పుడు ముద్రిత ప్రతులు దొరకవు. కలువ భారతమును భగవద్గీతయును ముద్రితములే. లెక్కనవ ముద్రితములు. అనంతభూపాలుని ఉద్ధయు భాషా సాహిత్యభోజునకు, అఖిల సురాధీశ్వరకథాను సంధాన సమేతమానసునకు, వచనరచనా వి[illegible]తుణునకు. ఇతని భావకల్పనము, సులభగ్రాహ్యము, శబ్దాడంబరములేక మృదుపదబంధురమై చదువుటకింపుగ నుండును. ఇతని విష్ణుపురాణమును గూర్చి ప్రభాకరశాస్త్రులవారు చేసిన ప్రశంస యొప్పినదై యున్నది. "విష్ణుపురాణముకంటె నియ్యది కడు విపులమై సంస్కృతమూలమును ననుసరించుచున్నది... ఈ విష్ణుపురాణము ధారాశుద్ధి వచనశక్తి యించుక ప్రౌఢమై మిక్కిలి చక్కగ నున్నది సమాసములు కొంచెముగాక యిందు సంస్కృత వచన భారతమందువలె మెండుగా జూపట్టుచున్నవి"

అనంత భూపాలునకి సమకాలికుడే లింగనమఖి కామేశ్వర కవి. ఇతడు తిరుమల నాయకుని కొలువునుండియు మధుర సంస్థానము నాశ్రయించియుండె చొక్కనాథ నాయకుని యాపదరులనకు పాత్రుడై ముష్ణగిరికి సత్యభామాసాంత్వన మను శృంగార ప్రబంధము నంకితమొసగె నని ముందు వివరించియున్నాడను. ఇతడు ధేనుమాహాత్మ్యము, ఆచార్య విజయమను రెండు వచన కావ్యములను రచించినట్లు ప్రభాకరశాస్త్రులవారు వ్రాసియున్నారు. ఈ రెండవ గ్రంథమును వా రెచ్చట జూచిరో తెలియదు. ధేనుమాహాత్మ్యము తంజావూరు సరస్వతీ మహాలు పుస్తక భాండాగారమందున్నది. ఇతని వచనశైలి మంచిదే. కాని యనంత భూపాలుని సారళ్యముగాని భాషా మాధుర్యముగాని ధేనుమాహాత్మ్యమున గానరావు.

విజయ రంగ చొక్కనాథుని కొలువునందనేక వచనకావ్యములు వెలువడినవి. విజయరంగ చొక్కనాథుని యాస్థాన స్థితులయిన కవులు కొందఱు వచన కావ్యములను వ్రాసిరని చెప్పకొనియున్నారు. కుందుర్తి వేంకటాచల కవి భారత, భాగవత, రామాయణములను వచన కావ్యములుగా రచించెను. వెలగపూడి కృష్ణయ్య వేదాంతసార

సంగ్రహమును వచన కావ్యమును జెప్పెను. ఈ గ్రంథము లింకను లభ్యపడలేదు. విజయరంగ చొక్కనాథుని యాస్థానమందలి వచన కావ్యకర్తలలో శ్రేష్ఠతముడు సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు. జైమిని భారతము సారంగధర చరిత్రలను రెండు గద్య కృతులను రచించెను. జైమినిభారతము పిల్లలమఱ్ఱి పినవీరన్న పద్య ప్రబంధమునకు వ్రాయబడిన వచన కృతి. ఐదాశ్వాసముల గ్రంథము. అచట నచట శృంగారాది వర్ణనల పట్టున మూలాతిరేకము గానవచ్చినను గ్రంథమునం దెల్లయెడలను వీరన్న మాటలను లోకోక్తులను మార్చక యట్లె వచనము జేసినాడు. గ్రంథము విజయరంగ చొక్కనాథుని కంకితము సేయబడినది. గ్రంథరచనయం దితడు కొంత వఱకు కళువె నంజరాజు పద్ధతి నవలంబించినాడు; హాలాస్యమాహాత్మ్యాధ్యాయాద్యంతములందువలె నీతడు జైమినీభారతాశ్వాసాద్యంతములందు పద్యముల గూర్చినాడు; శైలి ప్రౌఢమై శబ్దాలంకారాత్మకమై యొప్పారుచున్నది.

సారంగధరచరిత్ర మూడాశ్వాసముల గ్రంథము. ఇందును ఆశ్వాసాద్యంతముల బద్యములు గలవు. శ్రీరంగనాథస్వామి కంకితము సేయబడినది. ఇది చేమకూర వేంకటకవి విరచిత పద్య ప్రబంధము ననుసరించి వ్రాయబడెనేమో. గ్రంథము ముద్రితము గుటచేతను అందుబాటున లేకపోవుటచేతను విమర్శనము యమును పరిశీలించి చూచుటకు వీలుగాకున్నది. శైలి చక్కనిదే. కాని వేంకటకృష్ణప్ప నాయకుని వచన కావ్యములందు అతని పద్యకావ్యములలో గానవచ్చు భాషాశైథిల్యమును వ్యాకరణదుష్టత్వమును గానరావు. ఇందులకు గారణ మాతడు వచన రచనలయం దన్యుల భాషను స్వీకరించుటయేనని తోచుచున్నది.

సంస్థానాశ్రితులు గాకపోయినను, విజయరంగ చొక్కనాథ నాయకుని కాలమున వర్ధిల్లిన వచన గ్రంథకర్తలు మఱికొందరు గలరు. శ్యామరాయ కవియు వేంకటసుబ్బ కవియు రామాయణ వచన కావ్యములను వ్రాసిరి. రామభద్ర కవి యను నతడు, హాలాస్య మాహాత్మ్య వచనమును విరచించెను. ఇట్లు 17, 18 శతాబ్దములందు ద్రావిడదేశమునం దాంధ్ర వచన కావ్యములు కొల్లలుగ నుత్పత్తియాయెను. ఈ వచనవాఙ్మయ మింకను ముద్రితము గాకయుండుట శోచనీయము.

(సశేషము)

శ్రవ్య నాటిక :

# సిద్ధార్థుడు

శ్రీమతి నాయని కృష్ణకుమారి

పాత్రలు.

యువరాజు — సారథి

అంగిరుడు — శిష్యులు

సుజాత.

## 1

[ఒకనాటి సాయంకాలం. కపిలవస్తుపుర వీథుల్లో రాజు తేరు. అందులో అలౌకిక భావోన్మాది యువరాజు. రథచోదకుడు ఛందకుడు వయస్సుపండిన వృద్ధుడు. అతడు యువరాజును తన చేతులతో లాలించి ఆడించిన వాడు.]

ఛంద: ప్రభూ ఎప్పుడూ లేదు ఇవ్వాళ ఊరు చూడాలని కుతూహలపడ్డారు.

యువ: ఛన్నా!

ఛంద: పెదవి కదిపితే చాలు గుండెల్ని దూసుకుపోయేటట్లు ధ్వనిస్తుంది. ఆ క్షణంలో మీరు యువరాజులనే అనిపించరు.

యువ: నేను కాదుగా ఛన్నా!

ఛంద: అదేం మాటలు స్వామీ! నేడో రేపో శాక్యసింహాసన లక్ష్మి మీ పవిత్ర రూపశ్రీని యశోధరాదేవితో సమానంగా పంచుకోబోతున్నది.

యువ: సరేలే. అట్లా చూడు.
సొగసు. చిత్రకర్తలా మనస్సును రంజిస్తున్నది. వ్యాఖ్యాతవలె భావాలను ఉసికొల్పుతూన్నది. నాకిన్నాళ్ళనుండీ ఉద్యానవనంలో నీకెంప మాత్రమే తెలుసు. అక్కడ పకులు తళతళలాడి హరిన్మణాలనిపించేవి. ఇక్కడి భవనాలు తళతళలాడి హిరణ్మయాలనిపిస్తూన్నవి. ఈ దృశ్యం చూస్తూంటే నీకే అనుభూతీ కలగడంలేదూ?

ఛంద: పొట్టకొఱకు దేవులాడే అల్పుణ్ణి యువరాజా! ఈ దృష్టి మాలో ఎట్లా ఉంటుంది?

యువ: అటు వృద్ధభానుడు పండి రాలే ముదివన్నెలా అల్లల్లాడుతున్నాడు. అతని ముఖం రోగార్తమై, రక్తమయమైనట్లు మనస్సు చలిస్తున్నది — ఏమిటీ భావద్వంద్వం? సృష్టిలో ఉన్న సుఖదుఃఖాలలో ఏది మిన్న? మానవుడు మాత్రం ఈ రెంటికీ లోకువ. అతని జన్మకిక విముక్తి ఎట్లా కలుగుతుంది సారథీ! —

ఛంద: సృష్టే అంత స్వామీ. ఆ చక్రమట్లా తిరుగుతూనే ఉంటుంది సుఖదుఃఖాలకు లొంగి మనుష్యులట్లా పుట్టిగిట్టుతూనే ఉండాలి.

యువ: సృష్టికంతటికీ కర్త అనుకునే భగవంతుడికిది విలాసం కాబోలు. నీటినుండి చేపను బయటవేసి జాలరి సంతోషిస్తాడు. శరవేదనతో ప్రాణోత్క్రమణ సమయమాసన్నమైన మృగశాబకాన్ని చూచి వేటకాడు ఆనందిస్తాడు. — ఆయన జాలరి! మృగయుడు!

ఛంద: అంత మాటలెందుకు ప్రభూ! సుఖదుఃఖాలను మిళితం చేస్తేనే జీవితం. దుఃఖసృజనే ఆయన చెయ్యకపోతే అతితీపి వెగటు కలిగించేది.

యువ: అట్లా అని దేహి యీ ద్వంద్వంలో పాతరలాడి బయటికి రాలేడు. ఇదేం న్యాయం ఛన్నా?

ఛంద: విచక్షణ కలవాడు ఎట్లాఅయినా తన్ను తాను తరింపజేసుకుంటాడు. ఇతరులను ఉద్ధరిస్తాడు. ఏ సంఘర్షణా లేకపోతే సత్యస్వరూపి భగవదన్వేషణ ఎట్లా జరుగుతుంది స్వామీ.

యువ: భగవదన్వేషణ! — ఆయన బ్రాహ్మణుల శాస్త్రప్రసంగాల్లోనేనా ఉండేది? — నోరులేని జీవాల్ని బలి తీసుకునే యజ్ఞకుండాలలోనా? లేక

ప్రాణాలు లేని, ప్రాకృతులు కొలిచే, రాతిబొమ్మల్లోనా? ఏంగాటలివన్నీ!

ఛంద: దైవదూషణ మనకెందుకు స్వామీ. ఏ విషయమైనా ప్రశాంతంగా జిజ్ఞాసతో మనస్సుకు పట్టించుకోవడమే మంచిది—ప్రభూ, ఈ విహారం మీకేమీ సుఖదాయకంగా లేదు. వెళ్ళిపోదామా! నాట్యకత్తెల చిఱుగజ్జెల చప్పుళ్ళలో మీ మనస్సు శాంతిని పొందుతుందేమో. చిన్నబాబు రాహులుడి తొక్కుపలుకుల మాధుర్యంతో తేరుకుంటుందేమో!

యువ: ఛందకా, మా నాన్నగారూ ఇట్లాగే చెప్పేవారు. ఒకరోజు, వానకారు తొట్టతొలి రోజుల్లో ఆకాశమంతా మేఘాచ్ఛన్నమై అజ్ఞాత సౌఖ్యానికి దూరంగాపోయి పరితపిస్తున్నట్లున్నది. నా హృదయంనిండా ఏవో ఊసులూ, మెఱుపులూ. బలాకపక్షులు బారులుతీరి ఏ అనంతపథాలనో పట్టి పయనిస్తూ ఉంటే నా మనస్సు అవశమైపోయింది. శరీరం దానితో చెర. అప్రయత్నంగా కళ్ళు నీళ్ళు క్రమ్మి వెక్కుల చిందినవి. నాకు వాటిని తుడుచుకోవాలనైనా అనిపించలేదు.

ఇంతలో నాయనగారు. ఆయన హఠాదా గమనం నాకు విభ్రమాన్ని కల్పించింది. నా పరిదీన ముఖమూ, అశ్రుసిక్తనయనాలూ ఆయన్ను కలవరపెట్టాయి. ఇద్దరం ఒక్కక్షణంపాటు నిర్నిమేష దృక్కులతో స్తంభితులమయ్యాం. తర్వాత ఆయన అన్నారు.

“గౌతమా! నీ తల్లిమాయ కడుపు పండి ఫలించినవాడవు. అంతఃపురంలో సౌభాగ్యవతి యశోధర నీకోసం ఎదురుచూస్తూ ఉంటుంది. ఆ సుపుత్రుడు నీమనస్సుకు శాంతినిస్తాడు. వెళ్ళు నాయనా”—చెన్నా! ఇట్లా నాది కారణంలేని కలత అన్నట్లు తేల్చారు నాన్నగారు.

ఛంద: ప్రభూ! శాక్యక్షత్రియులు అదృష్టానికీ ఆనందానికీ నిధులు. వారికి ధర్మలోపమూ గుణలోపమూ లేదు—

సాధ్వి మాయాదేవి మిమ్మల్ని లుంబినీవనంలో ప్రసవించింది. ఆ శుభవేళల్లో మాతృ శిశువులకు దేవతలు నీరాజనా లెత్తారు. వారు కురిసిన పువ్వులు మీ శిరస్సున తారలై శోభించినవి. ఆ కథలన్నీ విని మా హృదయాలు పరవశించాయి—శాక్య రాజులకు పరాక్రమమూ, ప్రతిభా ఉన్నా కాలం కలిసి రావటంలేదు స్వామీ! కోసలరాజు ప్రసన్నజిత్తుడు ఉద్ధతుడు. ఉత్తరాపథంలో అందరూ ఆయనకు చేయిమోడ్చారు. మహాపరాక్రమవంతుడనుకున్న మగధరాజు అజాతశత్రువు, ఆయనకు ఓడి కాశీ నగరంతోపాటు తన కీర్తినికూడా అరిపెట్టాడు.

విజృంభిస్తున్న ఆ శక్తుల్ని ఒక కట్టుకొయ్యకు తెస్తారనుకుంటున్నాము. సార్వభౌములై ప్రపంచాన్ని శాసించి శాక్యకులచంద్రులే అవుతారని ఆశిస్తున్నాము. మహారాజు ఆ ఆశ ఒకకంటా, మిమ్మల్ని మరోకంటా పెట్టుకుని ఎత్తుకుఎత్తుగా పెంచుకుంటున్నారు.

యువ: సార్వభౌమతతో ఒక్క శాక్యకులమేమిటి సారథీ, సకల జీవులనూ ఒక కటుకొయ్యకు తెస్తాను. ఈ లోకాని కందనిగుణంతో ప్రపంచాన్నే సమాశ్వసిస్తాను.

ఛంద: యువరాజా!

యువ: ఎవర్ని నీవు పిలిచేది! సారథీ, నేను సిద్ధార్థుణ్ణి.

[తేరు గణగణ గంటలచప్పుళ్ళతో ఆకాశానికి ఎగిరినట్లు మోగుతుంది. సాయం సంధ్యల కసటు కాంతిలో కరిగిపోయే సిద్ధార్థుడి ముఖం అభౌమమై ప్రకాశిస్తుంది.]

యువ: చెన్నా. నాలో ఏవో సుషుప్తమైన శక్తిని ఈ గంటలే మేల్కొలుపుతున్నవి—అదేమిటి నీ కళ్ళల్లో ఆ నీళ్ళెందుకు! పెదవులు ఒణికే ఆవేశం నీలో ఏం కలిగిందిప్పుడు?

ఛంద: మీవల్లనే స్వామీ! మీనోట వెలువడే ప్రతిఅక్షరమూ నా గుండెల్లో శూలాలు గుచ్చుతున్నది. మీరు ఆ గర్భశ్రీమంతులు. ప్రజలను కంటికి రెప్పలా కాపాడవలసిన ప్రభువులు—

యువ: ప్రజలు! ఎటువంటి ప్రజలు చెన్నా! వృద్ధులు, రోగార్తులు, అంధులు, వికలాంగులు! దుఃఖపూరిత యాతనామయ ప్రపంచంలో, ఊపిరి తిరగక కొట్టుకునే దౌర్భాగ్యజీవులు! వీళ్ళ బాధలకు నిష్కృతిమణ మార్గాన్ని సూచించలేని నేను వీళ్ళకు ప్రభువు నెట్లా కాగలను!—అటు చూడు, వాడు

వృద్ధుడు. మృత్యుదేవత పిలుపుకు కూతవేటు దూరంలో ఉన్నవాడు. ఇక్కడ నా నరనరంలో యౌవనరక్తం పొంగుతున్నది. అణువణువూ పరిపుష్ట మౌతున్నది—అక్కడ ఆ అస్థిగత ప్రాణం, ఆ శల్యావశిష్ట దేహం—ఆ గతి మానవులకందరికీ దాటరానిదేనా? నాలోని భోగతృష్ణ, యౌవన వైభవం, ఆశాసంవర్ధితమైన యీ తనువు మట్టిగా, మసిగా, మారిపోయి రూపరహితం కాక తప్పదా—మృత్యు నిత్యాహ్వానం ఎవ్వరికీ తప్పదా సారథీ!

ఛంద : ఈ మార్పులన్నిటినీ కాలం తెస్తుంది స్వామీ. జరామరణాలు దేహికి సహజాలు.

యువ : మరణం! ప్రాణాల్ని వెళ్ళగొట్టి సౌందర్యనిలయమైన శరీరాన్ని శవంగా మార్చే విచిత్ర క్రియ—అదుగో అటుచూడు, నేను చూస్తున్న ఈ రసమయ జగత్తును దర్శించడానికి కళ్ళులేని నిర్భాగ్యుడు!

ఛంది :.........

యువ : మేమిద్దరమూ ఒక గడ్డపైన జన్మించిన వాళ్లం. నాకు లభించే భోగాలూ, విలాసాలూ కెట్లా తెలుస్తవి? వీని శల్యగతదేహంపైన, చూచి ఆనందించే కళ్ళులేని దేహంపైన, మా అంబర చుంబి హర్మ్యాలు రక్తకాంతుల్ని ఉమ్ముస్తున్నట్లుగా ఊహించి నా మనస్సు కుంచించుకు పోతున్నది. వీళ్ళ కన్నీటిజల్లు నాకు పన్నీరేనా ఛెన్నా!

ఛంద : భగవంతుడిసృష్టిలోనే యీ పక్షపాత మున్నదిస్వామీ. అది వారివారి కర్మానుగుణంగా సంక్రమిస్తూ వుంటుంది.

యువ : కర్మ! దాని కధిష్ఠాతమైనశక్తి ఏమయి నట్లు? అది మనుష్యసులభమేనా? ఇంత సత్కర్మచేసి యిన్ని భోగానుభవాల్ని పొందుతున్న నాకు మరణం సంభవించకుండా ఉండ దెందుకని?—నా ప్రాణానికి ప్రాణం యశోధర, ఈ నా చేతుల్లోనే చివికి జీర్ణించి ప్రాణాలు విడవకుండా ఉండేటట్లు ఆ కర్మ అడ్డు రాదేం?—నా కన్నుల చందమామ, రాహులుడు, జీవమెదలి, కప్పువేసిన కట్టెయై నాయెదుటే...

ఛంద: ప్రభూ, ప్రభూ! ఇవ్వాళ మీనోట అన్నీ అమంగళాలే ధ్వనిస్తున్నవి. శాక్యయువ రాజులు మీకీ లేనిపోని వ్యధలెందుకు స్వామీ. మీ ధోరణి ఎప్పుడూ విచిత్రంగానే ఉంటుంది. దీనికంతటికీ మూలమైన అసాధారణ ఘటనపై నా కెప్పుడూ అనుమానమే.

యువ: అనుమానమెందుకు? నీవు పెద్దవాడివు. నన్ను బిడ్డలా ఎత్తుకుని పెంచినవాడవు. నా గుండె మీద చెయ్యివేసి విను. లోలోపల జాగరితమైన విచిత్రశక్తి ఏదో నీ జీవకణాలను తగిలి తన ఉనికిని సూచించుకుంటుంది.

నేను ప్రపంచాన్ని జయిస్తాను ఛందకా. సకలజీవుల బాధానివారణకూ ఉపాయాన్వేషణచేసి సఫల ప్రయత్నుణ్ణౌతాను. అమృతత్వాన్ని సమర్చి లోకాన్ని ఆనందమయం చేస్తాను.

ఛంద: ఇందులో అబద్ధమేమీ లేదు స్వామీ. ఇక నేను దాచవలసిందేముంది, దాన్ని దేవతలే చెప్పారు. మహారాజ్ఞి మాయాదేవి లుంబినీ వనంలో ప్రసవించినప్పుడు నలుగురు దివ్యులు మిమ్మల్ని చేతుల్లో పెట్టుకున్నారట. —"దేవీ! ఇదుగో నీగర్భఫలం. వీడు మహాపురుషుడు. ఇతనితో సమాను డింకొకడు లేడు!" అని చెప్పారట. అప్పుడు మీ దృక్కులు ప్రాచీదిశకు ప్రసరించగా వేయిలోకాలూ మీ దృక్పథంలో పడి నమ్రాతి నమ్రా లయ్యాయట. దైవజ్ఞులందరూ మిమ్మల్ని చూచి రెండు వేళ్ళూ పైకెత్తి చూపి మీరు లోకోద్ధారకులవుదు రన్నారు.

మేమంతా మీరు సార్వభౌములై ప్రజలకు సుఖసంధానాన్ని కావిస్తా రనుకున్నాము. కాని ఊహలు వేరు, మార్గాలూ వేరు.

యువ : ఛెన్నా!

ఛంద : స్వామీ, మీరు పుట్టిననాడు శాక్య కులంలో అయిదువందలమంది బాలకులు జన్మించారు. అందులో దేవర తమ్ముళ్లు నందులు మొదటివారు. అయిదువందలమంది బాలిక లుద్భవించారు. వాళ్లలో దేవి యశోధర మొదటివారు. పంచశతాలు అశ్వాలు కళ్లు విప్పినవి. వాటిలో మీ సుఱ్ఱం కంటకమే మొదటిది.—వీరందరికీ జన్మరహస్య మొక్కటే. హతభాగ్యుణ్ణి నాకే దారిలేదుస్వామీ.

[చీకటి పూతతో సంధ్యారాగం మషీరసమౌతున్నది. ఛందకుడి ముఖమంతటా పరివ్యాప్తమైన దిగులు తరగలు యువరాజును చుట్టుకుని పైకొంటున్నవి. తేరు మరలుతుంది. నిండుగా పరిదీనంగా రథనేమి ధ్వనిస్తుంది. సిద్ధార్థుని కన్నులలో చిలకరించిన బుద్ధత్వపుఛాయ లోకానికే అభయప్రదం.]

## 2

[రాజగృహ సమీప కాననాన ధూళిధూసర శరీరుడు సిద్ధార్థుడు. ఆయన ముఖం వినిర్మల జ్యోతిరుజ్జ్వలితం—అదొక ఆశ్రమం. ఒకపక్క వేద నాదాలు వినపడుతూ, మరొకపక్క శాస్త్రచర్చలు జరుగుతున్న పవిత్ర వాతావరణం.]

సిద్ధార్థుడు: అయ్యా—ఆర్తుణ్ణి. ఈ ఆశ్రమానికి యజమాని అలరులవారిని చూడవచ్చునా!

అల: ఆర్తులా! నావల్ల ఆర్తిని పోగొట్టుకోదలచే ప్రతిజీవికీ ఇక్కడ ఆశ్రయముంటుంది. వారు లోపలికి రావచ్చును.

ఒకరు: ఆ కళ్ళు చూడవయ్యా! దివ్యజ్యోతిస్సులు వెదజల్లే మణిశకలాలు!

ఇంకొకరు: ఈయన రూపమే, పవిత్రతఅంతా అచ్చుపోసినట్లు కనిపిస్తున్నది.

మరొకరు: ఈయన ఆర్తు డేమిటి?

ఒకరు: ఏమో! ఏమిటో ఈ జీ

ఇంకొకరు: పాడువిధాత హంసతూలికా తల్పాల్లో భోగికావలసిన కుఱ్ఱవాణ్ణి వీథులపాలు చేసినట్లున్నాడు.

అలరు: నీవు పసివాడిలా కనిపిస్తున్నావు. అయినా నిన్ను 'నాయనా' అని పిలిచేశక్తి నాలో లేదనిపిస్తున్నది. ఎవరవయ్యా నీవు?

సిద్ధా: ఒక తృష్ణాపీడితుణ్ణి. ఉన్ముఖంగా నాలో వర్ధిల్లే ఆ వాంఛే జ్వలించి జ్వలించి నన్ను దహించివేస్తుందేమో! మీరు దాన్ని చల్లార్చగలరా స్వామీ!

అల: నీమాటలు అమృతపుసోనల్లా ఉన్నవి. ఇటువంటిరూపశ్రీకల వ్యక్తిహృదయంలోని కాంక్ష కూడా ఉదాత్తమైందే కాకతీరదు. ఏమిటది?

సిద్ధా: మీరు సకలశాస్త్ర పారంగతులూ, ద్వైతాద్వైతాల నాకర్షించుకున్న పరిపూర్ణమూర్తులూ నట. మీవల్ల నావ్యథతీరే అభయం నాకిస్తారాస్వామీ!

అల: అయ్యా! ఈ అలరు దెవ్వర్నీ మెచ్చలేదింతవరకూ. నీ తృష్ణ ధనమూలకమైందా? చెప్పు! మహారాజుల నాశీర్వదించి, నీకొఱకు ధనపరిగ్రహణం చేస్తాను.

సిద్ధా: స్వామీ! నన్ను మాతండ్రి పువ్వుల్లో పెంచి కాపాడారు. సర్వభోగాలూ నా చేతుల్లో ఉన్నట్లుండేవి. నా ఉద్యానవనంలో ఒక కాసారం నిండా నీలోత్పలాలు. వాటి నైల్యం కన్నులకు కొట్టవచ్చేది. అక్కడక్కడ చెదరిన పిశంగవర్ణం మనస్సులో కలతలు రేపేది. ఇంకో సరస్సులో తెల్లకలువలు. పరిశుద్ధ మనస్స్వరూపంవలెనే అవి తాము కలకలలాడి నన్ను ఆనందపెట్టేవి. ప్రళయరుద్రుని ఫాలాగ్ని రూపొందిన మూర్తుల్లా మరొక కొలనులో ఎఱ్ఱకలువలు, నా టిస్పృశ్యం నాలో మృత్యుఘోషను రేపేది. ఆ పువ్వులన్నీ నాకొఱకే వికసించాలనీ, అక్కడి శుకపికాలన్నీ నా ఆనందంకొఱకే పాడాలనీ మా తండ్రివాంఛ. నా మేన స్వేదకణలవాలను హరించడానికే అక్కడి మారుతం మందమై గర్భభరాలసకు మల్లే సాగివచ్చేది.

స్వామీ! నాకు మూడు భవనాలుండేవి. ఒకటి శీతాకాలవాసానికి. మరొకటి వేసవివిడిదికి. ఇంకొకటి వానకారు గడపడానికి, అక్కడ నాకోసమై లెక్కకు మించిన విలాసినీగణం ఎదురుతెన్నులు చూచేది. వాళ్ళ శరీరలావణ్యం, వాళ్ల కళావైదగ్ధ్యం, నగుమోముల పులకరింతలు, నాకొఱకే నని మా తండ్రి శాసించారట.

నా నోటినుండి ఏ పలుకువస్తే అది ఆచరిత మయ్యేది. నా మనస్సులో తలపుజనిస్తే అది మూర్తిమంత మయ్యేది. స్వామీ నేను యువరాజును.

అలరుడు: వైవాహిక జీవితంలో ఆదరసౌఖ్యాలకు నీవు దూరమయ్యావా?

సిద్ధా: నా అర్ధాంగలక్ష్మి సౌశీల్యానికి పెట్టిన పేరు. నా ప్రాణానికి ప్రాణమై ఆవిడచూపే ఆదరంలో, ప్రేమలో సర్వలోకాలనూ విస్మరించే శక్తి ఉన్నది. నాకొక కొడుకుకూడా ఉన్నాడు స్వామీ. వాడొక దీపం.

అల: ఇక నీకున్న లోటేమిటి? శాస్త్రపారాన్ని చూడాలనుకుంటున్నావా? ఏ విషయంలో నీ మనస్సు అసంతృప్తమౌతూ ఉన్నదో.

సిద్ధా: శాస్త్రాలు నాకెందుకు స్వామీ! నా హృదయంలో రగిలి మండే అసంతృప్తి నవి చల్లార్చలేవు. నాలో జాగరితమైన సమస్యను విడదీయడానికి వాటికి శక్తిలేదు—

ఒకనాడు నా తోటలో ఉదయభానుకిరణ స్పర్శకు లోకం కలకలా నవ్వింది. కొలనులో తామరలు లోకబాంధవునికి ఆహ్వానహస్తాలు చాచినవి. నా పక్కనే ఉన్న స్నేహితుడు లేచాడు. వానిచేతులో శరసంపుటి ఉన్నది. అంసభాగాన్న శరాసనం వ్రేలాడుతున్నది. వాడేదో గురిచూచి శరప్రయోగం చేశాడు. అంతవరకూ నేను గమనించనే లేదు. ఒక పులుగు రాలి క్రింద పడ్డది. దానిది నోరు లేనిజాతి. అయినా దాని ఆర్తరవం నాకు శతాధిక గ్రంథాన్ని చెప్పిన ట్లనిపించింది. ప్రాణం విడుస్తూ అది చూచిన చూపులో సృష్టిరహస్యమే ఇమిడినట్లు తోచింది. ఈ యాతనామయ ప్రపంచంలో జీవికి ముక్తి ఎటూ?

అల: సుఖదుఃఖాలు దేహి సహజాలు. అవన్నీ భగవంతుడే అధినేత అయిన కర్మానుసారులు. లోకంలో అదృష్టవంతుడు దుఃఖంలో కూడా సుఖాన్నే చూస్తాడు. జిజ్ఞాసువు ఆసుఖాన్ని త్రచ్చి దుఃఖానుభవం పొందుతాడు.

సిద్ధా: నిజమేస్వామీ! ఒకనాడు వసంత మాసపు శుభవేళల్లో, నా అంతఃపురంలో— చుట్టూ నాట్యకత్తెలు చేరారు. వారి కాలి అందెల మోతల్లో, పాటల మధురిమలో నా హృదయం తనిసిపోయింది. రెండుజాముల నిశి. ఎప్పుడు కంటికి కూర్కు వచ్చిందో తెలియదు. నిద్ర తేరి కన్నులు విప్పాను—విలాసినులంతా నిద్రా వివశలు. అందొకతె విశీర్ణకేశి! మరొకతె అసంబద్ధ నిద్రాప్రలాపిని! ఇంకొకతె ముఖవినిర్గత లాలాజల! వారి వివశశరీరాలూ వ్యస్తాకృతులూ చూచి 'ఛీ' అనుకున్నాను. జీవికి సుఖానుభవ మెక్కడుంది స్వామీ! తరిచినకొద్దీ దుఃఖం ముంచుకొచ్చే లోకం! సృష్టి ఉద్దేశ్యమే దుఃఖానుభవం!

అల: నీ మాటలు వింటుంటే మనస్సు మొద్దుపారుతున్నది—ఈ శాస్త్రాలూ, వేద పఠనాలూ, చర్చలూ దుఃఖాతీతంగా దేహిని నిలుపవు. ఎవరి మనస్తృప్తి వారిది. వ్యక్తిగతమైన ఊహలనుబట్టి, కొలతలనుబట్టీ వారి, వారికి తృప్తికలుగుతూ ఉంటుంది. ఏదోవిధంగా సరిపెట్టుకుని జీవితయాత్ర చెయ్యడమే పరమలక్ష్యంగా ప్రపంచం నడుస్తున్నది. నీ వ్యథ నా కర్థమైంది—ఉదాత్తమై, పరిష్కార మార్గం ఇంతవరకూ అందని ఆవేదనే నీ మూర్తిని ఉజ్జ్వలితం చేస్తున్నది. తపస్సాఫల్యం కాకుండా పోయిందేమీ లేదు. నీవు శరీరాన్ని కృశింపచేసి ఏకాగ్రత సంపాదించి తపస్సుచేయి. నీ మనస్సున కప్పుడైనా తృప్తి చేకూరుతుందేమో! సత్యమార్గాన్వేషణ నీవల్లనైనా జరుగుతుందేమో! పోయిరావయ్యా! నీవు వెళ్ళినంత మేరా నీకు శుభం!—

## 3

[ఒక వటవృక్షం నీడ, ఒక స్త్రీ ఒడిలో, శల్యావశిష్టుడైన సిద్ధార్థుడు.]

సిద్ధా: అమ్మా!

స్త్రీ: నాయనా, ఎవరునీవు?

సిద్ధా: నేనెక్కడ? ఎవరునీవు? ఇన్నాళ్ళూ నా చుట్టూ పిశాచాలు నర్తిస్తున్నట్లున్నది. అమృతమూర్తిలా నీవెందుకు వచ్చావు తల్లీ?

స్త్రీ: కాస్త విశ్రాంతి తీసుకో. నా పేరు సుజాత. పొలంలో మా ఆయనకు అన్నం తీసుకు వస్తూ నిశ్చేతనుడవై పడిఉన్న నిన్ను చూచాను. ఇదుగో ఈ అన్నం పిసికిపోశాను. నువ్వే కులస్థుడవో, ఉత్తమవంశంలో పుట్టినవాడివనిపించే నీకు అన్నం పెట్టి చేయరానిపని చేశానా? ఇది ఆపద్ధర్మం కద తండ్రీ!

సిద్ధా: నీనొసట ముదిమి ముద్రలు ముద్రించింది. నీకళ్ళల్లో వెలిగే పరిపక్వ కాంతియందు, కులాలు లేవులే తల్లీ! అయినా నేను సర్వమూ త్యజించినవాణ్ణి.

సుజా: నిన్ను కని దురదృష్టవతియై విలపిస్తూన్న తల్లి ఎవరు? నీవు వివాహితుడవేనా?

సిద్ధా: తల్లీ! ఆమె ఎవరో నాకు తెలియనే తెలియదు. తండ్రి—ఆయన ప్రేమ ఎటువంటిదని!—యశోధర, నా హృదయరాజ్ఞి, ఆమె యీ ఆరుసంవత్సరాల వియోగంచే ఇంకా బతికి ఉంటుందా? (మెఱుపు కొట్టినట్లై) ఏమన్నాను తల్లీ! ఈ వ్యామోహాన్ని నేను జయించలేకపోయాను. ఆరేళ్ళ శరీరక్లేశమైనా దాన్ని అధిగమింపలేక పోయింది.

సుజాత: ఆప్తులూ, బంధువులూ మరవరాని వారుగా తండ్రీ! నీ కెందుకు ఈ కష్టమంతా. మరలి

పోరాదూ! నీ రాకకు భార్య సంతోషిస్తుంది. తండ్రి పరవశుడౌతాడు.

సిద్ధా: ఇంతకాలం నా వియోగానికి దుఃఖించినవారు సంయోగానికి సుఖిస్తారు. ఈ సుఖదుఃఖాలెందుకు? ఏమి రహస్యమిది!

సుజాత: సృష్టేఅంత. విధికొక కన్ను దుఃఖమూ ఒకకన్ను సుఖమూ. ఆ సమదృష్టితోనే అది పాత్ర నిర్మాణంచేసి జగన్నాటకానికి సూత్రధారణ చేస్తుంది.

సిద్ధా: ఇంతకూ సుఖదుఃఖాలు దైవకల్పితాలు.

సుజాత: అవును నాయనా! అది ప్రాకృతులకు, దేహానికి ప్రాముఖ్యమిచ్చి జీవయాత్ర సాగించేవారికి. కాని జ్ఞానులసంగతి వేరు. నీవు ఆత్మను చూడు. మనస్సును లక్ష్యపెట్టకు. అప్పుడు నీకు సుఖదుఃఖ ద్వంద్వముండదు. దానివల్ల జీవికి కలిగే మోదఖేదాలూ ఉండవు.

జీవికి ఆత్మే ఆధారం నాయనా. మనస్సు ఆధేయం. మలిన పటాంతర్గతమైనా రత్నం ప్రకాశిస్తుంది. కాని దాని ప్రకాశప్రకటన జరగడానికి ఆచ్ఛాదన తొలగాలి. ఆత్మశక్తి ఎప్పుడూ ఉండేదే. అది నివురుకప్పిన నిప్పు తండ్రీ!

సిద్ధా: నీ వెవ్వరవు? — ఎంతోమంది యీ మాటలే చెప్పారు. కాని నీమాటల్లో ఏదో ఆకర్షణ ఉన్నది. నేను ఆలోచించాలి తల్లీ!

ఆరేళ్ళనుండీ నా శరీరం శుష్కించింది. కఠోర నియమావలంబినై అది అశక్తమై పోయింది. కాని మనస్సు ఒక్క అంగుళమైనా అభ్యుదయపథాలకు జరగలేదు. ఈనాడు నీ చేతి అన్నం నాకు జ్ఞానోదయం కలుగజేస్తుందేమో! అమృతమూర్తివి నీవు దీవిస్తే, నేను సర్వథా కృతకృత్యుణ్ణవుతానన్న ఆశ నాలో ముమ్మరంగా ఉంది.

సుజాత: సత్యాన్వేషికి శాంతం ప్రాణం వంటిది. దానివెనకనే ఫలం ఉంటుంది తండ్రీ. ఏక్షణంలోనూ నువ్వు ఉద్విగ్నుడవు కాకు. శుభం అవుతుందినీకు. నీవు పోయినంత మేరా దేవతలు పూలబాటలు దిద్దుతారు.

[ఎక్కడో ఒక్క పెట్టున ఘంటానాదం. సిద్ధార్థునికన్నులలో దీపంగా వెలిగే ఆశాజ్యోతిస్సులు. ఆయనముఖంలోపోయిన ముప్పదిరెండు కల్యాణలక్షణాలూ తిరిగివస్తవి. ఎట్టఎదుట బోధివృక్షపు ఆకులూ, చిగురులూ, హస్తాలై ఆయన్నాహ్వానిస్తవి.]

# ఇంద్రగ్రహ ప్రభావము

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

కొన్నాళ్లకు పూర్వము నేనొక నగరములో నున్నప్పుడు, అచటి నా మిత్రు డొకడు అప్పుడప్పుడు నా కడకువచ్చి జ్యోతిషవిషయములను చర్చించుట వాడుక. ఒకనాడు ఒక అపరిచిత వ్యక్తి అతని వెంబడి వచ్చినాడు. ఆ క్రొత్తమనుష్యు డొక విద్వాంసుడనియు, గౌరవప్రదమైన వృత్తిగల ఉద్యోగి అనియు, జాతకశాస్త్రములో అభిమానము గలవా డనియు, తన స్నేహితుడనియు, నా మిత్రుడు నా కతని పరిచయముచేసెను. రమారమి ముప్పది అయిదు దాటి నలుబది లోపుగా వయస్సు కలవాడా వ్యక్తి. వయస్సునకు తగినంత ముఖము ముదిరియుండలేదు. అందమైన ఆకార సౌష్ఠవము, మార్దవ కోమలత్వముల తోటి తెలివితేటలను సూచించు ముఖవర్చస్సు, సరసమై, యుక్తియుక్తమైన వాగ్ధోరణి, జనరంజకమైన హసన్ముఖము కల వ్యక్తి అతడు. గురు, బుధ, శుక్రులదృష్టి సంబంధము సమృద్ధిగా లగ్నమునకు గల జాతకుడుగా అతడు చూపట్టినాడు. వయస్సులో, విద్యలో, వృత్తిలో, ఇంచుమించుగా సమానులయినా, కరుకుమాపులు, పెడసుమాటలు, గడుసుముఖము కల నా మిత్రునితో పోల్చినచో, వారిరువురికిని అమావాస్యకు పూర్ణిమకు, ఉన్నంత తారతమ్యము కానవచ్చుచుండెడిది

వారు సుఖాసీనులయిన తరువాత, మేము లోకాభిరామముగా కొంతప్రొద్దు కాలక్షేపము చేసితిమి. క్రమముగా, జాతకములు, సాయన నిరయన పద్ధతులు, ప్రాచ్యపాశ్చాత్య సంప్రదాయ భేదములు, నూతనగ్రహములు, మున్నగు విషయములపై కొంత చర్చ సాగినది.

“నెప్ట్యూనుకు ఇంద్రుడని ఎవరు పేరుపెట్టినారండీ?”

నూతనమిత్రుడు ప్రశ్నించెను.

“సుప్రసిద్ధ ప్రాచ్య పాశ్చాత్య జ్యోతిశ్శాస్త్రవేత్తఅయిన కే. శే. కేతకరు పండితుడు తాను రచించిన ‘జ్యోతిర్గణితి’ మను సంస్కృత గ్రంథములో యురేనస్సునకు వరుణుడనియు, నెప్ట్యూనునకు ఇంద్రుడనియు, నామకరణముచేసి, ఆ గ్రహముల చారక్రమమును తెలుపు పట్టికలను గుణించి యున్నారు.” అంటిని.

“ఆ గ్రహస్వభావమేమి?”

ఆ గ్రహస్వభావమును గుర్తెరిగి చేసిన నామకరణమే అది. సామాన్యముగా, మన పురాణవాఙ్మయములో వర్ణించబడిన ఇంద్రుని గుణములు మనము జ్ఞప్తిలో నుంచుకొన్నచో, ఈ గ్రహస్వభావము మనకు కొంత బోధపడగలదు

ఇంద్రుడు గొప్పశక్తిగల లోకపాలకుడు. ఐశ్వర్యము, భోగము అతనిసొమ్ము. అప్సరసలు, నందనోద్యానము, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి, ఇవి అన్నియు అతని ఆధీనములోనివి. అమృతభాండమునకు అతడే అధికారి. త్రిలోక విజయియగు మన్మథుడు ఇతని మిత్రుడు. నాట్యము, సంగీతము, ఇవి అతనిసభలో పుట్టి పెరిగినవి. గంధర్వులు, కిన్నరులు, అతని కింకరులు, నవ నిధుల కధిపతి అయిన కుబేరుడు అతని ఆజ్ఞాపాలకుడు. వైభవమునకు ఇంత చాలదా?

కాని, ఇంద్రుడు మహా మాయావి. కన్నులు మూసికొనియుండినపుడు సయితము అతడు మిన్నయాకని పెట్టగలడు. అతనిదేహమంతా దృష్టియే. ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలకు ఆచార్యుడితడే! కనుకట్టు, గారడీ, టక్కు, టమారువిద్యలలో నిష్ణాతు డితడు. ఈ విద్యలతోనే చాలవరకు తన కార్యములను సాధించుట ఇతని అలవాటు. సమయానుకూలముగా, ఏ వేషమైనా క్షణములో వేసి పరులను కను భ్రమగల శక్తి యున్నది. ఇంద్రుడు తన మహోగ్రాసురలను ఒడ్డేనని, దానిలో తగులుకొనని తపోధనులు కాని, పతివ్రతలు కాని, అరుదు. సౌందర్యవతులగు భార్యలుగల మహర్షులు కొంతకాలము తమ ఆశ్రమములను వదలి

పోవలసి వచ్చినపుడు, తమ భార్యలు ఇంద్రుని మాయగారితనము పాలుగాకుండ తగు జాగరూకత తీసుకొనెడివారట! ఇట్టి పరిస్థితియొకటి తన్నెదుర్కొనినప్పుడు, నవయౌవనవతియగు రుచియను తన అర్థాంగిని ఇంద్రుని బారిపడకుండ కాపాడుమని, శిష్యుడగు విపులునికి బోధించిన దేవశర్మయను మహర్షి ఇంద్రుని స్వభావమును గూర్చి చెప్పిన వాక్యమిది:

"పురందరంచ జానీతే,
పరస్త్రీ కామ చారిణం.

*                    *

బహుమాయస్స విప్రర్షే,
భగవాన్ పాకశాసనః.

తాన్స్తాన్ వికురుతే భావాన్,
బహూనపి, ముహుర్ముహుః."

[మహాభారతము - ఆనుశాసనిక పర్వము - నలుబదియవ అధ్యాయము - విపులోపాఖ్యానము.]

ఇంతేకాదు. "అందితే జుట్టు, అందకపోతే కాళ్లు." అను సంప్రదాయము ఇంద్రునిది. సమయము వచ్చినచో, భిక్షమెత్తిగాని, ఊడిగము చేసికాని, తన పనిసాధించకల మహానుభావుడితడు. పురుగుగావచ్చి పులిగా గాండ్రించగలడు; కోడిగాకూసి కోడెకాడుగా రమించగలడు. పరాక్రమముకాని, మోసముకాని, ఫలించనిపట్ల, పరమభక్తుడై-

'అన్యథా శరణం నాస్తి, త్వమేవ శరణంమమ.'

అని హరికో, హరునికో, గట్టిగా మొరబెట్టి కార్యము సాధించు యుక్తి సయితము బాగుగా ఇతనికి అలవాటే. ప్రభువులలో భోగి; యోగులలో భక్తుడు; రాగులలో రసికుడు; కార్యసాధకులలో మాయావి.

ఇట్టి ఇంద్ర స్వభావమును ఉపలక్షణముగా గ్రహించితిమేని, ఇంద్రగ్రహ స్వభావము మన కాలములో ఏరీతిగా జాతకములలో వ్యక్తము కావచ్చునో, కొంతవరకు సులభముగా మనము ఊహించుకోగలము.

ఒక్క మాటలో చెప్పదలచినచో, ఈ ఇంద్రగ్రహమును 'ఆనందగ్రహము' అనవచ్చును. లలితకళలవలననో, శృంగార విలాసములనుండియో, భక్తిమూలముగనో, భంగిప్రభావముతోనో, మనోలయమును సంపాదించి ఆనందించు స్వభావము ఇంద్రగ్రహ ప్రాధాన్యముగల జాతకులకు సాధారణధర్మము. జీవితమును స్వప్నముగగాని, స్వప్నమును వాస్తవజీవితముగగాని, అనుభవించు శక్తి వారికి కలదు. అనిర్వచనీయమైన ఆనందమును అనుభవగోచరము గావించుకొనుటే వారి పరమలక్ష్యము.

"ఎంచే డెందము కందళించు రహిచే
నేకాగ్రతన్ నిర్వృతిన్,
జెందున్ కుంభగత ప్రదీపకళికా
శ్రీదోప నెందెందు బో,
కెందే నింద్రియముల్ సుఖంబుగను
నాయింపే పరబ్రహ్మ"

మను పద్ధతి వారిది. ఆనందబ్రహ్మోపాసకులు వారు. సాధించునది ఆనందమయినా, ఆనందాభాసమైనా, ఆదర్శమొక్కటే. రామరసముకాని, 'విస్కీ' రసముకాని, ఫలము సమానమే. బాహ్యప్రపంచవాసనలు మనుస్సున కంటని మైమరపు వారు కాంక్షించునది. రాగములో, యోగములో,—కడకు రోగములో సహా—వారు సంపాదించు ఫలము ఇట్టిదే.

ఇష్టార్థము సాధించు విషయమున ఇంద్రగ్రహ కార్యములో ఒక చమత్కారమున్నది. ఇతరులకు నొప్పి కలుగకుండ, సాధ్యమైనచో, ఇతరులకు తెలియకుండ, మహాచాకచక్యముతో పనులు నిర్వహించబడును. ఫలము చూపట్టుదాక ఇంద్రగ్రహప్రేరితమగు కార్యములోని అంతరార్థముకాని, ఉద్దేశముకాని, మనకు గోచరించదు. అది సి. ఐ. డి. వారి పద్ధతి. వేషము, భాష, పేరు, ముఖభావము క్షణములో మార్పు చెందగలవు. కనుకనే, ఇట్టి వ్యక్తులు చేయబూనిన కార్యములు ఫలించినప్పుడు, మనకు అది రుచించకపోయినా, మనము దానికి ప్రతిక్రియ చేయజాలము. విశేషమేమనగా, ఆ ఫలమునకు వారు కారణభూతులని మనము కనుగొనలేము; చూచినా గ్రహించలేము. వారి ప్రవర్తనము నిగూఢము; పద్ధతి ప్రచ్ఛన్నము. జరిగిన కార్యమునకు మరి ఎవరో బాధ్యులని ఇతరులకు తోచునట్లుగా, అతి చాతుర్యముతో వారు ప్రవర్తింతురు. కాలక్రమమున, వారి కైవాటమును మనము గుర్తించగలిగినా, అప్పటికి గతజల సేతుబంధన మగును. అమాయకులుగా వారు కనుపింతురు. వారు ఇతరులను వంచించ

గలరని జనసామాన్యమునకు స్ఫురించదు. మోస పోతిమే యని పశ్చాత్తాపపడుట తప్ప, మన మపుడు చేయగలిగినది ఏదియు నుండదు. కాని, వారి ప్రవర్త నములో మోసమో, ద్రోహమో, కలదని భావించు టకు మారు, వారి ఇంగితమును సూక్ష్మముగా గ్రహించు శక్తి మనకు లేదనుకొనుటే సమంజసము. వాస్తవము విచారించితి మేని, ఇతరులను మోసగించు నుద్దేశము వారికి లేదు. తగినంత ఊహాశక్తి లేనివారై ఇతరులు విషయమును గ్రహించనిచో, వారేమి చేయగలరు?

కార్యము సాధించు విషయమున ఇంద్రునిశక్తి అసాధారణము. దాని పద్ధతి కుసుమముకంటె సుకుమారమైనది; వజ్రముకంటె కఠినమైనది; ఆకాశము కంటె విశాలమైనది; సూదిమొనకంటె సూక్ష్మమైనది. ఈగ్రహము కైవాటములో పూలమాలిక ఉరి త్రాడగును; కటాక్షధార కరవాలధారగా మారును; పానకము విషముగా పరిణమించును; ప్రాణమిత్రము పరమ శత్రువుగా ఏర్పడును; గరికపోచ గండ్రగొడ్డలిగా పనిచేయును; రాగాలాపనము రాజ్యము సాధించును; పద్యములతో పరరాజులు పలాయన మగుదురు; బొంతజెముడుపాలలో బంగారము పొంగును. వేయేల? అనేకసందర్భములలో ఊహాతీతమైన సంఘటనలు జరుగగలవు.

ఊహాప్రపంచములో సయితము ఇంద్రగ్రహ కార్యములో ఒక వైచిత్ర్య మున్నది. సర్వసాధారణమైన సత్యము అతని దృష్టికి చాలదు. అతని ఊహ నిరంకుశము. దానికి తోచిన సత్యమే సత్యము. పని చేసినా, మాటలాడినా, ఈ భావముతోనే! ఇతరులకు అది అసత్యముగా తోచెనేని, అందలి తత్త్వమును గుర్తించలేని దోషము వారిదే.

కావుననే, కవులు, గాయకులు, శిల్పులు, యోగులు, భోగులు, కోటీశ్వరులు, రాజనీతిజ్ఞులు, మున్నగువారికి ఇంద్రుని అనుగ్రహము గొప్ప విలువ కలది. జాతకములో ఈ గ్రహమునకు ప్రాధాన్యము వచ్చినపుడు ఇతరగ్రహముల సహకారమునను సరించి దీనిశక్తి నానాస్వరూపములతో తన వైశిష్ట్యమును వ్యక్తము చేయగలదు. లోకమోహనముగా రాగమును ఆలాపనచేయుచు శ్రుతిలయమును సాధించి తన్మయత్వమును పొందు 'గాయకగాయనీమణులు' ఇంద్ర వరప్రసాదమును చూరగొన్నవారు. అమృతములో విషజ్వాలను, హాలాహలములో అమృతరసమును, చూపింపగల భావకవుల కమనీయ కవితాధారాప్రవంతిలో ప్రవహించుచునది ఇంద్రుని ప్రభావమే. పసుమవారికొళ్ళకు బంపాలు తగిలించు కామినీ మణుల కొంటెకంటి కటాక్షవీక్షణ ప్రవాహపు కెరటాలలో తేలియాడునది ఇంద్రతేజస్సే. తృణమును కనకముగా, కనకమును తృణముగా, భావించి అనిర్వచనీయానంద మనుభవించు తపస్విద్రుడు ఇంద్రుని మహిమకు లోబడిన వ్యక్తియే. సభలలో అతిరథ మహారథు లనదగిన ప్రతిపక్షీయు లెందరు వాదించినా, ఎంతటి క్లిష్టసమస్యలైనా, నెమ్మదిగా, చల్లగా, ప్రత్యుత్తరము చెప్పి, తన తంత్రము బైలుపరచక, పరులతంత్రములను సాగనీయక, మెలకువతో తేలిపోవు రాజనీతి నిపుణుడు ఇంద్రుని కళాశాలలో పట్టభద్రుడు. కుచేలుడుగా నిద్రించి కుబేరుడుగా మేలుకాంచిన అదృష్టశాలి ఇంద్రుని అవ్యాజ కృపాకటాక్షమును సంపాదించినవాడు. పేడిముఖముతో పౌరుషమును చూపినా, సన్యాసివేషముతో అంతఃపుర కాంతలను సవరించినా, అట్టి వ్యక్తిలో ఇంద్రుని చాతుర్యము చూపట్టును. అంతేఏల? నామకార్థముగా మీనము, మేషమని వ్రేళ్లెంచి, భూతభవిష్యత్ఫలములను చెప్పగల అతీంద్రియ జ్ఞానసంపన్నుడగు జ్యోతిష్కుడు సయితము ఇంద్రుని వరప్రసాదమున జనించినవాడే యగును.

కాని, జాతకములో ఇంద్రుని శక్తిని ఇతర గ్రహములు ప్రబలముగా అరికట్టినపుడు, నానావిధములుగా విప్లవము బయలుదేరగలదు. మనోదౌర్బల్యముగలవారిలో అట్టి విప్లవశక్తి మానసికముగా వ్యాధిరూపము దాల్చి, భూతావేశము, హిస్టీరియా, ఉన్మాదము, మూర్ఛ, ఇత్యాదిరూపములతో వ్యక్తమగుచున్నది. ఒకవైపు చూచుచున్న రీతిగా మనకు అగుపడినా, వేరొకవైపు జరుగు కార్యములను గమనించు విపరీతదృష్టి ఇంద్రునిదోషమే. ధైర్యసాహసములు గల వ్యక్తులలో ఇంద్రుని దౌష్ట్యము వేరు స్వరూపము ధరించగలదు. తమపద్ధతితప్ప, ఇతరుల పద్ధతులన్నియు

సంస్కరించ బడవలయునని వాదించు సాంఘిక, నైతిక, రాజనీయ, తీవ్ర విప్లవవాదులు ఈ తెగకు చెందినవారు. మరాఠా పీడితులలో ఇట్టి ఇంద్రవేధ కూటమార్గముల మూలముగా ధనమును పోగుచేయు వృత్తికి దారిచూపగలదు. లంచగొండితనము, నీలివర్తకము, మున్నగు మార్గములు ఈ జాతికి చేరినవి. కామమోహితులకు ఇట్టి ఇంద్రవేధ వచ్చెనేని, అది త్రొక్కించని చోటే యుండదు; అనుభవించని రుచియే కానరాదు. ఆధ్యాత్మ విచారముపై అభిమానముగల వారికి ఇంద్రవేధ యుండెనేని, తాము అవతార పురుషులమనియు, సామాన్య మానవులను సంసార సముద్రము నుండి ఉద్ధరించుటకై, ఏ కైలాసశిఖరమునుండియో, ఏ వైకుంఠపురమునుండియో, దిగివచ్చి మానవజన్మ స్వీకారముచేసి నారనియు, పిచ్చినమ్మకము వచ్చును.

సారాంశమిది. మంచికే కానిండు, చెడ్డకే కానిండు—అసాధారణ పరిస్థితులు కానవచ్చినచోట, సత్యాసత్యములు తారుమారైనచోట, ఆత్మవంచనమో పరవంచనమో పొతగట్టినచోట, సామాన్యముగా ఇంద్రుని ప్రభావము కానవచ్చుననుట! అయినా, ఇతర గ్రహకార్యములు గుర్తించగలిగినంత సులువుగా, ఈ గ్రహకార్యము మనము గమనింపజాలము. జన్మచంద్రునిపైననో, లగ్నముపైననో, గోచారములో ఇంద్రుడు వచ్చినప్పటి అనుభవము గలవారికి మాత్రము ఇంద్ర గ్రహతత్త్వము సులభముగా అవగతము కాగలదు.

అతి విచిత్రముగా నా వ్యాఖ్యానము ఇట్లే మరికొంత కాలము జరిగియుండెడిదేమో? కాని ఆ నూతన వ్యక్తియొక్క శూన్యదృష్టి అతని మనుస్సు విషయాంతరాసక్తమైనదని సూచించుటచే, అంతటితో నా ప్రసంగమును ఆపితిని. అతడంత నా మిత్రునిచూచి,

"ఆ...జాతకముల మాట..." అని ఎందుకో వాక్యము పూర్తిచేయలేదు.

"రెండు జాతకములున్నవి. ఇపుడు చూచుటకు వీలున్నదా?" అని నామిత్రుడు నన్నడిగెను.

"కన్యావరులా?" అంటిని.

"కాదండీ! భార్యాభర్తలు." అని ఆ నూతన వ్యక్తి రెండు జాతకములకు జన్మదినము మున్నగు సామగ్రిని తెలుపగా గుర్తువేసుకొంటిని. పురుషుడాంధ్రదేశములో, స్త్రీ దక్షిణదేశములో జనించినవారు. నాకేదో స్ఫురణకురాగా, నా యొద్దనున్న జాతకముల సంపుటములలో వెదకితిని. ఆ సామగ్రికి సరిపడు రెండు జాతకములు కానవచ్చినవి. అవి వారికి చూపుదు,

"ఇవేనా మీరు చెప్పు జాతకములు?" అని అడిగితిని. వారిరువురు ఆశ్చర్యపడిరి. కుతూహలముతో ముఖమింత పొడవు చేసుకొని, ఆ నూతనవ్యక్తి "మీకెవరిచ్చిరి?" అనెను.

"వీరి వివాహ మెప్పుడైనదో తెలుసునా?"

"ఆహా! — ఫిబ్రవరి, 19వ తేదీ—ఉదయము 8.30 గంటలకు." తడవుకొనక వెంటనే అతడు ప్రతిఇచ్చి, కొంత ముఖభావము మారగా, బొమలు చిన్నగా ముడివేసి, ఆత్రముగా,

"ఇవి ఏ సందర్భములలో వచ్చినవి?" అని ప్రశ్నించెను.

"ఇవే ఆ జాతకములు. వివాహ ముహూర్తపు కుండలి సయితము వేసి యుంచితిని."

| | | | |
|---|---|---|---|
| | I 1-40 | | వ 4 51<br>కు 13-6<br>శ 19-41 |
| ర 29-21<br>బు 9-20<br>కే 5 39 | (సాయనము) | | |
| శు 26-52<br>X 1-15 | ముహూర్తము | | రా 5-53<br>గు 21-7 |
| చ 21-40 | | ఇ 3-44 | |

అచక్రములు వారు మూడసాగిరి, ఆశ్చర్యముతో.

రమారమి రెండేండ్లకు పూర్వము కొందరు మిత్రులగోష్ఠిలో దుర్ముహూర్తములలో జరిగిన వివాహములనుగురించి ప్రశంసరాగా, ఉదాహరణార్థమై, వారిలో నొక మిత్రుడు ఒక వివాహకాలపు వివరములను తెలిపినాడు. ఆ ముహూర్తపు కుండలి ఇది:—

ఇంద్రుని యాజమాన్యములోని దశ జ్యేష్ఠానక్షత్రపు నాల్గవపాదములో, గండసంధిలో, చంద్రుడుండగా జరిగిన వివాహ మిది. దీనికి దుష్ఫలమును పెద్దలు చెప్పిరి. తొమ్మిది పది సంవత్సరములలో వియోగము వచ్చునట!

"ఐంద్రే పతినా సార్థం, కష్టా
　　　న్యనుభూయ, కన్యకాదశమే.
వర్షేసా వైధవ్యం, సమేతి,
　　　నో చేన్మృతానవమే."

అని ప్రాచీన సూత్రము. ఈ చంద్రునికి పట్టిన ప్రారబ్ధము అంతటితోనే ముగియలేదు; సమసప్తకములో క్రూరులగు కుజ శనుల వేధయున్నది.

"వైధవ్యం, నిధనం వా,
శిఖికోపం, భూమిజఃకురుతే,
మందః, పర సంతాపం,
పతివిభ్రష్టా, మపుత్రాంచ."

అను సూత్రము కుజ శని వేధకు గొప్ప దుష్ఫలము నే సూచించుచున్నది.

ఇట్లుండగా, సప్తమభావములో ఇంద్రుడుండుటచే, సప్తమశుద్ధి లేదను మహాదోషము ముహూర్తమునకు గట్టిగా పట్టినది. ఇంద్రగ్రహమును మన మౌహూర్తికులు నిరాదరించినా, దోషము దోషమే! కన్నులు మూసుకొని ముట్టినా, నిప్పు చురుక్కుమనక మానదుకదా? ఇట్టి ఇంద్రదుమహాశయునికి వరుణుని మైత్రితోడు,—అగ్నికి వాయువు తోడైనట్లు. ఇట్టివారి అధ్వర్యములో జరిగిన వివాహమువలన సంసారములో ఎంత సౌఖ్యముబ్బునో, మనము ఊహించగలము.

వేలమునకు తిలోదక ప్రదానము ఫలము. సమిష్ఠిన చోటనే, ద్రోహము పుట్టగలదు. సంభేదానుసరణ అవకాశము రాకపూర్వమే, చల్లగా నాటక కథా కలాపమంతయు నిర్విఘ్నముగా నేరవేరును. భరత వాక్యము వినునప్పటికి కాని, స్వప్నలోకములో నున్న వారు మేలుకొనరు.

నెత్తికి పెట్టి వారా అనునట్లు, 'విషనాడీ' కాలములోనే వివాహముహూర్తము నిర్ధరించబడినది. దాంపత్యములో విషబీజములు నాటిన రీతిగా తగిన ఫలమే రావలసియుండును.

అయినా, ముహూర్తఫలము స్వతంత్రము కాదు. వ్యక్తుల జాతకదశల ననుసరించియే, ముహూర్త దోషము వ్యక్తము కావలయునను శాస్త్రసంప్రదాయము.

"తిథి వారర్ష లగ్నాదే,
ర్యదుక్తం సదసత్ఫలం,
తత్సర్వం, జాతకాధీనం,
నస్వతః ఫలదం మతం."

అని పెద్దలు నిర్వచించిరి.

దంపతుల జాతకములలో అన్యోన్యానుకూల్యమును సూచించు యోగములు చక్కగా నుండెనేని, ముహూర్తదోషమువలన గొప్పప్రమాదము రాకపోవచ్చును. జీవిత ధర్మములోనో, పరిస్థితులయందో, ఇంద్రదోషము పొటమరించినా, ఏదోరీతిగా, సర్దుబాటు జరిగి కథ సాగిపోగలదు. అట్లుకాక, వారి జాతక గ్రహములకు ప్రబలవేధ యున్నచో మాత్రము, ఈ ముహూర్తదోషము దాంపత్య బంధమును పెడదారి పట్టించి దుఃఖహేతువగుట నిస్సంశయము. వివాహానంతరము అయిదారు సంవత్సరములలో చలిత రవికి వరుణకేంద్రవేధ రాగలదు. చలిత శుక్రునికి కేతు సంయోగపు దౌర్భాగ్యము వరుణునికి త్రికోణ దృష్టివలని ఉత్తేజనము, అప్పుడే సమకూరగలవు. సంసారనౌక తుపానుపాలు కావచ్చును; రహస్యము రచ్చకెక్కవచ్చును; వియోగము ఫలము కావచ్చును.

నా సూచనలువిన్న నా మిత్రుడు ఆ దంపతుల జాతకములను నాకప్పుడు చూపెను. ఆ కుండలులు ఇవే.

| | | | |
|---|---|---|---|
| దాం. స. 11-44 | | శు 11-45<br>గు 20-54<br>బు 23.10<br>చ 25-1<br>ర 29-5 | కు 5-32 |
| వ 23.41 | [సాయనము] | | యమ 3-11<br>కే 13-0<br>భా. స. 13-7<br>శ 26-18 |
| I 23-38<br>రా 13.0 | పురుష జాతకము | | ఇ 2-23 |
| | X 4-25 | | |

| | | | |
|---|---|---|---|
| వ 24-43<br>X 20-0 | | భ. స. 8-28 | I 26 1<br>చ 29-27 |
| కే 3-41 | (సాయనము) | | యమ 14-3 |
| గు 13-42 | స్త్రీ జాతకము | | రా 3-41<br>ర 21-32<br>ఇ 22-18 |
| | శ 8 33 | దాం. స. 0 42 | కు 1-15<br>బు 8-52<br>శు 21-22 |

సూచిక:—

(*i*) దాం. = దాంపత్య సహమము.

(*ii*) భ. స = భర్తృసహమము.

(*iii*) భా. = భార్యాసహమము.

---

పురుషజాతకములో లగ్నముపైన గురు బుధుల త్రికోణ శుభదృష్టి నిండుగా నున్నది. బుధ శుక్రులకు పరివర్తనము కలదు. అయిదు గ్రహములు శుక్రరాశిలో నున్నవి. మొత్తముమీద, ఎనిమిది గ్రహములు, లగ్నము సహా, సమ (స్త్రీ) రాసులనే ఆశ్రయించుట! ఆకారసౌష్ఠవము, మృదుస్వభావము, సరసవాక్కు, సాధుప్రవర్తనము, జాతకునిలో సమృద్ధిగా చూపట్ట వచ్చును. చక్కని తెలివి గల విద్యావంతుడని గురు బుధుల దృష్టి తెలుపగలదు.

లగ్నాధిపతి శని సప్తమభావములో నున్నందున భార్యవిషయమున ఇతని అభిమానమునకు కొరత యుండదు. లగ్న సప్తమాధిపతులకు గల అర్ధ కోణ దృష్టి పైయోగమునకు ప్రాబల్యము నిచ్చుచున్నది. పంచమభావమందలి శుక్రుడు విలాసప్రియుడు, కామ కళాలోలుడు. ఇవి అన్నియు బాగున్నవి.

కాని, లగ్నాధిపతియొక్క సప్తమస్థితి విధురత్వమును తెచ్చిపెట్టగలది. రవి వృషభస్థితి స్త్రీద్వేషమును తెచ్చునని వరాహమిహురునిమతము. సప్తమాధిపతి చంద్రుడు ఆ రవిసంయోగమునే అభిలషించుచుండుటయు, ఆసంయోగము అపరిహార్య పురాకృత దుష్కర్మానుభవమును సూచించు వృషభరాశి 29 వ భాగలోనే జరుగుటయు, కళత్రక్లేశమును తెలుపజాలినవి. దాంపత్యసహమము శనితో సార్ధకేంద్ర విషమ దృష్టిలో నుండుట, భార్యాసహమము సప్తమభావములో కేతుసంయోగము నొందుట, ఇవి విషాదకరములు. భర్తకు దాంపత్యసుఖము లేదనియు, భార్యకు కేతువు మోక్షమార్గము చూపుననియు, అర్థము కాబోలు? విషయ సుఖస్థానమును వ్యాపించిన వరుణ బుధకేంద్రము సూచించు 'తృతీయపంథ' సంసారములో చిక్కులువచ్చుటకు కారణమేమో?

ఇక, స్త్రీజాతకమును చూతము. మిథున లగ్నములో చంద్రుడు. విలాసవిహారలోలత్వము, మట్టుపువివేకముతోటి మనశ్చాంచల్యము, సామాన్య స్వభావము. కుటుంబాధిపత్యము చంద్రుని చే. ఇతనిలగ్నస్థితికి స్వకుటుంబకంటకత్వము, పరకార్యతత్పరత, కామచారిణీత్వము, నిష్ఠురహృదయము, ఫలములని పరాశరునిసిద్ధాంతము. సప్తమాధిపతి గురువు అష్టమభావములో నుండుటచే, పురుషసంబంధమువలన అనారోగ్య ప్రాప్తిసూ

చితమగును. బలవంతుడైన రవి తృతీయాధిపతి. స్థైర్య సాహసములు, రాజసప్రకృతి, ఇతనిఫలము. బలవంతుడగు లగ్నాధిపతితో, నీచుడైన సప్తమాధిపతిని పోల్చినచో, భర్తపైన భక్తి తాత్పర్యములు తక్కువ యని ఏర్పడుచున్నది. చండశాసనుడగు వరుణుడు దశమ కేంద్రములో నుండుటయు, రవి బుధులు ప్రబలులగుటయు, గమనించితిమేని, ఈమెకు భర్తను నిర్లక్ష్యము చేయు గుణము వచ్చునని తోచును. విషయ సుఖస్థానాధిపతి శుక్రుడు నీచపడుటచే కాక, వరుణుని సమసప్తక వేధపాలగుటచే, ఆకస్మిక ప్రబలాకర్షణమునకు లోబడు స్వభావమున్నదనవచ్చును. చంద్రునికి సయితము వరుణుని కేంద్రవేధ యుండుట నైపె యూహను బలపరచుచున్నది.

ఇది ఇట్లుండగా, భర్తృసహాయమునకు నికరముగ సమసప్తకరేఖలో నున్న శని భర్తనుగూర్చి ఈమెకు మనోవికాసము కుంటుపడునని సూచించును. ఆ శని వృశ్చిక రాశియందుండు కారణమున, దాంపత్య జీవితమునందు సామరస్యాభావము కారణము కావచ్చును. ప్రాపంచికముగా అందని ప్రేమనాకాంక్షించు చిత్తవృత్తి, నైతిక నియమములు నిరాదరించు ప్రవర్తనము, నచ్చిన దైవముపైనగాని, నచ్చిన వ్యక్తిపైనగాని, భక్తిపరశతను అలవరచుకొను స్వభావము, ఇవి ఇంద్ర రవుల సంయోగము అనుగ్రహించగలదు. గానము, నృత్యము, భజనలు, తాంత్రిక పూజలు, సినీమా రంగము, మున్నగునవి అతి సులభముగా ఈమెను ఆకర్షించగలవు. సకారణముగనో, అకారణముగనో, శీలమునుగూర్చిన అపవాదులు, ఆడికకలు సిద్ధమగును. కాని, అవి సరకుచేయు జాగరూకత జాతకురాలికి లేదు.

ఈ సామాన్యధర్మముల నట్లుంచి, ఈ రెండు జాతకములను జోడించి చూచుట ప్రకృత సందర్భములో ప్రయోజనకారి. కాని, ఎంత వెదకినా, దాంపత్య జీవితమునకు పోషకము లనదగిన యోగములు పరస్పరముగా వీరి జాతకములలో కానరాకున్నవి. భర్తగారి రవి, చంద్ర, బుధ గురువులకు భార్యగారి ఇంద్ర రవులనుండి ప్రబలమగు కేంద్రవేధ యున్నది. పురుష వరుణునితో స్త్రీ ఇంద్రరవులకు నేరుగా సమసప్తకవేధ కలదు. స్త్రీ వరుణునితో పురుష శుక్రునికి కేంద్ర సంబంధము! ఇవి చాలు— వీరిది అతుకని సంబంధమని గంట వాయించి చాటించుటకు. రవి వరుణవేధ భార్యాభర్తలకు వియోగము తెచ్చిపెట్టినచో, ఆశ్చర్యము లేదు.

ఇంత చాలక, వీరికి పరస్పరముగా వృషభ కుజునితో వృశ్చిక శనికి సమసప్తక వేధాసంబంధము ప్రబలముగ నుండుట గమనించదగిన విశేషము. దాంపత్య జీవితములో, శారీరకముగా, మానసికముగా వైరస్యమును, అతృప్తిని తెచ్చిపెట్టగల యోగమిది.

ఇట్టి పరిస్థితులలో, ఇందుకు తగిన ముహూర్తమునే, ఏ మహానుభావులో సిద్ధపరచి ఇచ్చినారు వీరికి! వివాహకుంపటిలో కుజ శని సంయోగమునకు సమసప్తకములో నున్న చంద్రుడు ఈ ఫలమునే సూచించగలడు. స్త్రీ జాతకములోని ఇంద్రుని వేధాఫలము వైవాహిక జీవితములో ప్రవేశించగలదని, వివాహముహూర్తములో సప్తమశుద్ధిని విరచిన ఇంద్రుడు ఉద్ఘోషించుచున్నాడు.

దేవమాని వేళలో చలితలగ్నము జన్మవరుణ సంయోగములో నున్న విషమవయస్సులో పురుషునికి వివాహము జరుగుట! భర్తృస్థానాధిపతి గురువు చారవశమున జన్మకాలమందలి ఇంద్రరవుల సంయోగములో నున్న దుష్టగోచార కాలములో స్త్రీకి వివాహము! ఫలము తగినదే లభించునుగదా? అతుకని కాపురము, నామకార్థపు సంసారము, లోకాపవాదము, వియోగప్రాప్తి;—ఇట్టి పరిణామము కలిగెనేని, వింతయుండదు.

నా ఊహలను విని జాతకసామగ్రిని ఇచ్చిన మిత్రుడు మాకు తెలిపిన కథ ఇది:—

జాతకురాలి భర్త పరమసాధువు; మంచి సరసుడు; అందగాడు; గౌరవకరమగు వృత్తిగల విద్యావంతుడు. భార్య సయితము మంచిరూపవతియే. ఆమె కిది రెండవ వివాహమను గుసగుసలున్నవి, కాని, సత్యము తెలియదు; సుమారు ఇరువది వయస్సులో ఇతనిని

వివాహము చేసుకొన్నది. ఏమోకాని, కాపురము చేరిన నాటినుండి ఆమెకు అతృప్తి. 'ఒకటిపోయి రెండవది వచ్చినా, సుఖములేదు.' అని ఆప్తసఖులతో ఆమె అనుకొనెనట! పొరిగింటిలో కాపురమున్న ఒకానొక ఉద్యోగి భార్య మహాప్రౌఢ. మొదటి నుండి జాతకురాలికి ఆమెస్నేహ మబ్బినది. భజనలకు, పూజలకు, సరసాలాపములకు, నిరంతరము పొరుగింటనుండుట ఈమెకు అలవాటయినది. 'స్వైర విహారధీర' యను స్నేహితురాలి సహవాసమునకు మరగి, జాతకురాలికి రానురాను కాళ్లు ఇంటనిలుచుటే కష్టమగుచు వచ్చెను. నాలుగయిదేండ్లతరువాత, జాతకురాలికి ఏదో అనారోగ్యము కలుగగా, పొరుగింటిలోనే ఆమెకు పరిచర్య జరిగినది. ఆ ఉద్యోగికి కూడ ఆమెపై అసాధారణమగు దయ ఏర్పడసాగెను. చికిత్సకై తగినంత శ్రద్ధ వహించలేదని ఆ దంపతులు జాతకురాలి భర్తను నిందించి, ఏవిషయములోనైనా కొరతరాకుండ, ఆమెకు సర్వోపచారములు తామే జరిపినారు వారు. ఆరోగ్యము కలిగినతరువాత భర్త వచ్చి ఇంటికి రమ్మని పిలువగా, ఆమె రానని నిరాకరించి, అతనిని నిందించి, అవమానపరచి, పంపెనట! చేయునదిలేక, భర్త గుటుకలు మ్రింగుచు కూర్చున్నాడు; భార్య పొరుగింటిలోనే నిలిచిపోయినదట!

ఇది మేము విన్నకథ. ఇట్టిసందర్భములలో ఈ జాతకములు నాకడకు వచ్చినవని చెప్పితిని.

విషయమంతయు విని ఆ నూతనవ్యక్తి ఆశ్చర్య కుతూహలసంశయంబు సూచించు ముఖభావముతో,

"ఈమె శీలమునుగూర్చి మీ అభిప్రాయమేమి?" అని అడిగెను.

"జాతకయోగములనుగూర్చి విన్నారు. ఇతర విషయములు నాకెట్లు తెలియును?" అంటిని.

"కాదండీ! జనాపవాదము ప్రబలముగా నుండు మాట వాస్తవమే. పరిస్థితులు దానికి అనుగుణముగనే యున్నవి. కాని, మంచి దైవభక్తిగల వ్యక్తి ఆమె. పూజా పునస్కారములలో గొప్ప ఆస్థ. ఇట్టి స్వభావముగల స్త్రీ శీలమును కోలుపోగలదా?"

"దైవభక్తి ఆమెకు లేదని ఎవ్వరనిరి? కారణాంతరములవలన పతిభక్తి లేకపోవచ్చును."

"అయిదారేండ్లు వారి దాంపత్యము క్రమముగా, సవ్యముగా, నడిచినది. ఇది నాకు బాగా తెలిసిన విషయము. ఏమి గ్రహచారమో, ఇట్లు పరిణమించుటకు?"

"ఇంద్రుని కార్యములో ఏది సత్యమో, ఏది అసత్యమో, బోధపడుట దుస్తరము" అంటిని.

"ఆమెలో దుశ్శీలము కానరాలేదండీ! ఏదో వ్యాధివలన బుద్ధిభ్రమ పాలయియుండునని నా ఊహ. ఎవరో గొప్ప జ్యోతిష్కుడు ఆమెకు ఉన్మాదమని చెప్పినాడు కూడ." అని మిత్రునివైపు చూచినాడతడు.

"హిస్టీరియా కావచ్చునేమో?" అని నా మిత్రుడు సూచించెను.

"మన్మథావస్థలలో ఉన్మాద మొకటి కాదా?" అంటిని.

"బుద్ధి సక్రమమార్గమునకు వచ్చి, ఈమె మరల తన కాపురమును చేరుకొను గ్రహయోగమున్నదేమో, చూడండి."

"భార్యాభర్తలిద్దరికిని అట్టి అభిలాష యున్నదనియా?" అంటిని.

"అదేనండీ వారి జీవితమందలి విశేషము! భార్య కోరినప్పుడు భర్త నిరాకరించుట, భర్త కోరినపుడు భార్య నిరాకరించుట, ఇట్లే జరిగినది." అని ఆ నూతనవ్యక్తి చెప్పగా, నాకు నవ్వువచ్చినది. ఇంద్రవరుణుల వేషకు మంచి దృష్టాంతమిది. ఇట్లంటిని.

"భార్యకు ఉన్మాదము! భర్తకు పిచ్చి! పోనియ్య, ఈ గొడవ మనకేల?"

అంతటితో మా ప్రసంగము ముగిసినది.

రెండుదినముల తరువాత నా ఆప్తమిత్రులలో మరియొక వ్యక్తిని బజారున కలుసుకొని ఏదో మాటలాడుచుంటిని. మాటలనడుమ ఏదో జ్ఞాపకము చేసుకొని,

"మొన్న సాయంకాలము మీ గదికి రావలెనని వచ్చియుంటిని. ఎవరితోనో, ఏదో జాతకమును చర్చించుచుంటిరి. చూచి మరలిపోతిని." అని అతడు చెప్పెను.

"ఏదో కాలక్షేపము." అంటిని.

"ఎవరిదండీ ఆ జాతకము?"

"ఎవరిదో దంపతులవట. నా మిత్రునింపెట అతని స్నేహితు డొకడువచ్చి ఆ జాతకములను చూడ మనగా, ఏదో మాటలాడుచుంటిమి. మీ రాక నేను గమనించనేలేదు."

"ఆ వ్యక్తి ఎవరో తెలుసునా?" చిరునవ్వుతో నా మిత్రుడడుగగా, తెలియదంటిని. వాస్తవముగా ఆ విషయమును నేను విచారించనే లేదు.

"అతడేనండీ కథానాయకుడు! అతని భార్య జాతకమే అది!" అని నా మిత్రుడు పకపక నవ్వసాగెను. నివ్వెరపడి, మాటలాడలేకపోతిని.

ఇల్లుచేరుకొని నా జాతకమును చూచుకొంటిని. నా జన్మబుధునికి సార్థకేంద్ర స్థానములో ఆ కథానాయకుని ఇంద్రగ్రహ మున్నదట! ఇంద్రుడు నాకు బాగుగనే 'టోపీ' వేసినాడనుకొని నవ్వుకొంటిని.

"ఇంద్రో న శ్శర్మ యచ్ఛతు."



# శారదరాత్రి

యస్వీ జోగారావు

శారదరాత్రి నా శశి యశస్సులు వెన్నెల లాకసంపు టా
ళ్వారున కూర్ధ్వపుండ్రకములై, అల చుక్కల పేరటంపు శృం
గారమునందు సుందరముగా గనుపట్టు పదారువన్నె బం
గారపు బాజుబందులయి గ్రాలెడు చల్వల చాటుధారలై.

పున్నమకన్నె చిక్కనము పోసెను వెన్నెల వాయనమ్ము ల
ష్టన్నుల మిన్నమిన్నుల మిటారికి, శోభనమంచు - షోడశ
ప్రన్న కళాప్రసన్నము, శరత్సశశాంక నిశీథలగ్న మా
సన్నముగాగనున్న దొక చక్కని చుక్కకు చందమామకున్

ఒకటొక టే శశీషు కమణోజ్జ్వలతం దిగధీశ బాల బా
లిక లపుడాడు కేళిక యళీకపు వెన్నెలకుప్పలై వలా
హక శకలాలు శుభ్రశరదభ్రపథభ్రమణమ్ముగా కకా
పిక కకుబంతముల్ వలసవెళ్ళెను గాలికి దూదిపింజలై.

తూరుపు రూపురేకలు విధూప్రసవికస్వరమైన యంత ని
ట్టూరుపు లూర్చె పట్టపగ లుత్తకలల్ గని జన్మమెల్ల శే
లూరక జాగరాల్ జలుపు నొక్క దివాంధము, దిష్టిపెట్టె సిం
గారపు చిన్నితారక నొకర్తుక చాంద్రమసాభిసారికన్.

ఉన్నటులుండి యుల్కపడెనో యుడువో పచెరంగు మాసెనో,
అన్నటు లా ముహూర్త మజహద్గ్రహణావసరంబొ స్వామికిన్
సన్నకసన్న వెన్నెల పసందులు మందటిలెన్ — మహాకవుల్
మిన్నక యొక్క వేళ మిసిమింతులునై మినుజూచు నట్లుగన్.

# బ్రౌనుదొరజీవిత విశేషములు-భాషాసేవ

**(1718—1884)**

శ్రీ కొత్తపల్లి వీరభద్రరావు

**ప్రారంభదశ:—ఆంధ్రభాషాభ్యాసము, వేమన మొదలగునవి.**

యావజ్జీవము హిందువులకొరకు (ఈ పదమును బ్రౌనుదొర సాధారణముగ వాడెను) వారి భాషల కొరకు—ముఖ్యముగా తెనుగుభాష కొరకు—కృషి చేసిన బ్రౌనుదొర 1798 వ సంవత్సరంలో కలకత్తా నగరమున జన్మించెను. ఇతని తండ్రి అయిన డేవిడ్ బ్రౌన్ (*Rev. David Brown*) కలకత్తా కాలేజీలో అధికారిగా నుండెను. భారతదేశమున క్రైస్తవ మతమును వ్యాప్తికి తెచ్చినవారిలో ఒకడుగ ఈతని తండ్రి కీర్తిని పొందెను. ఈ విషయము 'భారత దేశములోని క్రైస్తవమతము' అను గ్రంథమువలన వ్యక్తమగును.1

ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ (*Charles Philip Brown*) చిన్ననాడే, హిబ్రూ, అరబ్బి, గ్రీకు, లాటిను మొదలగు భాషలలో కృషిని ప్రారంభించెను. హిందూస్థానీ భాషను బాగుగా నేర్చెను. ఈ భాషాజ్ఞానమంతయు ఆతనికి ముందుముందు మిక్కిలి ఉపయోగించెను. బాల్యదశలోనే, తండ్రి పంపున, అచ్చుపుస్తకములకు తప్పొప్పుల పట్టికలు సిద్ధము చేయుటయందు శిక్షణమును పొందుటచేతనే, తరువాత ఆతని కడి తాను పుస్తకముల నచ్చొత్తించు సందర్భమున మిక్కిలి సాయపడెను. 1812 లో తండ్రి చనిపోగానే, బాలుడైన బ్రౌను, చదువుకై ఇంగ్లండు పంపబడెను. అక్కడ చదువుకొనుచున్న దినములలో బ్రౌనుదొర హిందుస్థానీ భాషలోని ప్రావీణ్యమునకు ఒక బహుమానమునుగూడ పొందెను. ఆ రోజులలో ఆతనికి తెలుగు అను భాష ఒకటి కల దని కూడ తెలియదట! సివిల్ సర్వీస్ (*Civil Service*) లో జేరవలెనని ఆతని చదువు.

కొంతకాలము ఇంగ్లండులోఉన్న తరువాత, ఆగస్టు 4వ తేది 1817వ సంవత్సరములో మదరాసునకు వచ్చెను. వచ్చిన కొలది కాలముననే తెలుగు నేర్చుకొనవలసి వచ్చెను. కాని తెలుగు నేర్చుకొనుటకు తగిన పుస్తకములు లేవయ్యెను. అసంపూర్ణమయిన వ్యాకరణము, ఎందుకూ పనికిరాని రెండు అభ్యాస పుస్తకములు, ఆతనికి లభించినవి. పాశ్చాత్యులకు అనుకూలముగ, భాషా వ్యాకరణముగాని, నిఘంటువుగాని లేదు. పాఠములు చెప్పెడి శాస్త్రులకు ఇంగ్లీషు మాటలాడుట వచ్చినను, వ్యాకరణ సంబంధమైన పరిజ్ఞానము తక్కువ. 2 ఈ పరిస్థితులలో సామాన్యమైన మానవుడే ఐనచో బ్రౌనుదొర, తెలుగుభాషకు ఒక నమస్కారముచేసి, మిగిలిన తెల్లవారివలెనే కాలము గడిపెడివాడు. కాని బ్రౌనుదొర సామాన్య వ్యక్తికాడు. తాను శ్రమపడి తెలుగు నేర్చుకొని, తన తరువాత ఆభాష నేర్చుకొనదలంచు వారికి ఘంటాపథమును—తన పుస్తకముల ద్వారమున—నిర్మించెను. తెలుగు, భారతదేశములోని భాషలన్నిటికంటె కష్టమైనదని ఎవరును అనకుండుటకై తానట్లు శ్రమపడినట్లు వ్రాసెను.3

1820 లో సర్ థామస్ మన్రో (*Sir Thomas Munro*) మదరాసునకు గవర్నరుగా వచ్చినపుడు, బ్రౌనుదొరయొక్క చివరి పరీక్ష, ఆతని ఎదుట జరిగెను. ఆ పరీక్షలలో బ్రౌనుదొర, క్రింది తరగతి (*Low Grade*) ని పొందెను. నాడు మన్రో

1. History of christianity in India by Hough, Kaye and Wilkinson· London 1845.

2. "....Supplied with an insufficient grammar, two worthless native books of exercises, and no dictionary. Our tutors were Brahmans, who spoke English but had few notions of grammar...."

3. "I think Telugu will no longer be considered the most difficult language in India."

చెప్పిన మాటలలో 'దేశభాషలను నేర్చుకొనవలెను' అనునది బ్రౌనుదొరకు బాగుగ వచ్చి, తరువాతి అతని భాషాసేవకు పునాదిపడెను. పరీక్ష అయిన వెంటనే, అతనికి కడపలో ఉద్యోగము చేయవలసివచ్చెను. అచ్చట హన్బరీ (*Hunbury*) అను నాతని క్రింద బ్రౌనుదొర పనిచేయుచు, తెలుగు బాగుగా మాటలాడుట నేర్చుకొనజొచ్చెను. హన్బరీ తెలుగు చక్కగా, స్వేచ్ఛగా మాటలాడ గలిగియుండుట వలనను, కార్యావశ్యకతనుబట్టియు, సహజ కుతూహలముచేతను, బ్రౌనుదొర తెలుగు చక్కగా నేర్చుకొని, రెండు సంవత్సరములలో హన్బరీని మించెను.[4] ఇంతేకాక, తెలుగుభాష నభ్యసించుటలో ఎల్లవారి సాయమును తాను పొందినట్లు బ్రౌనుదొర వ్రాసెను. కోర్టులోని వాది ప్రతివాదులు, నేరస్థులు, సేవకులు —అందరుకూడ తనకు ఆయా కాలములందు గురువులైరి అని వ్రాసి తన ఔదార్యమును ప్రకటించెను.[5]

తన రోజులలో తెలుగుదేశముయొక్క హద్దులనుగూర్చియు, జనసంఖ్యనుగూర్చియు, భాషకును, దేశమునకునుగల వివిధ నామములనుగూర్చియు బ్రౌనుదొర పరిశీలించి వ్రాసెను. ఆ వాక్యములు మనకు చరిత్ర దృష్టితో చూచినచో అతిముఖ్యములు గనుక పూర్తిగా ఉదాహరించుచున్నాను.

"The Telugu or Tenugu nation (which foreigners call Telinga) fills a country larger than Spain, to the North and West of Madras Town. In some English books it is called Telingana or Golconda. (See Marshman's History of India, chapter IV, Page 114) It is contained in circles which we may describe on the map around Kadapa, Rajamandri, and Kondapalli; the radius extending to Madras; also in one round Visakhapatnam, reaching to Ganjam, towards Puri (Poory) in Kattack, often called Jagannath. In the Rev. Wm. Campbell's British India, 1858, the nation is rated at nine (others say fourteen) millions of Hindoos The Musalmans dwelling among them are rated at about two millions· The earliest literature, eight hundred years old, varies little from the Modern Telugu. The Telugu Grammer and Prosody have always been considered Peculiarly intricate"

ఇంతవిశాలమైనది, నాటి ఆంధ్రదేశము. బ్రౌనుదొర, పట్టణ నామములనుబట్టి చేసిన విభజనను పరీక్షించునపుడు నేటి జిల్లా విభజనను మనసునందుంచుకొనరాదు.

ఈవిధముగా తెనుగుదేశమును పూర్ణముగ మనో ముకురమందు ప్రతిబింబించుకొన్న బ్రౌను దొర, తెలుగుభాషాసాహిత్యములకు సేవజేయ కృతనిశ్చయుడయ్యెను. 1822 లో అతడు మచిలీపట్టణములో-"6 తెలుగు దేశమునకు రాజధాని"— అసిస్టెంటు జడ్జిగా నియమింపబడెను. ఇక్కడ అతడున్న మూడు సంవత్సరములు, తెలుగువారికి, తెలుగు భాషకు మిక్కిలి సేవజేసెను. ఈరోజులలోనే అతడు దేవనాగరి లిపి, బెంగాలి లిపిని నేర్చుకొనెను. దేవనాగర లిపి, అరవదేశములోను ఆంధ్రదేశములోను7 కొలది మంది బ్రాహ్మణులకు మాత్రమే, ఆరోజులలో వచ్చునట. నవంబరు 10 వ తేదీ 1823 లో బ్రౌనుదొరకు పాతిక సంవత్సరములు నిండెను. ఇంతవరకు బ్రౌనుదొర, తెలుగులో బాగుగా మాటలాడగలిగియున్నను, దానిని ప్రత్యేక దృష్టితో చదువలేదట!

---

4. "....Impelled by zeal as well as necessity, in two years .."

5. "Books alone will not teach the living language I used the everyday dialect in the police office. There cannot be a better school. Whenever I had a conversation with a plaintiff, witness or prisoner, with a learned native judge, or an ignorant menial, every one became my teacher for the time."

6. "Masulipatam, the capital of the Telugu country ..."

7. "This is known to a few Brahmans in the Telugu and Tamil countries."

ఇంతవరకు ఆతనియొద్ద చెప్పుకొనదగిన ఒక్క తెలుగు పుస్తకము లేదట!

పాశ్చాత్యులలో కొందరాతనిని తెలుగు నేర్చుకొను విషయమునకూడ నిరుత్సాహపరిచిరి. వీరిలో ముఖ్యుడైనవాడు, మత్తాయి (*Mathew*) సువార్తను 'హీబ్రూ' భాషలో అచ్చువేసినవాడు. మంచి పండితుడు. ఇతని పేరు 'జేరెట్' (*Jarrett*). ఇతడు బ్రౌనుదొరతో, ఉత్సాహమంతయు మొటమొదటనే ఉండుననియు, తెనుగునకు సంబంధించిన యత్నములన్నియు మానుట8 మంచిదనియు, చెప్పెనట! ఇట్టి 'పిరికిమందులు' బ్రౌనుదొర వజ్రసంకల్పమును కదలింపలేకపోయినవి గనుకనే, తెలుగుభాషకు, తెలుగువారికి మహోపకారము జరిగెను. ఈ సందర్భముననే బ్రౌనుదొర, చిన్ననాడు తన్నందరును 'చపలచిత్తుడు వీడ'ని9 నిందింపెడివారనియు, కొమ్మనున్న ఆకు చలించినను—కొమ్మపట్టు విడువనంత కాలము—నష్టమేమునియు వ్రాసెను.

'జేరెట్' (*Jarrett*) మాత్రమే కాక, విలియమ్ బ్రౌన్ (*William Brown*) అను వాడు కూడ బ్రౌనుదొరను తెలుగు చదువు విషయములో నిరుత్సాహపరచినట్లు తెలియుచున్నది. విలియమ్ బ్రౌన్ అనువాతడు 1818లో కొంత తెలుగుపదజాలమును ఒక గ్రంథముగ అచ్చొత్తించెను. అసమగ్రమయిన తెలుగు వ్యాకరణ మొకటికూడ సిద్ధము చేసినాడు! ఇతడు తెలుగుభాషను జెంటూ (*Gentoo*) అని పిలిచెడివాడట! ఇతడు తెలుగుభాషకు సాహిత్యము లేదనియు, దానిని చదువుట వ్యర్థ మనియు బ్రౌనుదొరతో గట్టిగా చెప్పినాడట! ఈ మాటలను స్థిరసంకల్పుడగు బ్రౌనుదొర పట్టించుకొనక, తాను నిశ్చయించుకొనిన మార్గమునుబట్టి, కృతకృత్యుడయ్యెను.

ప్రారంభదినములలో బ్రౌనుదొరకు అన్నియు చిక్కులే. ఒకవైపు ఉద్యోగ సంబంధమైన పనులు. ఇంకొకవైపు, నాటిపాశ్చాత్యుల నిరుత్సాహ వాక్యములు, మూడవవైపు, దేశీయులైన పండితులయొక్క ఛాందసము. తనకు మార్గదర్శకులైన పండితుల భాషాభేషజమువలన, అనేకపర్యాయములు తన కృషి భగ్నమగునంతవరకు వచ్చెనని బ్రౌనుదొర వ్రాసెను. వారు, మారుమూలలనున్నవి, అతికఠినమైనవి, అయిన విద్యావిషయములను మాత్రమే ఉపదేశించారనియు, మూడుసారులు తన కృషి విరమించుకొన నెంచునంతవరకు వచ్చెననియు బ్రౌనుదొర వ్రాసెను.10

క్రొత్తభాష నేర్చుకొనుట కష్టము. నిఘంటువు, వ్యాకరణము, ప్రారంభకులకు పనికివచ్చు పుస్తకములు దొరకని భాషను నేర్చుకొనుట ఇంకను కష్టము. ఈ కష్టములు స్వదేశస్థునకే తప్పవు. ఇంక విదేశస్థుని మాట చెప్పవలెనా? భారతదేశ భాషలపై తమ జీవితాంతము కృషిచేసిన విదేశస్థులీ బాధలన్నియుపడిరి. వారిని జ్ఞప్తికి తెచ్చుకొని, బ్రౌనుదొర పట్టు విడువక తెలుగులో కృషిచేసెను.11 కార్యమును సాధించెను. తాను పడిన పాట్లను జ్ఞప్తియందుంచుకొని, తనతరువాత తెలుగు నేర్చుకొనగోరు వారికి ఈ కష్టము లేకుండుటకై, తన జీవితమంతయు కృషిచేసి, విద్యార్థులకు తగిన గ్రంథములను, వరుసగా రచించి ప్రకటించెను. ఇట్టివి లేకపోవుటవలననే, నాటి గురువులు బ్రౌనుదొరను, అన్ని పుస్తకములను—నిఘంటువులు, వ్యాకరణము, పదజాలములు

---

8. "........In 1826 Mr· Jarrett Counselled me to desist from my Telugu projects, predicting that my ardour and enthusiasm would soon cease·"

9· "In my younger days I was blamed for fickleness; but a leaf may flutter without losing its hold on the branch."

10. "At first I was nearly ship-wrecked more than once, because of the pedantry of my learned instructors· They consider the most abstruse branches of learning primarily desirable; and on three occasions I desisted, being daunted by the phantoms these wiseacres conjured up."

11· "To Commence learning a langnage without the help of a Dictionary or Grammer requires some determination of purpose; however, he is but a poor workman who cannot work without tools. Beschi, Gilchrist, Carey, and [illegible] did the same thing with Tamil, Hindustani, Bengali and Kannadi."

—'వల్లె' వేయుడని చెప్పి, ప్రోత్సహించిరి. 'భట్టీయము'ను 'బట్టీ' పట్టుమని ఒక గురువు బ్రౌనుదొరను ఆదేశించెనట.

వీని నన్నింటిని దాటి బయటపడి, బ్రౌనుదొర తెలుగులో పాండిత్యమును సంపాదించి, ఆ విజ్ఞానము సులువుగ, కుతూహలముగలవారందరకు లభించునట్లు చేయుటకై గ్రంథములను వ్రాయజొచ్చెను. నిఘంటువులు, వ్యాకరణము, వాక్యావళి మొదలగునవి అట్టి గ్రంథములే. కాని, వీని కన్నింటికంటెను ముందు, అతడు వేమన పద్యములకు చేసిన సేవ పేర్కొనదగినది. ఈ కృషి అతని ప్రారంభదశలో చేసినది.

బ్రౌనుదొరకు 1824 లో కొన్ని తెలుగు పద్యములు పఠించుచుండగా మొట్టమొదటిసారి వేమన పద్యములు లభించినవట. వేమన పేరు మొదట అతడు; 'డుబాయ్' (*Dubois*) వ్రాసిన 'హిందువుల చరిత్ర' (*Account of the Hindus*) మూలముగా గ్రహించెను. దేశీయులలో బహుళ ప్రచారములో నున్నవి, భాష అంతగా రాని విదేశీయులకు పనికివచ్చునవి, ఏవైనను పద్యములున్నవా అని ప[illegible]ంచుచున్న బ్రౌనుదొరకు 'వేమన పద్యములు' పెదకు పెన్నిధివలె లభించెను. విశ్రాంతి దొరికినప్పుడెల్ల వానిని అనువాదము చేయుచువచ్చి, పూర్తిగా అనువదించెను. ఈ ఆంగ్లానువాదము 'వేమన' పేరును, తెలుగు సాహిత్యము పేరును, ప్రపంచమునకు మొట్టమొదట తెలిపిన దనుటలో అభిప్రాయ భేదమునకు తావుండరాదు. ఏపనిని తలపెట్టినను, పరిపూర్ణముగ చేయు స్వభావముగల బ్రౌనుదొర-విశాఖపట్టణము, నెల్లూరు, గుంటూరు, కడప, మద్రాసు—మొదలగు ప్రాంతములనుండి లిఖిత ప్రతులను తెప్పించి, పాఠభేదముల నన్నింటిని పరిశీలించి చక్కని ప్రతిని అచ్చునకు సిద్ధముచేసెను. 12

ఈవిధముగ తెప్పించిన లిఖితప్రతులనుబట్టి చూచిన 2,500 గల పద్యసంఖ్య, జాగరూకతతో ముందువెనుకలు పోల్చిచూడగా 2,000 కు దిగెనట! కాని, ఆ పద్యములన్నియు ఒక నియమము ననుసరించిగాని, విషయము ననుసరించిగాని విభజింపబడిలేవు. అప్పుడు, బ్రౌనుదొర వానిని ఐదు భాగములుగ విషయమునుబట్టి విభజించి కూర్చెను. మతమునకు సంబంధించినవి, [illegible]ంబంధించినవి, అధిక్షేపము చేయునవి, మర్మకవిత్వమునకు చెందునవి—అను నాలుగు భాగములు ముఖ్యములు. వీనిలో చేరని పద్యములు ఐదవ విభాగము 'కలగూరగంప'లో చేర్చబడినవి. 13 వీనిలో చివరి రెండు భాగములను (మర్మకవిత్వము, కలగూరగంప) విడిచి, మిగిలినవానిని బ్రౌనుదొర ఆంగ్లీకరించెను. ఇంగ్లీషులోని 'మిల్టన్' మహాకవియొక్క 'పారడైజ్ లాస్ట్' మొదలగు కావ్యములు విభాగింపబడినట్లు, వేమన పద్యములను, మొదటి పుస్తకము (*Book One*) రెండవ పుస్తకము (భాగము *Book Two*) అని బ్రౌనుదొర విభజించెను. తరువాత వావిళ్లవారు అచ్చువేసిన పుస్తకములో—రెండవ ఆశ్వాసము అనియు కలదు. దీనిని మనము మొదటి భాగము, రెండవభాగము అనుకొనవచ్చును. బ్రౌనుదొర ఆంగ్లీకరించిన మూడు భాగములలోను మొత్తము 693 పద్యములు కలవు. (ప్రథమ - 200; ద్వితీయ - 214; తృతీయ - 279) ఈ ఒక్క గ్రంథమునకు బ్రౌనుదొర చేసిన సేవ, అతనికి మన భాషయందుగల అపార ప్రేమకు నిదర్శనము. ఇదంతయు అతడు ఉద్యోగములో చేరిన మొదటి దశలోనే జరిగినదన్న అతని అభిమాన మెంతగాఢమైనదియో వ్యక్తమగును. ఈ పద్యములను ఏర్చికూర్చునపుడు, "అసభ్యతలేని పద్యములనే చాలవరకు చేర్చితి"నని అతడు వ్రాసెను. ఈ ప్రతిని సిద్ధము చేయునపుడు, ఈ పద్యములతో కలిసిపోయిన—సుమతి, భాస్కర, తిరుమలేశ మకుటములుగల—వానిని బ్రౌనుదొర పరిహరించెను.

వేమన పద్యములవంటి పద్యములను గూర్చి వ్రాయుచు, ఇంగ్లీషులో కూడ అతి ప్రాచీనకవు లిట్లు వ్రాసినారని—మాలికలు, శతకములు (*Garlands, Centuries*)-తెలిపెను. వేమన పద్యములవంటివానిని,

12. "After collecting such copies as were to be found at masulipatam where I was then stationed, I gradually procured others from Vizagapatam, Nellore, Guntur, Cuddapah, and Madras."

(The Verses of Vemana 1829. Preface.)

13. "I at length formed the whole into five tolerably consistent divisions - religious. moral, satirical, mystic and miscellaneous." (The Verses of Vemana - Preface.)

ప్రత్యేకముగ నూరు, నూరు పద్యములుగ విభజించుట అనావశ్యకమనియు, విషయమునుబట్టి విభజించుట లాటిన్, గ్రీకు మొదలయిన భాషలలో కలదనియు పీఠికలో బ్రౌనుదొర వ్రాసెను. ఈపద్ధతిని పరిశీలించినచో ఈతడవలంబించిన విధానముయొక్క ఔచిత్యము వ్యక్తమగును. విషయమునుబట్టి విభజించు పద్ధతి మనకును క్రొత్తగాదు. సంస్కృతములోని భర్తృహరి శతకము మొదలగునవి ఇట్లున్నవె.

పీఠికలో, బ్రౌనుదొర వేమన కాలమును గూర్చియు, కులమును గూర్చియు చర్చించెను. ఈ చర్చను పరీక్షించినచో (ఫలితములతో సర్వదా ఏకీభవించకున్నను) బ్రౌనుదొరకు గల చరిత్రజ్ఞానము, నిష్పక్షపాతబుద్ధి విదితమగును. వేమన జన్మస్థానమును గూర్చి వ్రాయుచు బ్రౌనుదొర, వేమన తన పద్యములలో ఉపయోగించిన మాండలికమును బట్టి, అతడు తెలింగాణములోని దక్షిణ పశ్చిమ ప్రాంతము వాడని తోచుచున్నదని వ్రాసెను. 14 ఈ వ్రాత మనకు రెండు విషయములను వ్యక్తముచేయును. విదేశీయుడగు బ్రౌనుదొర, కవి ఉపయోగించిన మాండలికములను బట్టి స్థలనిర్ణయము చేయ సంకల్పించెనన్న, అతడు మన భాషకుగల వివిధమాండలికములను ఎంత చక్కగా పరిశీలించెనో తెలిసికొన్న ఆశ్చర్యము కలుగును. నాగరక భాషలోని ప్రయోగముల నుపయోగించిన కవియొక్క రచననుబట్టి, అతని ప్రాంతమును నిర్ణయింపబూనుట అను విమర్శన పద్ధతి ఏర్పాటు [illegible].

వేమనకు కవులలోగల స్థానమును గూర్చి వ్రాయుచు, బ్రౌనుదొర అతనిని గ్రీకు భాషలోని 'లూసియన్'తో పోల్చెను. 'లూసియన్' వలెనె వేమనయును జనాదరణమును చూరగొన్న కవి. భాషాభ్యాసమునకు, గడంగువానికి మిక్కిలి ఉపయోగించును. వాని కవితలో అంత ఉదాత్తతగాని, గాంభీర్యముగాని ఉండవు, అని బ్రౌనుదొర ఊహ. ఈ అభిప్రాయముతో ఏకీభవింపనివారుండవచ్చును.15 గాని, బ్రౌనుదొర నిష్పక్షపాతమును శంకించువారుండరు.

వేమన పద్యములలోని 'విశ్వదాభిరామ వినుర వేమ', అను మకుటమును గూర్చికూడ చర్చించి, అది అంత ఉపయోగకారి కాదనియు, అది లేకున్నను పద్యముయొక్క భావమునకు హానిరాదనియు వ్రాసెను. ఈ ఆంగ్లానువాదము 1829 లో ప్రచురింపబడెను.16 ప్రచురింపబడినదానిలో, లోపములు లేకపోలేవనియు అది ప్రాథమికమైన కృషియనియు తరువాత దానిలో చాల మార్పులు తాను తెచ్చినట్లును బ్రౌను దొర వ్రాసెను. 17

బ్రౌనుదొర 'వేమన'ను పాశ్చాత్యులకందరకు అందజేయుటవలన, వేమన కీర్తితోబాటు తెలుగువారి కీర్తికూడ వ్యాప్తి చెందెను. ఆంగ్లేతరులలో వేమనను గురించి వ్రాయువారికి బ్రౌనుదొరయే ఆధారము.18

ఆంగ్లములోనికి వేమనపద్యములను పరివర్తన చేయునపుడు బ్రౌనుదొర, మూలములోని భావమంతయు వచ్చినదా లేదా యని పరిశీలించెనేగాని, మూలములోని భాషకు సమీపముగా తన ఆంగ్లభాష వచ్చినదా లేదా అని అంతగా పరీక్షింపలేదు. ఈ అనువాద సంప్రదాయము, మనకు భారతకవుల నుండియు పరిచితమైనదియే. కేవలము ఆంగ్లానువాదమే కాక, కొన్నికొన్ని చోటుల విపులమైన శబ్ద చర్చ చేయుచు పద్యములకు వ్యాఖ్యానమువంటిదికూడ వ్రాసెను. ఈ వ్యాఖ్య విదేశస్థులకు ముఖ్యముగా,

14. "Yet his dialect in a few passages renders it probable that Vemana was a native of the south-western parts of Telingana ......." ....Preface.

15. "This author is in Telugu what Lucian is in Greek - a familiar writer, useful to a beginner, though neither poetical nor classical."—Preface.

16. "The import of the chorus is obscure, but the sense of each verse is complete without it."
(Preface)

17. "It was a juvenile effort, and I have since remodelled several pages." (Preface)

18. ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు చెందిన డాక్టర్ ఈశ్వర్ నాథ్ తోపా గారు మొదట ఉర్దూభాషలోను, తరువాత ఆంగ్ల భాషలోను 'వేమన' పై పుస్తకమును వ్రాసిరి. ఆంగ్లగ్రంథమునకు ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు పీఠిక వ్రాసిరి. ఈ గ్రంథరచనకు 'బ్రౌనుదొర అనువాదము' తోడ్పడినదని గ్రంథకర్త వ్రాసెను.

మూలములోని కొన్ని కష్టములయిన పదములను, భావములను మత విశేషములను అర్థము చేసికొనుటకు పనికి వచ్చును. కొన్నికొన్ని చోటుల, ఆంగ్లకవుల పద్యపాదములనుగూడ ఉదాహరించెను. వానిని పరిశీలించినచో అతనికి గల స్వభాషా పాండిత్యము వ్యక్తమగును. ఇంతే గాక కొన్ని చోటుల సంస్కృత శ్లోకములను ఉదాహరించుటయే గాక—ధర్మము, సత్యము, పుణ్యము మొదలగు శబ్దముల అర్థములను, తన పాండిత్యము ప్రకటితమగునట్లు చర్చించెను. పుస్తకము తుదిని, అకారాదిగ పద్యముల ప్రథమపాదముల నిచ్చియు, పద్యసంఖ్య, పరిచ్ఛేద సంఖ్య చూపియు గ్రంథమును అతినవీనముగ చేసెను.

వేమన పద్యముల ఆంగ్లానువాదము నాటికి నేటికి కూడ మనకు శిరోధార్యమే. తమిళములోని 'కురల్' మొదలగువానికి పాశ్చాత్యులే అనువాదము చేసిరి. ఆ అనువాదమునకు ఇది ఏవిధముగను తీసిపోదు. తెలుగువారు పాశ్చాత్యులకు గర్వముగ చూపింపదగిన పద్యములు వేమన్నవి. వేమన్నలోని 'విశ్వజనీనత' అందరకును ఆదరపాత్రమగును. అట్టి దానిని అంగీకరించి బ్రౌనుదొర, తన ప్రారంభదశలోనే మన భాషకు మిక్కిలి కొనియాడదగిన సేవ చేసినాడు.

ఈతని భాషాసేవను కాలానుగుణముగ విభజించి చూపుటకంటె, విషయ విభాగము చేసి చూపుట మంచిది. బ్రౌనుదొర కృషి, ఆదినుండి జీవితాంతము వరకు 'పూసలలోని దారమువలె' అనుస్యూతమై యున్నది. అతని ప్రతిభాపుష్పము మొగ్గగా ఉన్నప్పటినుండియు సుగంధబంధురమే. అది వికసించిన కొలది సుగంధము, దూరవ్యాప్తమై గాఢమగుచు వచ్చినది. ఈ అనువాదకాలము నాటికే, బ్రౌనుదొరకు తెలుగు మాటలాడుట బాగుగవచ్చును. పాండిత్యసముపార్జనకైకూడ విశేషముగ కృషి చేయుచుండెను. అతని భావి భాషాసేవకు, గ్రంథ రచనకు, నాటికే లోతైన పునాదులు పడెను. కృషిని మొదలుపెట్టినదాది విరామ మెరుగక పనిచేసి, శాశ్వతకీర్తిని తేజాలిన భాషాసేవచేసిన బ్రౌనుదొర, విశ్రాంతి అనునది ఎరుగక జీవించెను. అతనికి విశ్రాంతి పనిచేయుచున్నప్పుడే. సుఖముకృషిలోనే. కృషియే అతని దైవము.*

(సశేషము)

* ఈ వ్యాసములోని ఇంగ్లీషు భాగములు (వేమనకు సంబంధించినవి తప్ప) బ్రౌనుదొర స్వయముగ వ్రాసిన వ్యాసములోనివి.



# నా మనసు

'హర్షవర్ధన'

నాకె చిత్రముగా తోచు నామనస్సు!
వికృతగతి పెంచి కుంచించి ప్రకృతినెల్ల
తారుమారుగ జూపెడి దర్పణమటు
అతివికృత చంచలాత్మ కాకృతుల జూపు.

ఒక్కొక్కసారి శారదపమోదమునా
విశదమ్ము రమ్యమూ
ఒక్కొక్కసారి పెన్వెనపుటూర్పుల
బుస్సలుకొట్టు త్రాచునా
ఒక్కొక్కసారి దుర్గమమయోమయమై
అతి సంకులమ్మనా!
నిక్కపు దీని తత్వము నే
గ్రహియింపగజాల నెంతకున్!

ఈ నామన స్థితిని నెంతగ నమ్మికొన్నన్
తానెల్ల యప్పు డొక దారిని పోవదింకన్
ఏనాడు ప్రాంతజనులెల్లను గంగపాలై
దీనాతిదీనులుగ ద్రిమ్మరజేయ జూచున్.

ఈ మన్మనోవిహాగమెప్పుడు నిల్చునో, ఇం
కే మూర్తమం దెచటికేగునో, నిర్భరస్వే
చ్ఛా మాధురీముదిత మెంతకో? పంజరస్థం
బై మ్రగ్గునో? శిఖాహతిగూలనో?
ఏనాటి కేగతి చరించునో నిర్ణయింపన్
లేని మనోజలద లేశము వాయుసంచా
రానస్థమై తిరుగు నాకసమెల్ల గాని
తెంపు చిన్కునో సుధామధురార్ద్ర
దృష్టిన్!

అమర వాగ్గెకాకర్త త్యాగరాజు
మనసు స్వాధీనమైన యా ఘనునికి మరి
మంత్రతంత్రము లేలనె! మనసు నైజ
మిట్టిదనిగూడ నాకు గ్రహింపరాదు!
ఇతర విషయాల నెన్నో గ్రహింపజాలు
గాని తన్నుతాను తెలిసికో నశక్త
మీ మనసు; ఇట్టిదింక నన్నెట్లు సత్ప
థమున నడిపించు; సంప్రమోదమును నించు?
తారకల నణువులను స్వస్థానములను
ఏ మహాశక్తి నిలిపి చరింపజేయు
నా మనసు నా మహాశక్తి నడపుగాత
సత్య శివసుందరానంద సరణి నెపుడు!



# భూగర్భ పరిశీలన

శ్రీ గురుభాగవతుల ధర్మారావు

భూమి మనలను కన్నతల్లి. ఎల్లప్పుడును తన వక్షముపై మనలను మనయిళ్ళను, మన ఇనుపదారులను, మోసుకొని పోవుచున్నది. కాని, సాధారణముగా ఎవరును, "ఎప్పుడు, ఎట్లు భూమి జన్మించినది. మన శరీరమువలె నదికూడ నశించునా?" అను ప్రశ్నలు వేసికొని, సమాధానములు కనుగొనరు. అయినను, రాత్రులయందు విశ్రాంతికై నక్షత్రశోభిత గగనమండలముకేసి చూచునప్పుడును, సముద్రయానము చేయునప్పుడును పై ప్రశ్నలు మన మనస్సులం దుదయించి, మనల నాశ్చర్యచకితులను చేయుట ఎల్లరు ననుభవించునదియే.

సృష్టి, సృష్టిక్రమములనుగూర్చి చెప్పుట పురాణ లక్షణములలో నొకటి. ఆ వృత్తాంతములు కేవల మూహాగానములను మెకాలే ప్రభృతుల యపోహల నటుండనిచ్చి, పాశ్చాత్యులలో పలువురి మతమైన క్రైస్తవ మతప్రమాణమగు బైబిలులోని పుట్టుక (*Genesis*) భాగమును పరికించిన నందీవాక్యములు చూడగలము. "*In the beginning God created the heaven and earth. And the earth was without form; and void: and darkness was upon the face of the deep.*"

"ఆదియందు దేవుడు స్వర్గమును, భూమిని సృష్టించెను. భూమి, నిరాకారమును, శూన్యమునై (వట్టిదై) యుండెను. సముద్రమంతయు నంధకార బంధురమై యుండెను."

దీనినిబట్టి, పాశ్చాత్య దేశములందేమి, ప్రాచ్యమునందేమి, ఎప్పుడో యొకప్పుడు సృష్టి జరిగెనని మానవులకు నమ్మకము కలిగియుండెనని తెలియుచున్నది.

భిన్నత్వమునం దేకత్వము కనుగొని, కార్యములకు కారణముల నన్వేషించి యజ్ఞానమువలన కలిగిన యాశ్చర్యమును పారద్రోలి, కార్య కారణ జ్ఞానమును ప్రసాదించుట యాధునిక శాస్త్ర ధర్మము. సృష్టి, సృష్టిక్రమముల విచారము ప్రాచీన మతములతో ముడివడియుండి, నేటి శాస్త్రములందే పూర్తిగా సాధింపబడక, కారణము నరయుకొలది, యింకనెన్నియెన్నో యచింత్యములగు వింతవిషయములు గోచరములగుటచే పండితులను, శాస్త్రజ్ఞులనుగూడ యాశ్చర్యాన్వితులను చేయుచున్నది.

భూమియు, మానవుడును, ఇంచుమించు ఒకే సమయమున, అనగా క్రీస్తు పూర్వము 4004 వ సంవత్సరము క్రింద అక్టోబరు 26 వ తేది ఉదయము 9 గంటలకు సృష్టింపబడిరని,—ఐర్లాండు దేశమునందు (*Archbishop Ussher*) యుష్షరను క్రైస్తవ దేవాలయాధికారి, 1654 వ సంవత్సరమున బైబిలునుండి రుజువు చేయగలనని చెప్పిన నాటినుండియు, నాతని నిశ్చయ మునువక్క మరి దేనినైనను విశ్వసించుట అక్రైస్తవమనియు, నాలుగువేల నాలుగు సంవత్సరములకు పూర్వము భూమి యుండుట యసంభవమనియు నమ్ముచుండిరి.

కాని, పందొమ్మిదవ శతాబ్దారంభమునందు భూశాస్త్ర (*Geology*) పరిశోధకులు భూమిని త్రవ్వి, ప్రత్యక్షముగ కొన్ని విషయములు బయలుదీసిననాటి నుండి, పైని చెప్పబడిన మూఢనమ్మకము క్రమక్రమముగ క్షీణించుచు, శాస్త్రజ్ఞులు ప్రత్యక్షముగను, హేతువాదరూపకముగను చూపు నిదర్శనములపై ప్రజలదృష్టి మరలుచుండెను. కొండలు త్రవ్వి, వాగు, రాళ్ళ పొరలుపొరలుగానుండుటను, పొరలమధ్య శిథిల జంతు వృక్షములను కనుగొనిరి. జంతువుల యస్థిపంజరములను, శిథిలవృక్షములను, పరిశోధించగా, నవి బ్రదికియుండెడికాల మూహాగోచరమయ్యెను. అప్పుడు వారు, అతిపురాణమగు నా యుగమందు శీతోష్ణస్థితి యందును, నైసర్గిక స్వరూపమునందును, తనపైపుట్టుచు గిట్టుచున్న జీవకోటియందును, భూమి బ్రహ్మాండమయిన మార్పులను పొందుట గాంచిరి. ఇట్టి విప్లవయుతములగు పరిణామములే లేనియెడల, గిరిశిఖరములపై తిమింగిలముల యస్థిపంజరము లుండుటయు, ఇంగ్లాండువంటి చలిదేశపు భూగర్భమున, ఎండి కొరడావోవు నారికేళవృక్షము లుండుటయు, అమెరికా సమభూములందు సముద్రపు టడుగున *Deposits* దొరకుటయు,—అసంభవములనియు, పైని

చెప్పబడిన విషయములనుబట్టి మన భూ జలభాగములు కొన్ని యుగములక్రిందట మారెననియు, కొన్ని దేశముల శీతోష్ణపరిస్థితి యుగముల పూర్వము భిన్నముగ నుండెననియు, చెప్పుచున్నారు. మృతజంతు వృక్ష శేషములే సృష్టికాలమును ఎన్నిదో లక్షల సంవత్సరములకు ముందు జరిగినట్లు సూచించుచున్నవి.

తరువాత 1858 సంవత్సరమున డార్విన్ పండితుని గ్రంథములలో వివరింపబడిన పరిణామ సిద్ధాంతము సృష్టిక్రమమునకు సహాయకమైన పూర్వోత్తర సంబంధమును కలిగించినది. పిదప, 1900 సంవత్సరమున *Radium* అను లోహము విషయమై పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞులు చేసిన పరిశోధనల ఫలితముగ, నీ లోహ మొక వేగము చొప్పున తగరము (*Lead*) అగువరకు పొందు మార్పులను లెక్కించి, ఇట్టి మార్పులు ఒక్క రేడియమే కాకుండా, *Thorium* (థోరియం) *Uranium* (యురేనియం) అను లోహములు కూడా చెందుచున్నవని కనిపెట్టిరి. రేడియమ్ కలిగియున్న పాషాణపు బరువును, అది మార్పుచెందగా మిగిలిన తగరపు బరువును, సరిపోల్చి చూచి, ఎన్ని సంవత్సరములకు పూర్వమిట్టి రాళ్ళు ఏర్పడెనో అంచనా వేసి చూచిరి. ఇట్టి యంచనాల యాధారముగ భూమి యెప్పుడు జన్మించినదియు, మనము సరిగా లెక్కగట్టవచ్చును. *Radio Activity* అనగా *Radium* అను కాంతి ప్రసారక లోహము తన గర్భముననున్న యణువులను కాంతి ప్రసారము వలన ఎన్ని సంవత్సరములకు పోగొట్టుకొనుచున్నదో భూమియొక్క అన్ని దిశలయందును పరిశోధనలవలన గణించి, తత్ఫలితముగ, వారు రమారమి మూడువేల మిలియన్ల సంవత్సరములకు పూర్వము భూమియొక్క పైపొర (*Earth Crust*) ఘనీభవించినదని తలపోసిరి. సృష్టి ఎప్పుడో ఒక కాలమున జరిగియుండెనని చెప్పుటకు మరికొన్ని యాధారములు కలవు. సముద్ర జలమందున్న లవణ మెన్నివంతులు, ఇందు ప్రతి సంవత్సరమును నదులవలన సముద్రమునకు కొనిపోబడు లవణ మెన్నివంతులు? అను విషయముపై చేసిన పరిశోధనలును, నక్షత్రములందుగల వాయుపదార్థములు మండుటనుగూర్చి చేసిన పరిశోధనలును,—ఇవి యన్నియు భూమికి ప్రారంభదశ కలదనియు, అనగా ఏదో యొక నిర్దిష్టకాలమున పుట్టినదనియు, చెప్పుచున్నవి—ఈ పరీక్షవలన సరిగా ఇన్ని సంవత్సరములకు పూర్వము భూమి జన్మించినదని చెప్పుటకు వీలులేకపోయినను, భూమి పుట్టి నాలుగైదువేల మిలియన్ల సంవత్సరములకు ఎక్కువకాని, రెండువేల మిలియన్ల సంవత్సరములకు తక్కువకాని, కాలేదని రూఢిగ చెప్పగలము. ఇట్టి నిరూపణ చేయుటకు సాధనములు మూడు. (1) భూశాస్త్రము, (*Geology*), (2) డార్విన్‌యొక్క పరిణామ సిద్ధాంతము, (3) రేడియం విషయమై మనకు లభించిన విజ్ఞానము.

ఇంతవరకు భూమి ఎప్పుడు జన్మించినది, అను విషయమును విచారించితిమి. కాని ఇంతకంటె చిక్కు ప్రశ్న మరియొకటి కలదు—భూమి ఎట్లు సృష్టింపబడినది? అది జన్మించిన రీతి క్రమమేమి?

పృథివి పూర్వచరిత్రను తెలుసుకొనుటకు పూర్వము దాని వర్తమాన స్థితినిగూర్చి మనము పూర్తిగ గ్రహింపవలెను. ఆకాశమునందున్న గోళముల గురించి మనకు రమారమి వేయి (*Light years*) ప్రకాశ సంవత్సరముల వరకు ఖగోళశాస్త్రము తెలుపుచున్నది. కాని మనము కాళ్లతో ప్రతిదినము త్రొక్కుచున్న వసుధ కొన్ని నిలువులక్రింద తన గర్భమున నేమి దాచియుంచినదో చాలవరకు తెలియదు. భూమి యండాకారమయి యున్నదని మన మెరిగి యున్నాము. కాని, సరాసరి దాని మధ్య భాగమువరకు త్రవ్వి యెవరును చూడలేదు. *Wyoming* అను స్థలమునగల నూనెగనిలో మానవుడు 20,257 అడుగుల లోతువరకు పోగలిగినాడు. భూమి వెలుపలినుండి దాని కేంద్రము వరకుగల దూరములో ఈ నూనెగనిలోతు వేయవ వంతు. (1/1000).

## భూమియొక్క వేడిమి

ఏది యెట్లున్నను, భూమి యంతర్భాగ మతి తీక్ష్ణమని చెప్పక తప్పదు. గనులలో 60 అడుగుల లోతున కొక ($1^{\circ}F$) ఫారిన్ హీట్ డిగ్రీ చొప్పున యుష్ణోగ్రత యెక్కువగుననియు, రెండుమైళ్ల లోతునకు పోవుసరికి నీళ్లుడుకునంత యుష్ణముండుననియు, ముప్పదిమైళ్ళ లోతున రాళ్లుకూడ కరుగునంత, 2200—రెండువేల రెండువందల డిగ్రీల యుష్ణమున్నదనియు, ఈ తీక్ష్ణతయే అగ్నిపర్వతములనుండి వెలువడు గంధకపు బురద ప్రవహించుటకు కారణమనియు, చెప్పుచున్నారు. అగ్నిపర్వతపు పైపొరలయం దమితముగు వేడి,కిరణరూపమున తన శక్తిని

ప్రసరణజేయు (*Radium*) రేడియం అను లోహము దట్టముగా నుండుటవలన కలుగుచున్నదని శాస్త్రజ్ఞుల పరిశోధనలవలన తెలుచున్నది. ఇంకను లోతువఁకు బోయిన భూమికేంద్రమున (10,000°*F*) పదివేల ఫారిన్‌హీట్ డిగ్రీల యుష్ణమున్నదనియు, ఇది రమారమి సూర్యగోళోపరిభాగమునందలి యుష్ణోగ్రతకు సరిపోవుననియు చెప్పుచున్నారు.

భూపదార్థ విజ్ఞానులు భూమిని ?.కే కేంద్రముగల మూడు గోళము భాగింపవచ్చునని నుడివినారు. భూమియొక్క *mass* 6600 మిలియన్ల మిలియన్ల మిలియన్ల టన్నులట! దీనిని ఊహించుటయే బహుకష్టము. లోపలికి బోవుకొలది భూమి శిలామయమని చెప్పుటకుగూడ వీలులేదు. ఎన్నియో హేతువులనుబట్టి, భూమియొక్క కేంద్రమున, నాలుగుమైళ్ళ వెడల్పుగల, ఇంచుమించు ద్రవరూపకములైన ఇనుము నికెలు గలవని చెప్పవచ్చును ఈ ప్రదేశమునగల *Pressures* (ఒత్తిడులు) విపరీతమయినంత హెచ్చుగా నుండుటచేత—(చదరపుటడుగునకు 46,500,000 టన్నుల చొప్పున). ఈ ప్రదేశమందలి ఇనుమునకును, నికెలునకును ద్రవపదార్థ గుణములుకలవో లేవో చెప్పుట కష్టము.

ద్రవీభూతమయిన యీ గోళమును కొబ్బరికాయ నీళ్ళతో పోల్చినయెడల, దాని చుట్టునుఉన్న 2000 మైళ్ళ మందముగల భాగమును కొబ్బరికాయ గుంజుతో పోల్చవచ్చును. దీనికి నలువైపులు గల మరియొక గోళమును కొబ్బరికాయ పెంకుతో కంటె, పలుచని ఏపిల్ పండు తొక్కతో పోల్చుట సమంజసము.

రసాయన శాస్త్రజ్ఞులు, భూకంపములగూర్చి తెలిసినవారును, దీనిని *Iron - Magnesium Cilicate* గా వర్ణింతురు. లోనికి పోవుకొలది, దీని తైక్ష్ణ్యము తెలుపుగను, పైకి రానురాను రక్తవర్ణముగను, ఉండి, గట్టిదనము, మెత్తదనము అను పరస్పర వైరుధ్యగుణములు కలిగియున్నది.

అన్నిటికి పైనున్న యీ మూడవగోళము, రెండు పొరలను కలిగియున్నది. పునాదివంటి లోపొర అగ్నిపర్వతములనుండి యుబుకుగంధక ద్రవమున కన్పడు నల్లసేనపు రాయివలెనున్నది. దాని దళసరి 5 నుండి 10 మైళ్ళవరకు నున్నది. దీనిపైనున్న పొరయే మనము నివసించుచున్న భూభాగము. ఇది *Granite* అని చెప్పబడు మెరుగుపెట్టుట కనువైన యొక శిలతో నిండి, దాని యడుగునయున్న నలని రాతిపై, సముద్రమునుండి లేచు మంచుగడ్డవలెనున్నది.

*Granite Basalt* కన్న తేలికయగుటచే కొందరు శాస్త్రజ్ఞులిది సముద్రమున తేలుమన్న దనుచున్నారు. ఇటులనే *Basalt* దాని యడుగునయున్న *Olivine* కన్నను, *Olivine* దాని యడుగుననున్న యినుముకంటెను తేలికయట. ఎంతయో గట్టిగానున్నదని మనము భావించుచున్న యీ భూభాగము, దాని క్రిందనున్న *Granite*, *Basalt*, *Iron* అను మూటికంటె బహు తేలికనయ్యె యుండుటయు, మనము గృహములకు వేయు సిమెంట్ కాంక్రీట్ (*Cement concrete*) పునాదులు అచంచలము లనుకొనుటయు విచిత్రములు.

ఇట్టి నిర్మాణమునందు బయటనుండి త్రవ్వకొని క్రిందకు పోవుకొలది దొరకు పదార్థములు క్రమముగా నొకదానికన్న నింకొకటి గురుతరముగాను, ఉష్ణతరముగాను, ఉండుటచే భూమి యొకానొకప్పుడు ద్రవపదార్థముగ నుండెననియు, నిప్పటికైనను పూర్తిగా చల్లారలేదనియు, చెప్పవచ్చును.

## భూమి పుట్టుకనుగూర్చిన సిద్ధాంతము

గెరార్డ్ కూపర్ అను చికాగో విశ్వవిద్యాలయ ఖగోళశాస్త్రజ్ఞుడు 1951 వ సంవత్సరమున భూమి యెటు లేర్పడిన దనువిషయము గూర్చి చేసిన సిద్ధాంతము శాస్త్రజ్ఞుల యామోదము బడసినది. ఈ విశ్వమున మొదట, పలుచగా చెదరియున్న కొన్ని వాయు పదార్థములు, (*Cosmic Dust*) విశ్వధూళితో కలసి, యాకాశమున మేఘములవలె భ్రమించుచుండెడివట. అప్పుడు క్రమముగ పదార్థమునకుగల పరస్పరాకర్షణ శక్తిచే నవి యొకదానితో నింకొకటి కలసి, ఘనీభవించి, దేని యక్షమున నది తిరుగగా వాటిలో, (*Pressures*) ఒత్తిడులు, (*Temperatures*)ఉష్ణోగ్రతలు, అధికములయ్యెనట. ఈ ఒత్తిడులు, ఉష్ణోగ్రతలు, క్రమక్రమాభివృద్ధివంతములౌటచే నవి కాంతివంతములై నభోమండలమున వెలుగు నక్షత్రములుగ మారెనట.

వాని యక్షము(*axis*)నందవి తిరుగుటచే వీనిలో బహునక్షత్రములు రెండుగా బ్రద్దలగుటచే నక్షత్రయుగళములయ్యెను. ఆకాశములో మనకు కన

పడు నక్షత్రములలో సగముకన్న హెచ్చుగానున్న వీనక్షత్రయుగళములే. కొన్ని జంటచుక్కలయినట్లు, మరికొన్ని ఒక్కొక్కటి మూడు చుక్కలుగ భిన్నములయ్యెను. మరికొన్ని నక్షత్రము లొక్కొక్కటి యయిదు భాగములుగ పరిణామము పొందెను. కంటికొక్కదానివలె కన్పడుచున్నను ధ్రువనక్షత్ర మట్టిదైయిదు నక్షత్రముల కలయికయే. ఈ మార్పుల తత్వమును (*Physicists*) పదార్థ విజ్ఞానశాస్త్రజ్ఞులు, వివరించుచు, నక్షత్రములు విధిగా బద్దలు కాలేదనియు, నూటిలో ఒక నక్షత్రము తన కేంద్రము బద్దలుకాక ఒక్కటిగానే యుండెననియు చెప్పుచున్నారు.

సూర్యబింబ మిట్టి నక్షత్రములలో నొకటి. అవ్యక్తమును, సుస్పష్టాకార విరహితమునగు మూల పదార్థము (ద్రవ్యము) ఆకాశమున గిరగిర తిరుగగా తిరుగగా నది యంతకంతకు, పళ్లెమువలె నిమ్నోన్నతములులేక చదునై, దానియందచ్చటచ్చట(*Gravity*) భూమ్యాకర్షణ శక్తి ప్రభావమువల్ల దట్టముగానున్న కొన్ని యణువులు చక్రాకారముగ నేర్పడెను. ఈ చక్రాకారముగ భ్రమించుచున్న యణుకోశములు ఒకదానికొకటి ఢీకొనినప్పుడు ఒక యణుకోశముతో నింకొకటి కలయుటచే పెద్దది యగుచు, రమారమి నూరు మిలియన్ల సంవత్సరములకు మన కిప్పు డగుపడు గ్రహములును, వాటిచుట్టు తిరిగెడు ఉపగ్రహములును, ఆకసపు టంచులలో సంచారము చేయు తోకచుక్కలుగ నయ్యెను.

ఈసమయమున నంతే కుదురు (*Whirl*)పై తిరిగి తిరిగి భూమి యొక గ్రహముగను, దాని కుపగ్రహముగ చంద్రుడును, ఘనీభవించెను.

కాలము తన పసిపాప కనువిచ్చిన యా వేకువ జామున మన భూమి రూపురేఖలు లేక యాకాశమున పెద్ద యగ్ని ముద్దవలె దన బాటను పరుగిడుచుండెను. పదార్థములకుగల పరస్పరాకర్షణ శక్తి (*Gravitation*) వల్లను, సూర్యునిలో నెలువడు తేజోమేఘములతోడి యొరపిడివల్లను, భూమి యుష్ణోగ్రత తైక్ష్ణ్యము మంటగా మారియుండెనని శాస్త్రజ్ఞుల మతము. భూమి ద్రవరూపముగ నున్నప్పుడే బరువైన లోహము మధ్యకు దిగుటయు, దానిపై *Olivine*, దానిపై *Basalt*, ఆపై అన్నిటికన్న తేలికయగు *Granite* పేరుకొనుటయు సంభవించెను.

ఈ యుగమందే ఆఫ్రికా, ఐరోపా మొదలగు ఖండములు కొన్ని రూపొందెను. భూదేవి కుక్షి యప్పుడు చూచుటకు భయంకరమై నిప్పులు, పొగ గ్రక్కుచుండెను. రొమ్ము కరిగి, ప్రవాహరూపమున భూగర్భమునుండి పైకి యుబుకుచుండెను. ఇట్లు కాగాకాగా కొన్ని మిలియన్ల సంవత్సరములకు పైభాగమున నల్లసానుపులును, *Basalt* అనబడు రాళ్ళును, గట్టిపడనారంభించెను. కొన్ని మాత్రము కరిగిపోయి, భూగర్భములోనికి మునిగిపోయెను. అక్కడక్కడ కొన్ని *Granite musses*, గ్రానైటు పర్వతములు ఉపరిభాగములందు పెరుగుచు, క్రింద నున్న *Basalt* పునాదిపై, సముద్రమున చేలు మంచు గడ్డలవలె తేలుచుండెను.

ప్రస్తుతము ఉత్తర దక్షిణ అమెరికా ఖండములు ఆదినుండియు నిట్లేయుండెనా యను విషయముపై నభిప్రాయభేదము కలదు. ఇప్పుడున్న స్థలములందే ఖండము లన్నియు వేరుగానుండి, యక్కడనే క్రమ క్రమముగా చల్లబడెనని కొందరి మతము. మరికొందరివి యొక్కే భూభాగముగ నుండెననియు, తరువాత భూమి తన యక్షముపై తిరుగుటచే, *Basalt* సముద్రమున స్థలము దప్పి, కొట్టుకొనిపోయి కొట్టుకొని పోయి, ప్రస్తుత పరిస్థితికి వచ్చెననియు, దలచుచున్నారు. ఒక జామిపండును మన యిష్టము వచ్చినట్లు రెండు ఖండములుగ గోసి, రెండింటిని యొకచోట చేర్చినయెడల యెట్లు సరిగా నదుకుకొనునో, ఉత్తర దక్షిణ అమెరికాల తూర్పు సముద్రతీరమును, ఐరోపా ఆఫ్రికాల దక్షిణ సముద్రతీరమును, కలియగలవని రెండవ పక్షమువారు తమ వాదమును సమర్థించుకొనుచున్నారు.

## సముద్రములు – మహాప్రళయములు

భూభాగములు గట్టిపడి యొకచో గూర్పబడిన పిదప సముద్రము లేర్పడెను. రాళ్లు గట్టిపడినకాలదెయు, నీటియావిరియు, బొగ్గుపులుసువాయువును పెద్దపెద్ద యూటలవలె పైకెగసి మొదటి వాతావరణముగ మారెను. ఈ వాతావరణ మిప్పటివలె గాక గొప్ప మేఘముల గుంపులవలె భూమిపై నావరించి, నిరంతరము, అంధకారమయముగ జేసెను. చాందినీవలెనున్న ఈ మేఘముల యుపరిభాగమున ఆవిరి చల్లబడి, వర్షరూపమున బడనారంభించెను. కాని పడినంతనే వేడివలన తిరిగి యావిరిగ మారుచుండెను. రమారమి వేయి సంవత్సరములవరకిట్లంధకారమును చొచ్చుకొనలేకపోయెను. తుదకు వర్షపాతముయినను నీరు ఆవిరిగ మారక, భూమిపై నిలిచెను. ఈ మహా

ప్రళయ మెన్ని వర్షములవరకుండెనో యెవ్వ రెఱుంగు దురు? బహుశః కొన్ని శతాబ్దములవరకే ప్రళయ ముండి యుండవచ్చును. చివరకు మేఘములు పలుచ బడి, వర్షమాగెను. సాగరములు సూర్యకిరణములు పడి తళతళ మెరిసెను.

భూమి లోపలిభాగము చల్లబడుచున్న కొలది, ఎండిన విపిలఫలము పైచర్మము ముడుతలు పడు నట్లు, భూమి పైపొరపై నిమ్నోన్నతము లేర్పడగా ఉన్నత భాగములు పర్వతము లయ్యెను. లోపలి యుష్ణము తగ్గుట, పైభారము క్రిందకు నొక్కుట— ఈ రెండు సంఘటనలవలన భూమిలో ప్రచండమైన విప్లవయుతమైన మార్పులు గలిగి కొన్ని సమయముల యందు పర్వతములు లేచుటచే దారుణభూకంపములు, మరికొన్ని సమయములయందు ప్రశాంతముగ నుండు టయు జరుగుచుండెను. ఈసమయములయందే పర్వత శిఖరములపై కుంభపోతగబడు వర్షములచే నందుండు ఖనిజములు కరిగి, పర్వతపార్శ్వములందు వరదలతో కొట్టుకొని వచ్చుటయు, పర్వత పైభాగములనున్న పదార్థములన్నియు వరదలచే తెగగొట్టుకొని వచ్చు టచే శిఖరముల యెత్తు తగ్గుటయు, కొండల మధ్యను గొప్పలోయ లేర్పడుటయు, చెట్లుచేమలులేక కొంత పారుటయు, విశేషము పల్లముకాని మరికొన్ని స్థల ములందు మధ్యధరా సముద్రమువంటి సముద్రములు పుట్టుటయు,—ఇట్లు కొన్ని యుగములు గతించిన వెనుక తిరిగి భూమియొక్క పైభాగము పైన చెప్పిన కారణములవల్ల ముడుతలుపడగా క్రొత్తక్రొత్త పర్వ తము లేర్పడుటయు జరిగెను.—ఇట్టి గొప్ప సంఘ టనలచే భూమియొక్క స్వరూపమంతయు మారుచుం డెను. భూమి చరిత్రయం దీ ఘట్టము మనకు సగరుని యొక్కయు, అతని కుమారుని యొక్కయు, కథను జ్ఞాపకము చేయుచున్నది.

ఒక వెయ్యి మిలియన్ల సంవత్సరములకు పూ ర్వము తూర్పు కెనడాలో ప్రస్తుతము *Hudson Bay* అనబడు అఖాతమువద్ద ఒక మహాభూకంపము పుట్టెను. అప్పుడు కరిగిన శిలాప్రవాహము (*lava*) రమారమి రెండు మిలియన్ల చదరపుమైళ్ళవరకు *Hudson Bay* చుట్టును లేచి, రెండు మైళ్ళ వరకును భూమిపైభాగ మును కప్పివేసెను. *Laurentian shield* అని పిలు వబడు *granite* మయమగు ప్రస్తుతదేశమంతయు అగ్ని

పర్వత ఫలితమే. (*Appalachian chain*) అప్పలా చియన్ పర్వతపంక్తి రెండు వందల మిలియన్ల సంవ త్సరములనాటిది. ఇప్పుడు యూరోపాలో ఆల్ప్సు [*Alps*] వలె మహోన్నతమైయుండెను. కాని, నీటి పారుదలవల్లను, తదితర కారణముల[*erosion*] వల్లను ఇది కృశించి, *New found land* నుండి *Albama* వరకును వ్యాపించియుండు తనప్రాక్తన వైభవమును చాటుచున్నది.

పర్వతములు జనించు విప్లవ యుగముననే మన మిప్పటికిని నివసించుచున్నాము—ప్రపంచమునగల ఎత్తయిన పర్వతములన్నియు, హిమాలయపర్వతములు, రాకీస్ [*Rockies*], ఆల్ప్సు [*Alps*], ఆండీసు [*Andis*]—గతించిన అరువది మిలియన్ల సంవత్సర ముల లోపుననే యుదయించెను. వీటి యన్నింటికిని చిన్నతమ్ముడని చెప్పదగిన ఉత్తర అమెరికా పశ్చిమ తీరముననున్న *Cascades* [కాస్కేడ్స్] అను పర్వ తము పుట్టి మిలియను సంవత్సరములైన కాలేదు. అది పుట్టినప్పుడు కలిగిన భూకంపపుజాడ లిప్పటికిని యీ ప్రదేశమున నచ్చట జూచినను కన్పడును. *Alaska* మొదలు, *Indies* వరకుగల శాంత మహాసముద్రము చుటును అగ్ని ర్వ ములు అగ్ని

వింధ్యకు తమ్మునివంటివి. అన్న పెరుగుట మాని నాడు. తమ్ముడు మాత్ర మింకను నెగుడుచున్నాడను టకు రుజువులు కలవని భూశాస్త్రజ్ఞుల అభిప్రా యము. దీని గర్వము నాపుట కే యగస్త్యుడును రాలేదు. పైని చెప్పుచున్న పర్వతము లచంచలములై ధృతికిని మనోదేహబలములకును నాదర్శములై వెలయు చున్నవి. కాని ఇవి యన్నియు భూదేవి కన్న బిడ్డలు. ఈ పర్వతోద్భవమునందు మన తల్లి పడిన ప్రసవవేద నకు, ఇతర తల్లుల ప్రసవవేదనను గంటనుండి కోటి సంవత్సరములవరకు హెచ్చించినను సరిపోదు. పర్వ తము జన్మించినప్పుడెల్లను, భూదేవి యెంతయో బాధను అనుభవించుచుండెను. ఆమె ప్రశాంతముగ నుండునది ఒక పర్వత జన్మకును, ఇంకొక పర్వత జన్మకును మధ్యగల కాలమే. పర్వతము లుదయించెడి యొక యుగములో మానవుడు కూడ నుదయించెనని శాస్త్రజ్ఞులు చెప్పెదరు.

ఒకానొకప్పుడు భూమిపైకి సముద్రమునుండి బ్రహ్మాండమైన మంచుగడ్డలు వచ్చి, వెనుకకు బోవు

చుండెడివట. ఈ యుగమును *Glacial age* అందురు. మానవుడు భూమిపై పుట్టి రమారమి మిలియను సంవత్సరములైనది. ఈ మిలియన్ సంవత్సరములలో మంచుగడ్డలు నాలుగుసార్లు భూమిపైకి వచ్చి, వెనుకకు మరలెను. చిట్టచివర నిట్టి సంఘటన ఇరవై వేల సంవత్సరములకు పూర్వము తనయుచ్ఛస్థితికి వచ్చెను. భూమి యుపరిభాగమున పదియవ వంతుపై నిప్పటికిని మంచుగడ్డలు గలవు. *Greenland* [గ్రీన్‌లాండ్] *Antartica* [అంటార్టికా] ఉత్తర దక్షిణ ధ్రువములవద్ద ఇప్పటికి, ఇవి అయిదు మిలియన్ల ఘన మైళ్ళ మంచులో వ్యాపించియున్నది. హిమాలయ పర్వతములందలి మంచుగడ్డలే కాదా మొన్నమొన్నటివరకు మానవమాత్రులచటికి బోజాలకుండుటకు కారణము. కాని గత రెండు సంవత్సరములలో *Alps* పర్వతములపైనున్న మంచుగడ్డలు తిరుగుచున్నవనియు, రెండు వందల సంవత్సరములకు పూర్వము పర్వతముల ప్రక్కనున్న హూటెళ్ళు ముందుండె మంచుగడ్డ లిప్పు డదృశ్యము లగుచున్నవనియు, తెలియుచున్నది. ఉత్తర దక్షిణ ధ్రువములగల మంచుగడ్డలు సంవత్సరమున కొకసారి వెనుకకు బోవునట. ఇప్పటి లెక్కలనుబట్టి 20,000 *A.D.* వరకును, అనగా రమారమి 18 వేల సంవత్సరముల వరకును భూమిపై నుష్ణము క్రమక్రమముగా నభివృద్ధి జెందునట. 50,000 *A.D.* అనగా యింకను నలభై ఎనిమిది వేల సంవత్సరములకు మరియొక మంచుయుగము ప్రారంభమగునట. సముద్ర పర్వతములపై మంచు కరిగిన యెడల, తత్ఫలితముగ సముద్రమట్టము నూరడుగులు పెరుగును. ఈ పెరుగుదల న్యూయార్క్, లండన్, పారిస్ మొదలగు నగరములను ముంచుటకు సరిపోవును. భూగోళ చరిత్రలో మానవ ప్రపంచము సముద్రములో కాకిరెట్ట వంటిది. బండి చక్రములు తిరుగుచున్నప్పుడు పై భాగము క్రిందికి వచ్చుటయు, క్రిందిది పైకి వచ్చుటయు, జూచుచున్నాము. ఇట్లే భూగోళచరిత్రయందు గతించిన చరిత్రయే తిరిగి జరుగును. ప్రతిదినము వానలవలనను, ప్రవాహములవలనను ఎనిమిది మిలియన్ల టన్నుల మన్ను సముద్రమునకు తీసికొనిపోబడుచున్నది. కొంతకాలమునకు హిమగిరి శృంగములపై సముద్రము తాండవమాడును. —కొత్త పర్వతములుగూడ నుదయించును. మనము లెక్కపెట్టుటకు వీలులేనన్ని యద్భుతములు గతించగా, నా యుగసంధులందు భూమి ముడుచుకొనిపోవును. అగ్నిపర్వతములు గర్జించును. కొత్త కొత్త నదులు, సముద్రములు పుట్టి, భూమిపై స్వరూపము మారిపోవును.

నక్క పుట్టి మూడు వారములు కాలేదన్నట్లు, ఈ యనంతకాల సృష్టియందు భూమి పసిపాపవలె నుండును. సూర్యు డుండునంతవరకు భూమికూడా ఉండును. సూర్యుడుకూడా ఇతర నక్షత్రముల కన్న చాల చిన్న వయసు వాడే. ఇంక నెన్నియో వేల మిలియన్ల సంవత్సరముల వరకు నతని కుక్షియందలి యగ్ని జ్వలించి జ్వలించి, తుదకా గోళమును నివురు గప్పుటచే నాకాశమును, భూమిని ముంచివేయును. కొన్ని నక్షత్రములలో వేడిమి చురు అపరిమితములు...భూమియు మొదటివలె నగ్నిహోత్రమయమగును. సూర్యదేవుని వాల్మీకి ఆదిత్యహృదయమందేల మృత్యువని వర్ణించెను?

సూర్యగోళమందు ఉదజని వాయువు మండుచున్నది. ఇప్పటినుండి మూడువేల మిలియన్ల సంవత్సరములకును, పదివేలసంవత్సరములకును మధ్య ఎప్పుడో యుదజని సరఫరా తగ్గి, సూర్యగోళమును కొన్ని పరివర్తనలద్వారా యత్యంత యుష్ణముగను, కాంతివంతముగను చేయును. అప్పుడు మెలమెల్లగ భూమి యొక్క వేడి యధికమై జీవులు కృశించి నశించును. మహాసముద్రములు కుతకుత ఉడుకును. సూర్యునికి కూడ మరణ మాసన్నమై, మొదట మెల్లగను, పిదప త్వరితముగను పొంగి పొంగి, విస్తరించి విస్తరించి, విశ్వవ్యాప్తమగు నొక రక్తబింబమై, పెల్లుబ్బిన తన భయంకర శరీరముతో రాక్షసునివలె భూమిని చుట్టివేయును.

లేక సూర్యుడు బాంబువలె ఢామ్ అని బ్రద్దలగునేమో? ఒకేమారు బ్రద్దలగునో, లేక కొన్ని దీపావళి బాణసంచాలవలె పటపటమని ఎన్నోసార్లు

బ్రద్దలై, బ్రద్దలగుకొలంది, పదివేల రెట్లు అధికముగ దేదీప్యమానుడగునేమో. బ్రద్దలగు నక్షత్రములను *Nova* నోవా యందురు. అమావాస్య రాత్రినాడు మనము చూచు పాలవెల్లియందు ఒక కాలమందు దాదాపు ముప్పది నోవాలు గోచరించును. విశ్వము నందుగల పాలవెల్లులలో మనము చూచునది ఒకటే.

మహాప్రళయము సంభవించగనే సూర్యుడు ఉగ్రుడై గోళపు పైపొరలనుండి తేజఃపుంజములను వెదజల్లును. అపు డాతని గర్భమునగల తెల్లని యగ్ని వెలువడి గోళము బ్రద్దలైన ఎనిమిది నిమిషముల లోపున, భూమిని నింపివేయును. పిదప రెండు రోజులకు ఈ (*Radiation*) కిరణప్రసరణవలన గాలి యందుగల సూక్ష్మవాయువులు గూడ అతిసూక్ష్మములై గంటకు రెండు మిలియన్ల మైళ్ళ చొప్పున నెగసి రెగసి, భూమి నగ్నిజ్వాలలతో గప్పి వేయును. అప్పుడు రాళ్ళు ద్రవించును—గాలి కూడ మంటలను గ్రక్కును.

మతగ్రంథములగు బైబిలు, పురాణములు—ఆధునిక వైజ్ఞానికులు—భూప్రళయముగూర్చి చెప్పిన జోస్యము లించుమించు సమానముగ నున్నవి. *Revelation* అధ్యాయమునందుగల మాట లివి.

"And the fourth angel poured out his vial upon the sun····And men were scorched with great heat···and the cities of the nations fell. And every island fled away. And the mountains were not found...."

"అప్పుడు నాల్గవ దేవత సూర్యునిపై పాత్ర నొలికించెను...అప్పు డత్యంత వేడిమిచే మానవులు కాలిపోయిరి......సముద్రమందలి ప్రతి ద్వీపమును పరువులెత్తెను...పర్వతములు మాయమయ్యెను ।"



# భిన్న పరిమాణాల లోకాలవిశేషాలు

శ్రీ వసంతరావు వెంకటరావు

"మీరు చెప్పిన రెండు పరిమాణాల జీవులను గురించి యోచిస్తున్న కొద్దీ వాటి పరిమితత్వానికి వారిపై సానుభూతి కలుగుతూంది. ఇంకే రకం జీవులను నా గూహించుకో లేరుకదండీ?"

అవును. ఒకే పరిమాణాన్ని తెలిసిన జీవుల విషయం మరీ విచిత్రంగా ఉంటుంది. వారికి ఒక్క పరిమాణంయొక్క జ్ఞానమే ఉంటుంది. అది మన మూహించుకోవడం కష్టమే. కాని, వారికిమాత్రం ఒక్క పరిమాణమే తెలుసు; అది పొడవు, పొడవు, పొడవు. తిన్నగా ప్రయాణం చేయడమే ఆజీవు లెరుగుదురు. వారిని 'ఏకపరిమాణ జీవులు' లేక, 'ఏక కీటకాలు' అందాము. మన జీవశాస్త్రజ్ఞులు సైతం వారిని చూచిఉండరు. ఏమంటే, వారికి పొడవు తప్ప మరే పరిమాణంలేదు. క్షేత్రగణిత నిర్వచన ప్రకారం ఋజురేఖకు ఒక్కటే పరిమాణముంది. అది కనిపించదు. అందుచేత, అట్టి జీవులు గోచరించకంటే ఆశ్చర్యంలేదు. అయితే, మన బొమ్మలలో నిరూపణకు తగినట్లు కొంత వెడల్పుగా చూపించాను."

"అట్టివాళ్లు ఎలా బ్రతుకుతారండీ?"

"వారి బ్రదుకునుగురించి నిర్ణయించే అధికారం మనకిలేదు. చిత్రం 1 లో ఏకకీటకం నిరూపింపబడింది. చిత్రం 2 లో ఏకకీటకమే ఒక చిన్న

ద

అ

గీతతో చూపబడింది. దాని విశ్వం అంతా ఒక గీత. ఆ ఏకపరిమాణ విశ్వంలో అది తీవ్రంగా యోచిస్తుంది. ఇంకొక విచిత్రమేమంటే, అది భౌతికంగానే కాక మానసికంగా కూడ ఒకే పరిమాణానికి పరిమితమైయుంది. యావదాకాశం దాని కొక్క గీతలో ఇమిడిపోయింది. ఆ విషయం మన మూహించుకోడానికి అదొక సన్ననిగొట్టంలో—(చిత్రం 3)-సంచరిస్తున్నట్లు భావింపవచ్చును. అంతమాత్రాన్న అది బంధింపబడినట్లు బాధపడదు. ఏమంటే, ఒకటికంటె ఎక్కువ పరిమాణాల జ్ఞానమే దానికిలేదు.

"ఈ ఏకపరిమాణ విశ్వంలో ఒక జీవియొక్క స్థానాన్ని ఒక నిర్దిష్ట బిందువునుండి ఒక్క కొలతతో పూర్తిగా నిరూపించగలం. చిత్రం 2 లో 'అ' నిర్దిష్ట బిందు వనుకొంటే దానినుండి ఈ ఏకకీటకంయొక్క మొగమును 'ప' అను ఒక్క పరిమాణంతో పూర్తిగా నిర్వచించవచ్చును.

"ఈ ఏకకీటకం 'ఆకాశాని కంతుఉందా?' అని ప్రశ్నించుకొని వితర్కిస్తుంది. దానిదృష్టిలో ఆకాశమంటె పొడవే. అందుచేత అదేమనుకొంటుందంటే, 'ఈ ఆకాశం అనంతంగా వ్యాపించి ఉండలేదు; పోనీ, ఎక్కడైనా ఆగిపోతుందా అంటే అక్కడ నుండి ఇంకా పొడవైన గీత ఉన్నట్లూహించుకోగలను' అంటూ తర్కంనుండి విరమిస్తుంది."

"అవునండీ; ఆకాశం విషయమై ఆవిధంగా నేనుకూడా చాలాసార్లు యోచించాను."

"అయితే దానిని మనం పరిష్కారం చేయగలమని నీవు గ్రహించాలి. ఏక కీటకపు విశ్వం ఋజురేఖ కాక అనంతమైన వక్రరేఖ కావచ్చును. చిత్రం 4 లో వృత్తంయొక్క పరిధికి ఆద్యంతాలు లేవు.




దానిపై అవిచ్ఛిన్నంగా ప్రయాణంచేస్తూ యుగాలు గడపవచ్చును. ఆబాటకి అంతు కనిపించదు. అయితే, ఈ విషయాన్ని ఏక కీటకం ఊహించుకోలేదు,

ఏమంటే, వక్రరేఖ అనగానే అర్థము రెండు పరిమాణాల జ్ఞానం కావాలి. ఒక సమతలంలో వక్రరేఖను గీయగలం; కాని, తిన్నగానున్న ఏక పరిమాణంలో వంకరగీత గీయడానికి అవకాశం లేదు. కాబట్టి 'వంకర' అనుభావం ఏక కీటకానికి ఊహాతీతం. రెండు పరిమాణాల నెరిగిన మనం ఆ భావాన్ని సులభంగా గ్రహిస్తాము. ఏకకీటకంలో విశేష మేమంటే, రెండవ పరిమాణజ్ఞానం లేకుండానే వక్రరేఖలో ఇమిడిపోయేట్టు కొద్దిగా వంగుతుంది."

"అదెలా సాధ్యమౌతుందండీ?"

"ఇప్పుడా విషయం చర్చించి ప్రయోజనం లేదు. కాని, తనకు తెలియకుండా వక్రరేఖకు సరిపోయేట్లు ఏకకీటకం వంగుతుందన్నది నిజం. అది ఎంత ప్రయత్నించినా, ఎట్టి ప్రయోగాలు చేసినా, దాని పరిమిత జగత్తును పరిశీలించి, తాననుగమిస్తున్న రేఖ వంకరగా నున్నదని ఎప్పటికీ నిర్ణయించలేదు. చిత్రం 5 లో వృత్తమందు చిన్న భాగం పరిశీలిస్తే అది తిన్నగా నున్నట్లే కనిపిస్తుంది. వృత్తంయొక్క వ్యాసం ఎక్కువైనకొద్దీ వక్రరేఖ కేవలం ఋజురేఖ ఆకారాన్నే వహిస్తుంది. అంటే, తనకు తెలియకుండానే రెండు పరిమాణాల వక్రరేఖలో ఏకకీటకం సంచరిస్తుంది."

"రెండు పరిమాణాల లోకపుజీవుల గురించి మరికొంచెం యోచించాలి. చిత్రం 6 రెండు పరిమాణాల లోకాన్ని నిరూపిస్తుంది. అందులో నివసించేవి ద్వికీటకాలు—వాటికి రెండు పరిమాణాలు జ్ఞానమే ఉంది. ఆ చిత్రంలో ద్విసర్పం చూపబడింది. దానికి పొడుగు వెడల్పులు మాత్రమే ఉన్నాయి, దళసరి లేదు. అది శారీరకంగానూ మానసికంగానూ కూడా రెండు పరిమాణాలకే పరిమితమై ఉంది. అందుచేతనే మూడు పరిమాణాలను చూడగల మన కళ్ళకు అది కనిపించదు.




"ఏదైనా ఒక బిందువుయొక్క స్థానాన్ని రెండుకొలతలవల్ల నిర్ణయించగలమని ద్విసర్పం స్వానుభవంవల్ల తెలిసికొంటుంది. అనుభవసిద్ధమైన ఈ విషయం దానికొక సామాన్య సత్యంగా కనిపిస్తుంది. అయితే, దాని దృష్టికి ఏకకీటకంగాని, మనవంటి మూడు పరిమాణాల జీవులుగాని గోచరించవు. అంతే కాదు; ఏకకీటకాలు, మనుష్యులు, మృగాలు మొదలైన జీవులున్నాయని అది ఊహించుకోలేదు. అంటే, మన మనుగడను నమ్మదు. కాని, మన కళ్ళకి ఏకకీటకాలు, ద్విసర్పాలు కనిపించనప్పటికీ అట్టివి జగత్తులో నున్నాయని నమ్మనప్పటికీ, వాటిని ఊహించుకోగల సామర్థ్యం మనకుంది; వాటికి లేదు.

"రెండు పరిమాణాల లోకపు వింతలను మరికొన్నిటిని గమనిద్దాము. మాటల కూర్పుకోసం ద్విసర్పం తయారుచేసిన రెండు అక్షరాలు, $B$, $D$ లు చిత్రం 7 లో చూపబడ్డాయి. అది పేర్చదలచిన మాటలో వాడుక చెయ్యడానికై దానికి రెండు $D$ లు కావాలి. $B$ ని $D$ గా మార్చడానికెంత ప్రయత్నించినప్పటికి లాభం కనిపించదు. రెండు పరిమాణాలలోకంలో $B$ ని ఏవిధంగా త్రిప్పినా $D$ గా మారదు. మూడవ పరిమాణజ్ఞానం దానికుంటే, $B$ ని పైకెత్తి త్రిప్పగా $D$ గా మార్చవచ్చునని తెలిసికోగలదు. కాని, రెండు పరిమాణాలు మాత్రమే తెలిసిన ద్విసర్పానికి 'పైకెత్తడం' అను పదమే తెలియదు."



"నిజమేనండి. అది కేవలం పరిమితమైనమనస్సుగల కీటకం. దానికంతకంటె జ్ఞానం లేదు."

"అంతగా దానికి సానుభూతి చూపించనక్కర లేదు. మాటకు, కుడికాలు జోడుకి ఎడమకాలు

జోడుకి సహజంగా భేదముందని మనం అనుకోమూ? కుడిజోడునే నాల్గవ పరిమాణంలో త్రిప్పి ఎడమ జోడుగా మార్చవచ్చునని ఎవరైనా చెప్పినప్పుడు మనం నమ్ముతామా?"

"అది అసందర్భం గాదండీ! అట్టి అనుభవం మన కెన్నడూ కలగని చే?"

"ద్విసర్పం కూడా ఆ అక్షరాలనిగురించి అలాగే అనుకొంటుంది. దాని భావాన్ని దాని అనుభవం బలపరుస్తుంది... ఇంకొక విషయం చూడు. చిత్రం 8 లో



ఒక కత్తీ, దాని ఒఱ ఉన్నాయి. అయితే, కత్తి ఒక వైపుకి వంగగా, దాని ఒఱ రెండవవైపు వంగింది. వాటిని చూచి ఒఱలో కత్తిని దూర్చడానికి ఏమాత్రం వీలులేదంటుంది ద్విసర్పం. నీవప్పుడే "ఒఱని త్రిప్పితే సరిపోదా?' అనపోతున్నావు..."

"ఔనండీ! మూడవపరిమాణం నిజంగా ఉన్నది కదా! దానిలో కత్తినో ఒఱనో త్రిప్పితే సరిపోతుంది. నాల్గవపరిమాణముంటే లేదు కాని..."

"ఆవిషయం నీ వెలా చెప్పగలవు? ఏది ఉన్నదో ఏది లేదో చెప్పగలసామర్థ్యం మనకుంటే కదూ? సరే. చిత్రం 9 చూడు. అదొక త్రాడుతో ముడి వెయ్య



డానికి ద్విసర్పం చేసిన ప్రయత్న ఫలితం. తన రెండు పరిమాణాలను దాటి పైకి రావడం, ఎంతమాత్రం, సాధ్యం కాదనుకొంటుంది. అందుచేత, త్రాడుతో ముడివెయ్యడమనే క్రియను అసాధ్యంగా భావిస్తుంది. చిత్రం 10 లో పలుచని రబ్బరు రింగు చూపబడింది— దానికి దళసరి లేదనే భావించాలి. దానియొక్క లోపలి అంచుకి పై అంచుకి వ్యత్యాసం చూపడానికై పై అంచుమీద చుక్కలుంచబడ్డాయి. ఈ రింగుని పై అంచు లోపలికి వచ్చేటట్లుగా త్రిప్పడానికి







ప్రయత్నిస్తుంది ద్విసర్పం. దానిని సులభంగా సాధించవచ్చునని మన మెరుగుదుము. కాని, ద్విసర్పానికిమాత్రం అదొక ఘనకార్యమని గుర్తించాలి. మనవలె రింగుని త్రిప్పలేకపోయినప్పటికి మరొకవిధంగా సాధించడానికి ద్విసర్పం ప్రయత్నిస్తుంది. రింగును అడ్డంగా కోసి, రెండుపరిమాణాలలోనే దానిని వెనుకకు వంచి, తిరిగి అంటిస్తే కావలసినపని అవుతుంది."

"ఓహో, దీనికేదైనా మూడు పరిమాణాల లోకంలో సాదృశ్యముంది కాబోలు!"

"అవును. ఒక రబ్బరుబంతిని కొయ్యకుండా దానిలోపలి తలం పైకి వచ్చేటట్లు త్రిప్పగలవా?

"కొయ్యకుండా ఎలాగ?"

"ద్విసర్పానికి రెండు పరిమాణాలలో రబ్బరు రింగుని కొయ్యకుండా త్రిప్పడం ఎంత అసాధ్యమో, రబ్బరుబంతి విషయం మూడు పరిమాణాల లోకంలో అది అంత అసాధ్యమే! మనమూడవపరిమాణజ్ఞానంతో ద్విసర్పాన్ని వెక్కిరించినట్లు, నాల్గవ పరిమాణజ్ఞానం కలవారు మనలనుకూడా హేళన చేస్తారు. సరే! ఆ విషయం తరువాత చర్చిద్దాం... ఏకకీటకం వలెనే ద్విసర్పంకూడా తన రెండు పరిమాణాల ప్రపంచంలో సంచరిస్తూ, 'ప్రపంచానికంతముందా?' అని యోచిస్తుంది. ఎంత తర్కించుకొన్నా దానికి సమాధానం దొరకదు. ఒక ప్రదేశంతో తన ప్రపంచం అంతమైందనుకొంటే, దాని తరువాత ఇంకా ప్రదేశముండవచ్చునని దానికి స్ఫురిస్తుంది; ఆ భావాన్ని ఎలా సమర్థించడమనేది పెద్ద ప్రశ్న. ఈవిధంగా తిక

మకేలు పడుతుంది. కాని, యథార్థానికి, ద్విసర్పం సంచరిస్తూన్న లోకం కేవల సమతలంగాక అపరిమితమైన వక్రతలం కావచ్చు; అంటే ఒక గోళంయొక్క ఉపరిభాగం కావచ్చును. అయితే, సమతలం వక్రాకారం పొందడానికి మూడవపరిమాణంలో వంగాలి. కాబట్టి, మూడవపరిమాణజ్ఞానం లేని ద్విసర్పం వక్రంగా నున్న గోళ తలాన్ని ఊహించుకోలేదు. చిత్రం 11



గోళాన్ని నిరూపిస్తుంది. గోళంయొక్క వైశాల్యానికి రెండు పరిమాణాలు మాత్రమే ఉన్నప్పటికి, దానికి వక్రాకారం సిద్ధించడానికి మూడవ పరిమాణంయొక్క అవసరం కలిగింది. అట్టి గోళతలంపై ద్విసర్పం సంచరిస్తున్నప్పటికి, వక్రతను ఊహించుకోలేక ప్రదేశం అనావృతంగా ఎట్లుండగలదా అని యోచిస్తుంది. మనకిమాత్రం అదొక విశేష ప్రశ్నగా కనిపించదు. మూడవ పరిమాణంతో కూడిన ద్విధా విస్తృత లోకానికి ఏవిధంగా అంతంలేదో, అదెట్లు అనంతంగాదో మనకు స్పష్టమే.

"ద్విసర్పంయొక్క అవస్థను గ్రహించాలంటే, రెండు ఏకకేంద్ర గోళాల మధ్యనున్న సంకుచిత ప్రదేశంలో అది సంచరిస్తూన్నట్లు భావించు. అంటే కొబ్బరికాయలో కొబ్బరి పెంకుకి కొబ్బరికి మధ్యనున్న భాగంలోగాని, నారింజపండులో తొక్కకి పండుకి మధ్యనున్న ప్రదేశంలోగాని ద్విసర్పం సంచరిస్తూందనుకో. అది కష్టమంటావా? రెండు పరిమాణాల మనసుకి కష్టమేమీ కనిపించదు. ఆ మధ్య ప్రదేశంలో దాని ఇష్టానుసారంగా రెండు పరిమాణాలలో విహరించే స్వేచ్ఛ ద్విసర్పానికుందిగదా! అందుచేత అదేమీ బాధపడదు. కాని, దాని పరిమితత్వాన్ని బోధపరచుకోవాలంటే, దాని చుట్టూ ఒక గీత గీశారనుకొందాము—చిత్రం 11. వెంటనే దాని స్వాతంత్ర్యం నశించిపోతుంది. ఎటువైపు కదలలేక బాధపడుతుంది. గీతను దాటలేదని మరచిపోకు."

"ఆమాత్రం గీతనే దాటలేదంటారా?"

"దాటలేదు. గీత గీయగానే, ఎంత దళసరి లేకపోయినా, ఆగీత మూడవపరిమాణంలోనికి పెరిగింది. చిత్రం 11 కొంత పెంకు పగలగొట్టిన కొబ్బరికాయను



నిరూపిస్తుంది. కొబ్బరిమీద ద్విసర్పముంది. దాని ప్రక్కనేఉన్న పెంకును ద్విసర్పం గుర్తించలేదు. పెంకుపై ఈగ వాలిందనుకొందాము. ఈగ నివసించే లోకంగురించి ద్విసర్పానికి తెలియనే తెలియదు. దాని ప్రక్కనే ఈగ ఉన్నప్పటికి ఆ రెండు పరిమాణాలలోకజ్ఞానమే ద్విసర్పానికి లేకపోవడంచేత, ఈగను చూడలేదు, గుర్తించలేదు; పెంకుపై మరొక వక్రతలముందని ఊహించలేదు. కాని, ఒకతలంనుండి మరొకతలానికి వెళ్ళగల ద్విసర్పముంటే, అది గారడీ చేయగలదు. కొబ్బరిపైనున్నంతసేపు తోడివారికి కనిపిస్తుంది, వారితో సంప్రతిస్తుంది. ఏదోవిధంగా కొబ్బరినుండి పెంకు పైకి చేరుకొనే అవకాశాన్ని చిక్కించుకోగానే, కొబ్బరిని విడిచినప్పుడల్లా మాయమౌతుండడం, కొబ్బరిపైకిరాగానే తిరిగి కనిపిస్తుండడం జరుగుతుంది. రెండుపరిమాణాల మనస్సుని బుద్ధిపూర్వకంగా వికసింపచేసికొని, మూడవపరిమాణంలో ప్రయాణించగల సామర్థ్యాన్ని సంపాదింపకలిగిన ద్విసర్పం ప్రతీదీ ఆవిధంగా తమలోకాన్ని విడిచిపెట్టి వేరొక ద్విధావిస్తృతలోకానికి పోయి, తిరిగి తమలోకాన్ని చేరుకొంటూ, యథేచ్ఛగా అదృశ్యమై

సాక్షాత్కరిస్తూ ఉండగలదు. పెంకుపైనున్న ఈగకు మాత్రం విశేషం కనిపించదు."

"ఏమండోయ్! మీ ధోరణి చాలా దూరం పోయేటట్లుందే? మనం చతుర్థా విస్తృతలోకంలో నివసిస్తున్నామనీ, మనకి మూడు పరిమాణాల జ్ఞానం మాత్రమే ఉందనీ, మన చుట్టుప్రక్కల ఎన్నెన్నో మూడు పరిమాణాల లోకాలున్నాయనీ, అయినప్పటికి మూడు పరిమాణాల లోకానికే మన యోచన పరిమితమై ఉండుటచే వాటిని గుర్తించలేకున్నామనీ, నాల్గవ పరిమాణజ్ఞానాన్నే మనం పెంపొందించుకో కలిగినట్లైతే మనంకూడా స్వేచ్ఛగా మాయమై, తిరిగి ప్రత్యక్షం కాగలమనీ సూచిస్తారా ఏమిటి?..."

"నేనేమీ సూచించను. ఒక్క పరిమాణ లోకం, రెండు పరిమాణాల లోకం—వీటిగురించి కొంత నేర్చుకొన్నాము. ఆయా లోకాలలో నివసించు జీవులు ఎట్టి పరిమితత్వాలకి లోనైయున్నారో గమనించాము. ఏ లోకనివాసులైనా వారి లోకానికి సంబంధించిన పరిమాణాలకంటె మరొక్క పరిమాణ జ్ఞానాన్ని సంపాదించిన పక్షమందు, వారికి ప్రత్యేకమైన సమస్యలను ఎంత సులభంగా పరిష్కారం చేసికోగలరో తెలిసికొన్నాము. రెండవపరిమాణ జ్ఞానంగల ఏకకీటకమూ, మూడవ పరిమాణజ్ఞానంగల ద్విసర్పమూ, వాటివాటి లోకాలలో అసాధారణంగా ప్రవర్తించి అద్భుతాలను ప్రదర్శించగలవని గ్రహించాము. ఏ లోకంలోని ప్రాణులైనా భౌతికంగా పరిమితమైయున్నారు. అందుచేత వారికి సహజంగా కొంత జ్ఞానం అలవడుతుంది; వారి లోకాలగురించి, ప్రకృతిగురించి కొన్ని అభిప్రాయాలు వారికేర్పడతాయి. అదే జ్ఞానసర్వస్వమని సంతృప్తినొందినవారికి ఏ సమస్యలు జనించవు. కూపస్థమండూకాలలాగ వారు సుఖంగా జీవించవచ్చును. అట్టి తృప్తిలేక, విశేషజ్ఞానమార్జించడానికి పూనుకొనేవారు కొందరుంటారు. వారనేక విధాల యోజించి, మానసికంగా పరిశ్రమ చేసి, ప్రకృతిసిద్ధమైన ప్రతిబంధకాలను తొలగించుకొనే విధానాల నన్వేషించి పురోగమిస్తారు. ఈ సత్యం ఒక్క పరిమాణ లోకానికీ, రెండు పరిమాణాల లోకానికీ వర్తించినప్పుడు మూడు పరిమాణాల లోకానికి మాత్రం ఎల వర్తించదు?"

"నాకు మతిపోతూందండీ! భౌతిక విజ్ఞానమంటూ, ప్రత్యక్షజ్ఞానమంటూ, ప్రయోగమంటూ మెల్లమెల్లగా మరో లోకానికి తీసికొనిపోతున్నారు. ఒక్కసారిఆగి, దీని పర్యవసానమేమిటో జాగ్రత్తగా యోచించుకొంటేకాని మీరు చెప్పేవిషయాలను అవగాహన చేసికొనడం కష్టమనిపిస్తూంది."

"తథాస్తు"





# కలగూరగంప

## జగన్నాథుని రససూత్రము: ఒక సందేహము

ఆలంకారిక మార్గమును సుపరిష్కృతే మొనర్చిన వారిలో జగన్నాథ పండితుడు కడపటివాడు. ఈయన వ్రాసిన రసగంగాధర మను గ్రంథము అలంకారశాస్త్రమునందు శిరోమాణిక్యమువంటిది. చాల ప్రసిద్ధమైనదియు కూడ. జగన్నాథుడు ఈ గ్రంథమును కేవల పాండిత్యప్రకర్షకొఱకు గాని, యితరులను వారి మతములను దూషించుటకు గాని వ్రాసినది కాదు. సాహిత్యమునుగూర్చి యనంతకాలము మననముచేసి యాయా విషయములను నిష్కృష్టముగా లక్ష్యలక్షణసమన్వయ పూర్వకముగా సహృదయ లోకమునకు సుస్పష్టముచేయుటకై యాయన యీ గ్రంథమును రచించెను.

నిమగ్నేన క్లేశైః మనన జలధేరంతరుదరం
మయోన్నీతో లోకే లలిత రసగంగాధరమణిః

అని గ్రంథాదియందు నాయన పేర్కొనెను. కావున ఆ గ్రంథముయొక్క మర్యాద యిట్టిది. ఇట్టిదిగానే ఆసేతుశీతాచలము పరిగణితమయినది.

ఆలంకారిక సిద్ధాంతము లెనిమిది. రస, అలంకార, గుణ, రీతి, ధ్వని, వక్రోక్తి, అనుమాన, ఔచిత్యము లని. ఈ యెనిమిది సిద్ధాంతములలో ధ్వని సిద్ధాంతమునందు తక్కినవన్నియు నంతర్భవించును. అందుచేత ధ్వని సిద్ధాంతమును సుస్పష్టముగా నెఱింగికొన్నచో దక్కినవానిని తడవబని లేదు. ఈ ధ్వని మూడు విధములు. వస్త్వలంకార రసములు. వస్త్వలంకారములు కూడ రస తాత్పర్యముతో సంగృహీతములు కావలయుననుట రసధ్వనికే మూర్ధాభిషేక మొనర్పబడినది. కావున రససిద్ధాంత మన్నను ధ్వని సిద్ధాంతమన్నను నొక్కటిగనే గుప్తపాదుని నాటినుండి పరిగణింపబడుచున్నది. ఆలంకారికు లందఱిలో నీ గుప్తపాదులకున్న గౌరవము మఱియొకరికి లేదు. ధ్వన్యాలోకకర్త యానందవర్ధనాచార్యుడును దానికి వ్యాఖ్యానమగు లోచనమును రచించిన ఈ యభినవ గుప్తపాదులును వీరిద్దఱు ఆలంకార శాస్త్రమున నొక రాచబాట నిర్మించిరి. వీరినిగూర్చి జగన్నాథ పండితుడు

"ధ్వనికృతా మాలంకారిక సరణి వ్యవస్థాపకత్వాత్."

అని చెప్పి వారియందలి పూజ్యభావమును వెల్లడించెను.

భరతుని రస సూత్రమును వ్యాఖ్యానించిన వారిలో నీ యభినవగుప్తునకు విశేషగౌరవముండెను. తరువాత వచ్చిన మమ్మటాదులు గుప్తపాదుని వ్యాఖ్యానమునే పరమప్రమాణముగా స్వీకరించిరి. గంగాధరకర్తకూడ తాను అద్వైత సంప్రదాయమును అనుసరించి రససూత్రమును వ్యాఖ్యానించినను అభినవగుప్త మమ్మటభట్టుల మార్గమున కవిరోధముగనే వ్యాఖ్యానించితినని చెప్పుకొనెను. సంగ్రహముగా గుప్తపాదుని మతమిది. ప్రతిజీవికిని చిత్తమునందు అనేక జన్మాంతరాగత సంస్కారములు నిక్షిప్తములై యుండును. వానియందు భావములు నలుబదియొకటి. అందు స్థాయిభావము లనునవి యెనిమిది. రతిహాస శోక భయాదులు. నిర్వేదాది ముప్పదిమూడు, వ్యభిచారి భావములు. ఇవి విభావానుభావములచే నుద్బుద్ధములై హృదయసంవాద తన్మయీక్రమమున సహృదయునకు చర్వణాగోచరమగును. ఈ చర్వణాసారమే రసము. చర్వణ యనునది వ్యాపారము. దీనికి వ్యంజన యని నామాంతరము. కావున రసానుభూతి వ్యక్తి. వ్యభిచారి చర్వణ, స్థాయి చర్వణమునం దుపయోగపడుచున్నది. కావున సూత్రమునందు వ్యభిచారి గ్రహణము చేయబడినది. స్థాయి చర్వణయందు విభావానుభావ వ్యభిచారభావము లుపయోగపడుచున్నవి. కావున నీ మాటయందును చర్వణోపయోగిత్వము సంగ్రహించుటకై "విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః" అని భరతుడు సూత్రీకరించెను. ఇచ్చట సంయోగమన వ్యంజన మనియు నిష్పత్తి యన వ్యక్తి యనియు గుప్తపాదుడు వ్యాఖ్యానించెను. ఈ సిద్ధాంతమునుబట్టి సర్వకావ్యమును విభావానుభావములను సమర్పించును. ఈ విభావానుభావములు సహృదయుని హృదయమున సంస్కార

రూపముననున్న స్థాయిభావమును చర్వణాగోచర మొనరించును. చర్వ్యమాణములగు వ్యభిచారులు స్థాయిచర్వణమునం దుపకృతములగును. కావున సహృదయుడు అనుభవించునది స్వచిత్తవృత్తులనే గాని పరగతములను కాదు. ఆ యీ విషయము వ్యాఖ్యానించిన గంగాధర రససూత్రమున గుప్తపాదుని సిద్ధాంతమునకు విరుద్ధమగు నంశ మొకటి కలదు. ఆ యంశమును విశదముగా విచారించుటయే యీ వ్యాసమునకు ముఖ్యోద్దేశము.

గంగాధర రససూత్ర మిది. "సముచిత లలిత సన్నివేశచారుణా కావ్యేన సమర్పితైః సహృదయ హృదయం ప్రవిశ్య తదీయ సహృదయతా సహకృతేన భావనా విశేషమహిమ్నా విగలిత దుష్యంత రమణీత్వాదిభిః అలౌకిక విభావానుభావ వ్యభిచారి శబ్దవ్యపదేశ్యైః శకుంతలాదిభిః ఆలంబనకారణైః చంద్రికాదిభి రుద్దీపనకారణైః అశ్రుపాతాదిభిః కార్యైః చింతాదిభి స్సహకారిభిశ్చ సంభూయ ప్రాదుర్భావితేన అలౌకికేన వ్యాపారేణ తత్కాల నిర్వర్తిత ఆనందాంశావరణ అజ్ఞానేన అతఏవ ప్రమృష్ట పరిమిత ప్రమాతృత్వాది నిజధర్మేణ ప్రమాత్రా స్వప్రకాశతయా _ న నిజస్వరూపానందేన సహగోచరీక్రియమాణః ప్రాగ్వినివిష్ట వాసనారూపో రత్యాదిరేవ రసః"

ఉచితమును లలితమును నగు సన్నివేశముచే సుందరమైన కావ్యము శకుంతలాది ఆలంబనకారణములను చంద్రికాది ఉద్దీపన కారణములను అశ్రుపాతాది కార్యములను చింతాది సహకారులను సమర్పించును. ఇవి సహృదయ హృదయమునందు ప్రతిబింబించును. ఈ సహృదయునికి ఒక భావనావిశేషము కలదు. అనగా పునఃపున రనుసంధానము చేయు నొకానొక ప్రజ్ఞావిశేషము అన్నమాట. ఈ భావనావిశేషము ప్రవర్తించుటలో నతని సహృదయత్వముకూడ సహకరించును. సహృదయుని హృదయమునందు ప్రతిబింబితములైన ఆలంబనోద్దీపన కారణములను కార్యములను సహకారులను ఈ భావనావిశేష మహిమచే నతడు భావించును. అప్పుడు ఆలంబన కారణమైన శకుంతలాదియందు ఉద్దీపనకారణమైన చంద్రికాదియందును కార్యమైన అశ్రుపాతాదియందును సహకారియైన చింతాదియందును దుష్యంత సంబంధిత్వము తొలగిపోవును. అప్పుడు ఈ కారణకార్యసహకారులందున్న కారణత్వము తొలగిపోయి విభావాదిత్వము సిద్ధించును. ఈ విభావాదు లలౌకికములు.

ఇప్పుడు యీ ఆలంబనోద్దీపనకారణములు ఆలంబనోద్దీపనవిభావములనియు కార్యములు అనుభావములనియు సహకారులు వ్యభిచారులు అనియు చెప్పబడును. వీనిచేత సహృదయుని హృదయమునందు ఒక యలౌకికమగు వ్యాపార ముద్భవించును. ఈ వ్యాపారము ఆనందాంశమునకు అనగా ఆత్మకు ఆవరణముగా నున్న అజ్ఞానమును తొలగించును. ఈ యజ్ఞాన ధ్వంసమగుటతోడనే సహృదయునియందున్న త్రిపుట జ్ఞానము తొలగిపోవును. అప్పుడాతనికి స్వస్వరూపానుసంధానము అనగా ఆత్మదర్శనము కలుగును. ఈ యాత్మచైతన్యము స్వప్రకాశమగుట వాస్తవము; మూకుడుచే కప్పబడిన దీపము ఆయా మూకుడును తొలగించినంత తాను ప్రకాశించుచు సన్నిహిత పదార్థములను ప్రకాశింపజేయునట్లు విభావానుభావ వ్యభిచారులచే నుద్బుద్ధమైన అంతఃకరణ వృత్తులగు రత్యాదులనుకూడ నీ యాత్మచైతన్యము ప్రకాశింపజేయును. ఈవిధముగా రత్యాదిస్థాయిభావము నిజస్వరూపానందముతోపాటు సహృదయునకు గోచరమగును. ఈ రత్యాది స్థాయిభావములు సహృదయుని చిత్తమునందు అనేక జన్మాంతరాగతములై వాసనారూపమున నుండును. ఇట్లు నిజస్వరూపానందముతో బాటు సహృదయగోచరమగు రత్యాదియే రసము. సాక్షియగు నాత్మచైతన్యముచేత భాసింపజేయబడుట వలన స్థాయిభావమునకు రసత్వము సిద్ధించును. భగ్నావరణచిద్విశిష్టమైన రత్యాదిస్థాయి భావము రసమని అభినవగుప్త ముమ్మటభట్టాదుల యభిప్రాయమని జగన్నాథుడు చెప్పెను. ఇందుచేత స్వయంసిద్ధముగా ఆత్మచైతన్యమునకు ఆవరణరూపమున నున్న అజ్ఞానమును ధ్వంసమొనర్చుట యని గంగాధరకర్త వ్యాఖ్యానించెనని సుస్పష్టము. కావున అభినవగుప్తపాదులకు అవిరుద్ధముగనే సిద్ధాంతమును ప్రతిపాదించుట జగన్నాథుని కభిప్రేతమని మనము గ్రహింపవలయును. కాని పై సూత్రమునందు గుప్తపాదుని సిద్ధాంతమునకు విరుద్ధము అగు నంశము ఒకటున్నది.

పై సూత్రమునందు సహకారికారణములు (చింతాది) సహృదయ హృదయమును ప్రవేశించి పునఃపున రనుసంధీయమానములై సాధారణీకృతి పొంది వ్యభిచారిభావములగుచున్నవి అని చెప్పబడినది. కాని వ్యభిచారిభావములు చిత్తవృత్తులగుటచే బాహిరములు కానేరవు. రత్యాది స్థాయిభావములవలెనే వానికి కూడ విభావానుభావములచే చర్వణాగోచరత్వము చెప్పవలయును. చిత్తవృత్తులైన యీ చింతాది వ్యభిచారులు విభావాదులవలెనే సహృదయ హృదయ

ప్రవిష్టము లెట్లగునో దుర్బోధముగా నున్నది. సహకారి కారణములు వ్యభిచారులుగా పర్యవసించుననుట గుప్తపాదునిమతమునకు పూర్తిగా విరుద్ధము. అంతియే కాదు. జగన్నాథ పండితుని భావలక్షణమునకుగూడ విరుద్ధము. 'విభావాది వ్యజ్యమాన హర్షాద్యన్యతమత్వం తత్త్వ'మని జగన్నాథుని భావలక్షణము. బాహిరములగు సహకారి కారణములు వ్యభిచారులుగా పర్యవసించుచో వీనియందు విభావాది వ్యజ్యమానత్వ మెట్లు కుదురును? విభావాదులు స్థాయిభావమున కెట్లో సంచారికిగూడ నట్లే వ్యంజకములగును. అదిగాక లోకమున సహకారికారణమని వేఱొండు లేదు. చింతాదులు లోకమున దంపతుల పరస్పరానురాగమునకు నిఘటకములగుచుండగా కావ్యమునందు ప్రతీయమానములై రసవ్యంజకము లగుచున్నవని గుప్తపాదుడు చెప్పెను. అందుచేత వ్యభిచారిభావములు సహృదయ హృదయనిష్ఠములగు సంస్కారములే కాని కావ్యసమర్పితములు కావు. సర్వకావ్యము విభావానుభావములనుమాత్రమే సమర్పించును. ఆ విభావానుభావములు స్థాయి నెట్లో వ్యభిచారి నట్లే వ్యజ్యమాన మొనరించును వ్యజ్యమానమగు వ్యభిచారులు స్థాయి చర్వణమునందు విభావాదులవలెనే యుపయోగపడును. కేవలము వానియం దుపయోగిత్వము సంగ్రహించుటకైయే భరతుడు రససూత్రమునందు విభావానుభావాదులతోబాటు వానినిగూడ గణించెను. అంతియే కాని పరకీయ చిత్తవృత్తి గమ్యమగునని కాదు. "అతఏవపరకీయా న చిత్తవృత్తిర్గమ్యత ఇతి కారణేన విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిరితి సూత్రే స్థాయిగ్రహణం నకృతం తత్ప్రత్యుత శల్యభూతం స్యాత్. స్థాయినస్తు రసీభావే ఔచిత్యాదుచ్యతే. తద్విభావానుభావోచిత చిత్తవృత్తి సంస్కార సుందరచర్వణోదయాత్ హృదయ సంవాదోపయోగి లోక చిత్తవృత్తి పరిజ్ఞానావస్థాయాం ఉద్యాన పులకాదిభిః స్థాయిభూతరత్యాద్యవగమనాచ్చ. వ్యభిచారీతు చిత్తవృత్త్యాత్మత్వేపి ముఖ్య చిత్తవృత్తి పరవశ ఏవ చర్వ్యత ఇతి విభావానుభావమధ్యే గణితః అత ఏవ రస్యమానతాయా ఏషైవ నిష్పత్తిః యత్ప్రబంధ ప్రవృత్తి బంధుసమాగమాదికారణోదిత హర్షాది లౌకిక చిత్తవృత్తిన్యగ్భావేన చర్వణారూపత్వం" అని గుప్తపాదుడు చెప్పెను. జగన్నాథుని సూత్రమునందు కావ్యసమర్పితత్వము సహృదయహృదయ ప్రవిష్టత్వము విగలిత దుష్యంత రమణీత్వాదిత్వము విభావానుభావములందువలెనే వ్యభిచారులందుకూడ సమముగా నన్వితము లగుచున్నవి మఱియును సహకారి కారణములు వ్యభిచారిభావములుగా వ్యపదిష్టము లగుచున్నవని సూత్రమునందు కంఠోక్తిగా చెప్పబడెను. గుప్తపాద మతానుసారముగా సూత్రమును అన్వయింతమన్నను ఏ కొంచెము వీలును లేదు. జగన్నాథుని మాటలకు అత డుద్దేశించిన తీఱున తప్ప యింకొకతీఱున నర్థము చెప్పుటకు వీలు లేదు. మమ్మటుని వాక్యములవలె జగన్నాథుని వాక్యములు అటునిటు లాగుటకు వీలు లేదు. అది జగన్నాథుని గొప్పతనము.

మఱియొకచోటగూడ జగన్నాథుడు వ్యభిచారి భావములను గుఱించి యిట్లే భావించెను. "అర్థమాత్రస్య విభావానుభావ వ్యభిచార్యన్యతమత్వాత్" ఇచ్చట నర్థమనగా బాహిరజగత్తునందలి సర్వపదార్థము నని యర్థము. ఈ సర్వపదార్థము కావ్యగతమైనపుడు విభావానుభావములుగనే పర్యవసించును. అర్థమాత్రమునందు విభావత్వమో యనుభావత్వమో యుండవచ్చును. వ్యభిచారిత్వ మెట్లుండును? అర్థశబ్దమునకు సంస్కారరూపములగు చిత్తవృత్తులనుకూడ నర్థముగా స్వీకరించినచో నప్పుడు స్థాయినికూడ స్వీకరింపవలసి యుండును. జగత్తునందలి వస్తువు స్థాయిగా నెట్లు పర్యవసించదో వ్యభిచారిగాగూడ నట్లే పర్యవసించదు. స్థాయివ్యభిచారులందు ముఖ్యాముఖ్యత్వరూపమగు భేదమున్నదికాని వానియందు చిత్తవృత్తిత్వరూపధర్మము సమానమే.

పై గ్రంథమునుబట్టి గంగాధర రససూత్రమునందు వ్యభిచారిభావములగుఱించిన భాగము గుప్తపాదుని సిద్ధాంతమునకు విరుద్ధముగా నున్నదని నా యభిప్రాయము. లేక కావ్యమునందు పరకీయ చిత్తవృత్తియగు వ్యభిచారి గమ్యమానమగునని చెప్పుట జగన్నాథుని కిష్టమని చెప్పి సూత్రము నన్వయింతమన్నను వీలు కానరాదు. వ్యభిచారివిషయమున పరకీయ చిత్తవృత్తి గమ్యమానమగునేని స్థాయివిషయమున నట్లేల యంగీకరించరాదు? రెండును చిత్తవృత్తులేకదా! చెప్పినస్థాయి వ్యభిచారులు రెండును పరకీయ చిత్తవృత్తులనియే చెప్పవలయును. లేనిచో స్వచిత్తవృత్తులని చెప్పవలయును. పరకీయచిత్తవృత్తులని చెప్పినచో నుత్పత్తివాదమునందో యనుమితివాదమునందో పడిపోవలసి వచ్చును కావున నట్లు చెప్పుటకు వీలు లేదు. వ్యభిచారికూడ స్వచిత్తవృత్తియనియే చెప్పుట వ్యక్తివాదుల కిష్టము. జగన్నాథపండితుడు మననతరితీర్ణవిద్యార్ణవుడు. అట్టి మహాపండితుడు ఇది యెఱుంగడనుట భావ్యము కాదు. కాని యీపాఠమే ఆసేతుశీతాచలము పఠనపాఠనములం దున్నది. మఱియొకతీరున నున్నట్లు కానరాదు. నేనీవిషయమును కొంతమంది స్నేహితులతో బాగుగా జర్చించితిని. ఈ

దోషము నింకొకతీఱుగా సమర్థించుట ఎన్నో నాబుద్ధికి గాని వారిబుద్ధికి గాని తప్పులేదు ముఖ్యముగా మనవి చేయునదేమన సంశేషు తీయంశమును లెస్సగా విచారించి గుప్తపాఠునిమతమున కవిగుద్దురుగా వ్యాఖ్యానించుట కవకాశమేమైన కలదేమో ప్రతికొఘ్యమున తెలియజేయుదురని. అంతియే కాని జగన్నాథుని యట్టి మహానుభావునియందు దోషోద్ఘాటన మొనరించుట నాయుద్దేశము కాదు.

శ్రీ ఘూళిపాళ శ్రీరామమూర్తి

# రగడ శాసనము

ఇప్పటికి లభించిన తెనుగు శిలాశాసనాలలో క్రీ. శ 6 శతాబ్దినాటి మాలెపాడు వచన శాసనమే మొట్టమొదటిది. దీని మూల మిట్లున్నది :

'స్వ. శ్రీ సోమమహారాజుల్లోకేన
ఇన్పుఖ్యోలి
అణపోతులు రేవణకాలు పుద్దణ
కాలు ఇచ్చిన ప
న్నస పెన్నాఱు ఇశేరేనికిఙ్
తేనిష్టచ్చి నవాస్తు [ప]
[ఞ్చ1] మహా పా[త]కున్తకుఙ్!
అసి వైరువులికితమ్.

దీని రూపాంతరము :

'స్వస్తి. శ్రీ సోఱమహారాజు ల్లొకేన
ఇన్పుఱోలి
అణపోతులు రేవణకాలు పుద్దణ
కాలు ఇచ్చిన ప
న్నస పెన్నాఱు ఇశేఱేనికిఙ్
తేని ఱచ్చిన వాస్తు ప
ఞ్చమహా పాతకున్నకుఙ్
అసి వైరివులికితమ్'2

ఇవి రెండును సుప్రసిద్ధ చారిత్రికులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రకటించిన క్రమపాఠములె. ఇది 'చోడమహారాజు' కాలమునాటి దాన చరిత్ర.

శ్రీ శర్మగారు దీనికాలము మొదట క్రీ. శ. 8 శతాబ్దమని, పిమ్మట క్రీ. శ. 6 శతాబ్దమని మార్చి, నిశ్చయించి యున్నారు. కాలము మార్పుకు సాధనము లుండకపోవు. దీని కర్థ మిదియై యుండవచ్చును.

'సంధిమును గాక. శ్రీ చోడమహారాజుల సమ్మతిన ఇన్పుఱోలు అనపోతులు రేవణకాలు పుద్దణకాలు ఇశేరేనికి నిచ్చిన పన్నస పెంపారె దీని హరించిన వాంకు పంచమహా పాతకుండగును. అసి వైరువు వ్రాత.

ఇది కేనాటి భూదానమును తెలుపు వచన శాసనమైనను, దీనిలో 'రగడ' పాదముకూడ మిళితమై యున్నది. వచనములోని 'రేవణకాలు, పుద్దణకాలు' —దాతల పేర్లు రగడ కన్వయమగుచున్నవి.

'ఇచ్చిన పన్నస పెన్పాఱె
ఇశేరేనికిన్.'

ఇందు రెండవపాదము లేకపోయినను, వాక్య రచన పద్యానుగుణముగా మారియున్నది. రగడ విలక్షణముగా ఉన్నది తాళానుకూలముగా పంచ లఘు గణములు లేవు. వడిస్థానము 11 నుండి 14 మాత్రకు మారినది. ఎంతమారినను, ఈ ద్విరదగతి రగడలో 'ఇరవై' మాత్రలును, 'ఇ—ఇ' వడియు మారలేదనుట నిర్వివాదము. రెండవపాదము లేనందువల్ల ప్రాసనియమ మెట్టిదో? తెలియదు.

తెలియకపోయినను, ఈ చోడమహారాజు —రగడకు పిమ్మట గర్భకవితో దాహరణగా రచించిన చోడకవి రాజశిఖామణి రగడవల్ల ప్రాసలక్షణము నూహింపవచ్చును.

'అసిధారఁ బొల్పెసఁగె జ
యకాంత కాంతరద
దపదాత ఖడ్గలత జ
యశ్రైత్ర సంపదన్.'3

ఇది చంపకమాలలో ఉదాహరణగా ఇమిడి యున్న ద్విరదగతి రగడ. దీనిలో 'ఆద్యంత ప్రాసంబు లభేద్యంబులు—రగడలెల్ల' అను నిర్బంధప్రాస కవకాశము లేదు.

3 చ.

కరిశిరమాడ షణ్ముఖుఁడు
గ్రైపునఁ వేయుడుఁ గుంభమార్తి కో
త్కర మసిధారఁ బొల్పెసగెఁ
దారకు భంగమునూచి నవ్వ సం
గర జయ కాంతకాంతరద

1. వ్యాస సంగ్రహము (1933).
2. వృషసంవత్సరాది సంచిక (1941)

కాంచిమెకొదని నాఁటుదీరి వి
స్ఫురదవదాతఖ్యాతిలత
చనెనా జయచైత్ర సంసదన్.

ఇందలి 'ఎత్తుగీతి, ద్విరదగతి, జంపె—రగడ' కథను సూచింపక, వి. శ. 1111 వర్షంబునకు జయ సంవత్సర చైత్రశుద్ధ 8 మంగళవార కృత్తికా కాలము— అనగా 15-3-1054 తేది చోడకవి రచనాకాలమును సూచింపగలిగియున్నది.

ఇట్లు రగడలలో క్రమేణా యతిస్థానము ప్రాస స్థానముల నిర్బంధము ఎక్కువై వర్ధిల్లించక తప్పదు. కావున, భారత కవి నన్నయభట్టును పూర్వము రగడలు లేవనుట భ్రమ.

ఇక నీ సన్ని చోడకవి పూర్వ కవిస్తుతిలో సూచించిన 'గొప్ప చరిత్రకూ' సవరింపతగిన యున్నది.

'మునుమార్గ కవితలోకం
బున వెలయఁగ దేశికవితఁ
బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు
మొదలుగఁ బలువుర్.'

ఇందలి 'దేశికవిత పుట్టించిన చాళుక్యరాజు' కంటె పూర్వమే 'దేశికవిత పుట్టించిన చోళమహారాజు' కలడనుటకీ రగడశాసన కాలము తోడ్పడుచున్నది. క్రీ. శ. 6 శతాబ్దినాటికి గేయములు లేనిచో, ఇట్టి గద్యలో రగడపాదము దొర్లియుండదు కదా!

ఇంతవరకు గద్య—రగడను భాషా వేత్తలు గుర్తించకపోవుట చోద్యము.

శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

# యజ్ఞోపవీతము-దాని పరిణామము

యజుర్వేదములో వస్త్ర యజ్ఞోపవీతమును గురించి చెప్పబడినది. అనగా ఆ కాలములో పై యుత్తరీయమునే ఉపవీతమనగా జందెముగా ధరించెడివారని దానినిబట్టి గ్రహింపవచ్చును. దీనికి దృష్టాంతముగా శాసన శిల్పములలోగూడ అట్టి దృష్టాంతములు లభించుచున్నవి. ఈ వస్త్ర యజ్ఞోపవీతము ఎడమప్రక్కకు ధరించుచు వచ్చినట్లు ప్రాచీన విగ్రహాలవల్ల స్పష్టమగుచున్నది. బార్హుతు, బోధిగయ, అమరావతి, సాంచి శిల్పములలో వస్త్ర యజ్ఞోపవీత ధారణ బింబములు కనబడుచున్నవి. పాట్నా, కావేరి పాకములలోని శిల్పములలో యజ్ఞోపవీతము వస్త్రధారణ పద్ధతినే చెక్కబడినది. దియోఘర్ (*Deogarh*) లోని యొక శిల్పములో దుప్పితోలును, తలయు చిహ్నములుగా గల్గిన జందెము వేయబడినది. ఇక్ష్వాకురాజుల కాలమునాటి కిది సూత్రకములతో గూర్చబడి యుండెననుటకు చిహ్నములు లభించుచున్నవి. అమరావతి, నాగార్జునకొండ శిల్పములందిట్టివి కనబడుచున్నవి. కాని 1 వ శతాబ్దిలోను, తత్పూర్వమును ఉండిన కాళిదాసు మహాకవి తన కుమార సంభవములో ముక్తా యజ్ఞోపవీతమని చెప్పియుండుటవల్ల నా కాలము నుండియు నందు ముత్యములు కూర్చుచు వచ్చినట్లు స్పష్టపడుచున్నది. ఇట్టి శిల్పము లింకను అజంతా, బాదామి, శిల్పములందును, మదరాసు మ్యూజియము నందలి యొక శిల్పమునందును గోచరించును. ఈ చివరివి చాళుక్య పల్లవ చోళరాజుల కాలములలోనివిగా కనబడుచున్నవి.

దక్షిణదేశములో మధ్యయుగమునాటి శిల్పములందు డబుల్ గంటలుమధ్యగా నుంచిన జందెములు కనబడుచున్నవి. కొన్నిటిలో రిబ్బనులోను, కుచ్చుల లోను ఇది కనబడుచున్నది. ఈ రెండు రకములు మదరాసు మ్యూజియమునందలి శిల్పములందున్నవి.

యజ్ఞోపవీత ధారణలో చాల వ్యత్యాసములు శిల్పములందు కానవచ్చుచున్నవి. పాము మెలికలవలె నుండుట, కుడిచేతిమీదుగా నుండుట, కటి సూత్రముగా నుండుట, ఉదరబంధమునకు సంబంధించి యుండుట, ఇత్యాదులు. స్వర్ణవైకక్షకమునకు సంబంధించినట్లుకూడ యొక శిల్పమున నున్నది. వీనినిబట్టి క్రమముగా యజ్ఞోపవీత మొక యలంకార తుల్యముగా భావించుచు, నాయా కాలములలో వారివారి యిచ్చల ననుసరించి దానికి కుచ్చులు, ముత్యములు, బంగారుతో నిర్మించుట, ఇత్యాది సంస్కరణలు కలిగించి యుండవచ్చునని తేలుచున్నది*.

శ్రీ కొత్త - భావయ్యచౌదరి.

* ఈ విషయములు ఆర్కియాలజికల్ డిపార్టుమెంటువారు ప్రచురించిన "*Ancient India, Vol*-6లోని శ్రీ సి. శివరామమూర్తిగారి వ్యాసమునుండి గ్రహించినవి. వారికి కృతజ్ఞుడను.

# గ్రంథ విమర్శనము

## తెనుగు కవుల చరిత్రము

రచయిత: నిడుదవోలు వెంకటరావు గారు, యం.ఎ., మద్రాసు విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనసంస్థ తెనుగుశాఖ అధ్యక్షులు, ప్రకాశకులు: మద్రాసు విశ్వవిద్యాలయము. రాయల్ సైజు, పుటలు 394. వెల రూ. 12.

తెనుగు కవులను గూర్చిన చరిత్రలు ఇదివరకు లేకపోలేదు. క్రీ. శ. 1829 లోనే, వాఙ్మయ పరిశోధన యింకను ప్రాథమికావస్థయందున్న కాలముననే, శ్రీ కావలి వేంకటరామస్వామి యను మహనీయుడు ప్రప్రథమముగ నిట్టి చరిత్ర నొకదానిని రచియించి నాందీప్రస్తావన చేసినాడు. దాని నాధారముగాఁగొని, అటుపిమ్మట జరిగిన వివిధ పరిశోధనల ఫలితములను సమన్వయించి, మరి పల్వురుగూడ నిట్టి చరిత్రలు రచించి యున్నారు. వానిలో ప్రముఖమైనవి శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారి రచనయు, శ్రీ వీరేశలింగము పంతులు గారిరచనయు. అందులోను శ్రీ వీరేశలింగము పంతులుగారి 'కవుల చరిత్ర' అగ్రస్థానమున నెన్నదగినది. అది ఒకవిధమైన క్రమవ్యవస్థతో కూర్చబడినది. ఎవరో కొందరి ప్రస్తావన లేకపోయినను, ఆదినుండి గత శతాబ్దిదాక గల ప్రధాన కవులందరి ప్రస్తావనతో అది ఒకవిధముగా సమగ్రస్వరూపమునుగూడ సంతరించుకొన్నది. ఇప్పటికిని అదియే ప్రామాణికముగా పరిగణింపబడుచున్నది. గత శతాబ్దిదాక వెలువడిన యీ రచనలేకాక యీ శతాబ్దిలోను కొన్ని వెలువడినవి. అందులో ప్రస్తుతమింకను కొనసాగుచున్న చాగంటి శేషయ్యగారి రచనయొకటి. దాని నొక పథకముతో వారు రచింపఁబూనినారు.

ఇప్పు డిది యింకొకటి. ఉన్నవి యుండగా క్రొత్త వెందుకన్న వితర్క మర్థములేనిది. కేవలము వాఙ్మయ పరిశోధన ఫలితములపై నాధారపడిన యిట్టి చరిత్ర, ఎప్పటికప్పుడు ఇనుమిక్కిలిగా బయటపడుచున్న సాధనసామగ్రితోను, పండితప్రకాండుల వికసనశీలమైనవిమర్శన ప్రజ్ఞాప్రాభవముచేతను వాఙ్మయపరిశోధనలు నిరంతరాయముగ కొనసాగుచున్నంతకాలము ఎడతెగునట్టిది కాదు. ఒక్కొక్క రచనలోను ఒక్కొక్క క్రొత్తదనము ఉండనేయుండును. కాదనుట కాని బుద్ధి. పైపెచ్చు భావిరచయితలకు, పూర్వోత్తర విషయ సమన్వయ విషయములో ఇట్టివి ఎంతైనను ఉపకరించితీరును. కావున నిట్టి వెన్నయినను వాంఛనీయములే.

వెంకటరావుగారు పాతిక ముప్పది సంవత్సరములుగా ఆంధ్రవాఙ్మయ పరిశోధన కృషిలో నిరంతర సాధన చేయుచున్నవారు. విషయసేకరణలో విశిష్టులు. కవులయొక్కయు, కావ్యములయొక్కయు నిఖిలవిషయములు ఈయనకు కరతలామలకములు. అవి ఈయన నాలుకమీద నాడుచుండును. ప్రసంగము వచ్చినప్పుడు, తడవుకోకుండ, వాని నన్నిటిని ఏకరువు పెట్టగల ధారణ వీరి సొమ్ము. అట్టి వీరు పని కట్టుకొని పూని సాగించిన యీ రచనలో వాఙ్మయాభిమానులు సరిక్రొత్త విషయములను ఎదురుచూచుట సహజము.

ఇందులో వీరు వేసుకొన్న ప్రణాళికయు, పొందుపరచిన క్రొత్త పోకడలును గ్రంథాదిలోనే విస్తరముగా వివరింపబడినవి. ఆ ఆశయములు హర్షింపదగినవనుట కెంతమాత్రమును సందేహములేదు. నిజమున కిందులో కొన్ని క్రొత్తలు లేకపోలేదు. పూర్వరచయితలకన్న వీరు పోయిన క్రొత్తపోకడ శాసనములను గూడ కావ్యములుగా పరిగణించి, వాటి రచయితలను కవులుగా లెక్కించి చరిత్ర కెక్కించుట. రెండవది: కవుల జీవితములు, వారి కాలములతో మాత్రమే తృప్తిచెందక వారి గ్రంథముల స్వరూపమును గూర్చియు, వాని ప్రాముఖ్యమును గూర్చియు, సాహిత్యమున వాని స్థానమును గూర్చియు, వానియందలి విశేషములను గురించియు ప్రస్తావించుట. స్థూలదృష్టికి ఇది కేవలము శాసనగ్రంథముగా తోచవచ్చును గాని, చెదరువాటుగా నున్న తెనుగు శాసనములనన్నిటిని ఏకత్ర సమకూర్చిపెట్టి, చరిత్ర రచయితల కృషికి సులువు కల్పించుట మెచ్చదగినది. భాషావిషయమునను, వాఙ్మయ విషయమునను శాసనములు వహించెడి పాత్రను వెంకటరావుగారు ఓపినంతమట్టుకు శ్రద్ధగా వివరించినారు. అట్లే తదితర కావ్యరచయితల వాఙ్మయ విశేషములను వివరించు

టలో గూడ కొన్ని కొన్ని క్రొత్తలు చూపినారు. కొన్ని శాసనముల విషయములోను, నన్నయ, సోమనాథుడు మొదలైన కొందరు కవుల చరిత్రలలోను వీరు చాల విశేషములను చూపెట్టినారు. ఎవరి యూహలు వారివి కాబట్టి, వీని విషయమున వితర్కము లున్నచో విశేషము కాదు.

తెనుగుకవుల యీ చరిత్రను వీరు రెండు సంపుటములుగా విభజించినారు. అందులో ఇది తొలి సంపుటము. ఇందులో ప్రాచీనకాలమునుండి క్రీ. శ. 1250 దాక వెలసిన చిన్న, పెద్దకవులనందరిని, మూడు ఖండములుగా విభజించి, చేర్చినారు. మొత్తముమీద దాదాపు 125 మంది కవులీ సంపుటములోనికెక్కినారు. ఈ కాలపరిధిలో ఇంతమంది కవులు ఇదివర కెవరి గ్రంథములోనికిని ఎక్కలేదనుట సర్వవిదితము. తదాది 1500 దాక వెలసిన కవులనందరిని రెండవ సంపుటమునకు పెట్టుకున్నారు. అదియు మూడు ఖండములుగా నుండునట. అయితే, తరువాతి కవుల ప్రమేయ మెత్తుకొనకపోవుట యెందుకో గ్రాహ్యముగుటలేదు. ఈ చరిత్ర వర్తమాన యుగముదాక కొనసాగినచో సమగ్రమైయుండును. అర్థాంతరముగ వదలుట చింత్యము.

ఈ చరిత్ర రచనలో వెంకటరావుగారు పరిశోధన ప్రపంచములో నేటివరకు ప్రవర్తిల్లిన ఆకరముల నన్నిటిని యథోచితముగా, యథాసంభవముగ వినియోగించుకొనియుండుట ఆ ప్రపంచములో వీరికిగల బహుముఖ కృషిని చాటుచున్నది. కాని, ఒక్క కించిత్తుకు వాలుమాలుటవల్ల వీరు లేనిపోని విమర్శలకు గురియగుదురేమో యన్నదే మా భయము. ఆ ఆకరములను వినియోగించుటలో ఎక్కడికక్కడ, వాని వాని రచయితలను, పునరుక్తికి వెనుదీయక, పేర్కొని యుండినచో సరిపోయెడిది.

చారిత్రిక సత్యములలోను, వాఙ్మయ విశేషములలోను విమర్శకు తావలములైన కొన్ని యంశములు అక్కడక్కడ ఇందులో పొడగట్టుచున్నవి. ఈ చరిత్ర వాఙ్మయ పూర్వోత్తర సందర్భములను పరికించినచో ఇట్టివి సర్వత్ర గోచరించెడివే. వానిని సహృదయతతో సరిపెట్టుకొనిపోవుట పాడి. కావుననే వాని నన్నిటిని, దోషైకదృష్టితో శృంగగ్రాహికగా చూపించు జోలి పెట్టుకొలేదు.

వస్తు విషయములో మాట ఎట్లున్నను ముద్రణ విషయములో ఈ కూర్పునందు తొందరపాటు బాహాటముగా కనిపించుచున్నది. అచ్చు తప్పులకు లెక్క లేదు. అధోజ్ఞాపికలలో ఎన్నిచోట్లనో అస్తవ్యస్తములు కనిపించుచున్నవి. విశ్వకళాపరిషత్తు ప్రచురణములో — అందునను ప్రామాణిక గ్రంథముగా పరిగణింపబడవలసిన గ్రంథములో ఇట్టివి సహింపరానివి. మలిముద్రణములో ఇట్టివి రాకుండ చూచుకోవలెనని కోరుచున్నాము.

మొత్తముమీద ఇదియొక అపూర్వ గ్రంథము. ధైర్యము చేసి, కొత్తపంథా త్రొక్కినందుకు వెంకటరావుగారభినందనీయులు.

---

## విశ్వనాథసాహిత్య సంచిక

విశ్వశ్రీ. విశ్వనాథ సాహిత్యసంచిక. సంపాదకుడు: పురాణపండ రామమూర్తి. ఆలమూరు, తూర్పుగోదావరిజిల్లా. వెల: రెండురూపాయలు.

విశ్వశ్రీపత్రిక ఆంధ్రపాఠకలోకానికి సుపరిచితమయినది. ఈ పత్రికా సంపాదకులీసంచిక ప్రత్యేకంగా విశ్వనాథ సంచికగా వెలువరించారు.

దీనిలో దిగుమర్తి సీతారామస్వామి, ఘూళిపాళ శ్రీరామమూర్తి, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, దివాకర్ల వెంకటావధాని మొదలయిన వ్యాసరచయితలు శ్రీ సత్యనారాయణగారిలోను వారి రచనలలోను గల ప్రత్యేక విషయాలు ఎత్తిచూపుతూ వ్యాసాలు రచించారు.

వీటిలో జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారు వ్రాసిన మనిషి మనీషి, దిగుమర్తి సీతారామస్వామిగారి తెలుగుఋతువులు, ఘూళిపాళ శ్రీరామమూర్తిగారి నిర్మాణమార్మికత ప్రత్యేకంగా పేర్కొనదగిన రచనలు. వీటిలో రుక్మిణీనాథశాస్త్రిగారు సత్యనారాయణగారి వ్యక్తి, కవిత్వ వ్యక్తి పాఠకులకు విస్పష్టంగా వ్యక్తీకరించారు. శ్రీ సీతారామస్వామిగారు 'తెలుగు ఋతువులు'లో సత్యనారాయణగారి ఆంధ్రదేశీయ ప్రకృతివర్ణన చాతుర్య రహస్యాలు వెల్లడిచారు. ఘూళిపాళ శ్రీరామమూర్తిగారు రలంకార

దృక్పథంతో సత్యనారాయణగారి రచనా రహస్యాలు వివరించారు.

ఇంకా మల్లాదివసుంధర, పొట్లపల్లి సీతారామారావు, దాశరథి, సంపత్ మొదలైనవారు సత్యనారాయణగారి ఛాత్ర ప్రియత్వాన్ని గురించీ ఇంకా వారి రూపక కథాది రచనలను గురించీ సంగ్రహంగా వ్యాసాలు రచించారు.

సత్యనారాయణగారు కవిగా, కథకులుగా, నవలా రచయితగా, విమర్శకులుగా, ఒక ప్రత్యేకమైన ఆధునిక కవితా ప్రవర్తకులుగా సముజ్జ్వల ఖ్యాతి గడించుకొన్నవారు. పెద్దతరం వారిలో ఇంతటి విషయ వైవిధ్యము, రచనా బాహుళ్యము, గాంభీర్యము ప్రదర్శించిన రచయితలు మరి కనబడరు.

ఇంతగా ఈ రచయితలందరు ఇన్ని విధాలుగా వ్యాసాలు వ్రాసినా సత్యనారాయణగారి కృతులు, రచనారీతులు మొదలైనవి చాలావరకు అర్థస్పృష్టాలుగానో, అసంస్పృష్టాలుగానో మిగిలిపోయినట్లే స్ఫురిస్తున్నాయి.

ఈ సంపుటి సత్యనారాయణగారి సాహిత్యాభినందన సంపుటిగా ఉద్దేశింపబడినట్లు కనబడుతున్నది. అందుచేతనే ఈ సంపుటిలో వ్యాసాలన్నీ ఎక్కువగా అభినందనాత్మకంగానే ధ్వనిస్తున్నాయి. గాని మరి వీటిలో నిశితంగా గుణదోష పరీక్ష చేసే దృష్టి కనబడదు.

ఈ వ్యాసాలన్నింటిలోను సత్యనారాయణగారే స్వయంగా వ్రాసిన 'నేను—నా రచన' అనే వ్యాసం ఒక్కటే పాఠకుల హృదయాల్లో విద్యుద్వల్లికలాగ మెరిసిపోతూ వారి రచనా రహస్యాలు విరజిమ్ముతున్నది.

సంపాదకులీ సంచికలో సత్యనారాయణగారు సంస్కృత భాషలో రచించిన 'అశని నిరాసమ్' అనే సంస్కృతరూపకం ఒకటి ప్రకటించారు. దీనిలో సంస్కృత రచనా శక్తి ప్రత్యేకంగా పేర్కొనదగినది.

ఈ రోజుల్లో సంస్కృత రచనలు సాగించే తెలుగువార నేకులు కనిపిస్తున్నారు. వీరిలో చాలామంది వ్రాసేది కేవలము తెలుగు సంస్కృతము. కాని సత్యనారాయణగారి రచనలో అంతటా సర్వాంగీణమైన సాంప్రదాయక గీర్వాణ శైలీ మాధుర్యం జాలువారుతున్నది. దీనితో బాటిందులో సత్యనారాయణగారి ప్రత్యేక వ్యక్తిముద్రకూడా అంతర్లీనమై భాసిస్తూ ప్రాచీన సంస్కృతకవి ప్రాభవం స్ఫురింపజేస్తున్నది.

సంపాదకులీ సంచిక సింహావలోకనంలో "కాని, చలనచిత్ర చకోరాక్షివిలాస ప్రచురమైన నేటి కళాభిరుచి వర్తకసరళినుంచి సారస్వత ప్రాభావము వైపు తిరుగను వాశ కలుగకుండుటచే ఈ చాపలము మాకు ప్రబలమై ఈ ప్రచురణమునకు త్రోవ తీసినదని వినయపూర్వకముగా మనవి చేయుదుము." అన్నారు. ఇది అక్షరాలా నిజం. ఈ పరిస్థితుల్లో ఇలాంటి సంచిక ప్రచురించడం తేలికైన పని కాదు.

అయినా సంచిక విశ్వశ్రీ సంపాదకుల సాహిత్య తపస్వితకు, నిరతికీ, ఉత్సాహానికీ, ఒరపిడి రాయిలా ఉన్నది. ఈ విషయంలో విశ్వశ్రీ సంపాదకులు ప్రశంసనీయులు.

వీరింకా తెలుగుదేశంలో ప్రఖ్యాతిపొందిన ఆయా రచయితల ప్రత్యేక వ్యక్తిత్వం స్ఫురింపజేసే సంచికలు ప్రకటించగలరనీ క్రమంగా అవి సారస్వతాభిమానులలో సత్క్రమాభిరుచి సంపాదించగలవనీ ఆశిస్తున్నాను.

## శ్రావణము

[పద్యకావ్యము]

గొట్టుముక్కుల రామకృష్ణశాస్త్రి అరుణాశ్రమము, నవాబుదురు. కాకినాడ వెల: 2–8–0.

దీనిలో దశరథుని శాపవృత్తాంతానికి సంబంధించిన కథ ప్రధానమైనది. కవి ఈ కావ్యంలో

మునికుమారునికి శ్రావణుడని పేరుపెట్టారు. అందుచేత ఈ కావ్యానికి కూడా ఇదే పేరు వచ్చింది.

అయితే గ్రంథకర్త ఈ కథలో మరి ఒక కల్పితోపాఖ్యానం చేర్చారు.

దీనిలో మొదట ఊర్వశీ నలకూబరులు ఉద్యాన విహారం చేస్తూ, కుబేరుని శాపంవల్ల భూలోకంలో జన్మిస్తారు. నలకూబరుడు శ్రావణుడు. ఊర్వశికూడా శాపోపహతురాలై భూలోకంలో ఇందిరగా జన్మిస్తుంది. ఈమె క్షత్రియ కన్యక.

ఈ శ్రావణమునికుమారుడు బ్రాహ్మణుడైతే దశరథునికి బ్రహ్మహత్యాపాతకం సంభవిస్తున్నదనే భయంతో వీరలిన్ని వైశ్యకుమారుడుగా మార్చివేశారు! చివరికి దశరథునికి మునికుమారహననదోషమేకాక అతని తల్లిదండ్రుల దేహత్యాగదోషంకూడా సంక్రమిస్తుంది.

మునికుమారుణ్ణి వలచిన ఇందిరకూడా చివరికి నిరాశవల్ల ప్రాణాలు విడిచివేస్తుంది.

కాని మరణానంతరం మునికుమారుడైన శ్రావణుడు, ఇందిర తిరిగీ ఊర్వశీ నలకూబరులై చైత్రరథోద్యానవనంలో విహరిస్తారు. సంగ్రహంగా దీనిలోని కథ ఇది.

ఈ గ్రంథానికి పీఠిక వ్రాస్తూ శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు "అయాసన్నివేశములను, భావములను చిత్రించుటలో కవిగారు చూపిన లోకజ్ఞత, సంయమము, దృష్టివిశాలత, సహృదయత, ధారాపవిత్రతయు, చాలా శ్లాఘార్హములు." అని వ్రాశారు.

ఈ కావ్యంలో కవికి కథ కట్టడంలో అంతగా నేర్పున్నట్టు కనపడదు. కథ అంతా అతికించినట్టుగా స్ఫురిస్తుందిగాని, ఇది ఇలాగే జరిగిఉంటుందనే భావం కలిగించడంలేదు.

ఇక స్వభావపోషణాదుల్లో అక్కడక్కడ కొన్ని గట్టి దోసగులు కనిపిస్తున్నాయి.

నలకూబరుడు వనవిహారం చేసేసమయంలో వనపాలకుడాతన్ని నివారింపపోతే నలకూబరుడతన్ని "దవుదలఁ బసులన్" "ప్రహరించడము" అపైన చెట్టుకొమ్మపైకెక్కి పూలుకోయడము, అంత ఉదాత్తంగా లేవు. అలాగే కుబేరుడిచ్చిన శాపంకూడా అసంభావ్యంగానే కనిపిస్తున్నది.

అలాగే శ్రావణుడు చిన్నతనంలో పలక, పుస్తకాలు పట్టుకొని బడికి వెళ్ళటంకూడా ఆ కాలానికి అననుకూలంగా స్ఫురిస్తున్నది.

అయితే ఈ కవి రచనలో శిష్టమైన పదరచన, చక్కని ధారాశుద్ధి ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఈ క్రింది పద్యాలు వీరి రచనా పరిణతికి చక్కని నిదర్శనాలు.

ఇవి నలకూబర విహార ఘట్టంలోనివి.

లలితాపాంగము మాత్రనే
భువనజాలం బెల్ల గగ్గోలుగా
సలుపం జాలిన సుందరీమణి వి
లాస ప్రౌఢ గాంధర్వ కౌ
శల సమ్మానిత దివ్యనర్తనకళా
సర్వజ్ఞయౌ నూర్వశీ
లలనారత్నము నవ్వుచున్ ప్రణయ
మొల్కన్ వెంట దోతెంపగన్.

జలిబిలి తీవ పందిరుల
సెంగటు బచ్చని శాద్వలంబులం
దలయుల సెజ్జలందు
వికచాబ్జ పరీమళ భాసురంబులౌ
కొలనుల చెంత సుంత మితిగోరని
కోరికతో విహారముల్
సలుపగవచ్చె యందపవనం బెదురై
కడు సందడింపగన్

Printed & published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

Bharathi, February 7th. 1954 Regd. No. 1856

# మెక్లీన్స్‌తో 14 రోజులలో ధవళతరమైన దంతాలు



ఇంతకు పూర్వమే వేలకొలది నిరూపించారు.

14 రోజులలో తెల్లటి దంతములు పొందుట ఇప్పుడు మీవంతు. దీనియం న్యాయంగా యుండండి. దీనిని మనస్ఫూర్తిగా ఉపయోగించి చూడండి-నిత్యం-రోజు రెండుసార్లు-సమగ్రంగా మెక్లీన్సుతో పళ్లుతోముకోండి. ప్రత్యేక సూత్రంప్రకారం తయారైన మెక్లీన్సు పళ్లమీది అసహ్యకరమైన మరకలను మృదువుగాను, నిరపాయంగాను తొలగించి, వాటి సహజమైన తెల్ల దనాన్ని ప్రస్ఫుట మొనర్చుతుందని ప్రారంభించినది లగాయతు మీరు గుర్తిస్తారు, 14 రోజులలోపున-శేక, ఇంకా అంతకన్న లోపుననే-మీరు గర్వపడ దగినట్టి-మెక్లీన్ ధవళదంతాలు-ఆరోగ్యకరమైన దంతాలు-కలిగివుంటారు.

**క్లోరోఫిల్ చేర్చబడినదికూడా**

మెక్లీన్సు పెరాక్సైడ్ టూత్ పేస్టు-దంతాలను తెల్లబరచడానికి ప్రపంచంలో సర్వోత్తమమైనది - ప్రకృతి సిద్ధమైన దుర్గంధ నివారిణియగు క్లోరోఫిల్ చేర్చ బడినదికూడా లభిస్తుంది.




# మెక్లీన్స్

## పెరాక్సైడ్ టూత్‌పేస్టు దంతాలను ధవళతరమొనర్చుతుంది

MTY-32-TEL